# చంద్రాలోక సమున్మేషము

స్ఫూర్తిశ్రీ








పీయూషవర్ష జయదేవకవి
చంద్రాలోక పంచమ మయూఖమునకు వ్యాఖ్యానము
అడిదము సూరకవి రచించిన
ఆంధ్రచంద్రాలోకమునకు విమర్శ

# చంద్రాలోకసమున్మేషము



స్ఫూర్తిశ్రీ
టి. భాస్కరరావు ఎం. ఏ.,
లెక్చరర్, ఏ. సి. కాలేజి, గుంటూరు.

మహతీ గ్రంథమాల
అరండల్ పేట - గుంటూరు.

# సంకృతి

ఉపన్యాసక చక్రవర్తి
దర్శనాచార్య సాహిత్యాచార్య
మహోపాధ్యాయ లాక్షణికశిరోమణి ప్రౌఢభారతి
నవవిద్యానాథ శాస్త్రవిశారద రసజగన్నాథ
బ్రాహ్మీభూషణ ధర్మవిద్యాప్రవీణ విద్యామహేశ్వర
అభినవానంద భారతీతీర్థ సాహిత్యసమ్రాట్
ప్రభృతి బహుబిరుద విరాజితులు
సహృదయ హృదయమణులు
విద్వద్విద్వద్వరులు
శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ మహోదయులకు
సభక్తికముగా సమర్పితము





ఇది

పీయూషవర్ష జయదేవకవి చంద్రాలోకమునందలి

పంచమ మయూఖమునకు వ్యాఖ్యానము

అడిదము సూరకవి రచించిన

ఆంధ్రచంద్రాలోకమునకు విమర్శనము



# మానసోల్లాసము

"ఉల్లాసాయ విచారవీచి నిచయాలంకార వారాంనిధే
శ్చంద్రాలోకమయం స్వయం వితనుతే పీయూషవర్షః కృతీ" (1-2)

పీయూషవర్షుడు చంద్రాలోక నిర్మాత. ఆలోచనాతరంగసంభృతమైన యలంకారవారాశికి ఉల్లాసమును గలిగించుటకై చంద్రాలోకమును నిర్మించెను. ఇది స్వయముగా గ్రంథకర్త చెప్పినవిషయము. ఆయనయే గ్రంథాంతమున నిట్లు చెప్పికొనెను.

"పీయూషవర్షప్రభవం చంద్రాలోకం మనోహరం
సుధానిధాన మాసాద్య శ్రయధ్వం విబుధా! ముదమ్" (10-5)

"జయన్తి యాజ్ఞిక శ్రీమన్మహాదేవాంగ జన్మనః
సూక్తిపీయూషవర్షస్య జయదేవకవేర్గిరః" (10-6)

పీయూషవర్షునివలన జనించిన సుధానిధానము మనోహరమునైన చంద్రాలోకమును పొంది సంతోషమును గాంచుడని పండితుల నామంత్రించుట మొదటిశ్లోకమునందలి విషయము. మహాదేవనందనుడు సూక్తిపీయూషవర్షుడునైన జయదేవకవి వాక్కులు వర్ధిల్లునుగాక యని యాశంసించుట రెండవశ్లోకవిషయము. ఈశ్లోకములనుబట్టి పీయూషవర్షునకు జయదేవునకు నద్వయీభావము సిద్ధించుచున్నది. పీయూషవర్షుడే జయదేవుడు. జయదేవుని బిరుదనామముకాని కవితానామముకాని పీయూషవర్షుడు కావచ్చును. 'సూక్తిపీయూషవర్షస్య' అన్నప్రయోగమే యీయూహకు బలమిచ్చుచున్నది.

సంస్కృతసాహిత్యక్షేత్రమునందు జయదేవ నామధేయులు పెక్కురుగలరు. ఔఫ్రెక్ట్ (Aufrect) అను జర్మనీదేశపండితుడు తాను సిద్ధముచేసిన సూచీపత్రము నందు పదునైదుగురు జయదేవులను పరిగణించెను. కాని వారిలో పీయూషవర్షుడైన జయదేవుడొక్కడే. ఈతనితండ్రి మహాదేవుడు; తల్లి సుమిత్ర. ఈ విషయము ప్రథమ మయూఖాంతశ్లోకమున విశదమగుచున్నది.

"మహాదేవః సత్రప్రముఖమఖవిద్యైక చతురః
సుమిత్రా తద్భక్తిప్రణిహితమతిర్యస్య పితరౌ
అనేనాసావాద్యః సుకవిజయదేవేన రచితే
చిరం చంద్రాలోకే సుఖయతు మయూఖః సుమనసః" (1-16)

ప్రసన్నరాఘవనాటకమునుగూడ జయదేవుడే రచించెను. అతనికి పీయూషవర్ష నామధేయము కానరాదు. అయినప్పటికి నాతని తల్లిదండ్రులుగూడ సుమిత్రా మహాదేవులే యగుటచేత చంద్రాలోకకర్తయు నాతడు నభిన్నులేయని నిశ్చయము చేయవచ్చును. ఆగ్రంథము వ్రాయునాటి కాతని కాబిరుదము వచ్చియుండకపోవచ్చును. ప్రసన్న రాఘవమునందలి ప్రస్తావనాశ్లోకము లివి —

"కవీంద్రః కౌండిన్యః స తవ జయదేవశ్రవణయో
రయాసీదాతిథ్యం న కిమిహ మహాదేవతనయః" (14)

"లక్ష్మణస్యేవ యస్యాస్య సుమిత్రాకుక్షిజన్మనః
రామచంద్రపదాంభోజభ్రమద్ భృంగాయతే మనః" (15)

కాబట్టి జయదేవుడు చంద్రాలోకము నేకాక ప్రసన్నరాఘవ నాటకమునుగూడ రచించెనని తేలుచున్నది. కొందరు గీతగోవింద కృతికర్తకూడ నీతడే యనవలయునని కుతూహల పడుదురు. కాని వారి కుతూహలము తీరదు. గీతగోవిందకర్త తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను—

"శ్రీభోజదేవప్రభవస్య రామాదేవీసుత శ్రీజయదేవకస్య
పరాశరాదిప్రియవర్గకంఠే శ్రీగీతగోవిందకవిత్వ మస్తు" (12-11)

ఈ యనతండ్రి భోజదేవుడు; తల్లి రామాదేవి; కొందరు పాఠాంతరమును గ్రహించి రాధాదేవియని యందురు. ఎట్లన్నను గీతగోవిందకర్త చంద్రాలోకకర్త యగుటకు వీలులేదు. ఇట్లే పక్షధర జయదేవుడు మొదలగువారినిగూడ తల్లిదండ్రుల పేరులే ప్రతి పక్షమున నిలుపుచున్నవి.

ఇప్పుడింక జయదేవుని కాలమునుగూర్చి విచారింతము. జయదేవుడు కావ్య లక్షణమునుగూర్చి చెప్పుచు నొక ఖండకావ్యమును వాడెను. అది యిది.

"అంగీకరోతి యః కావ్యం శబ్దార్థావనలంకృతీ
అసౌ న మన్యతే కస్మాదనుష్ణమనలం కృతీ" (1-8)

'అనలంకృతములైన శబ్దార్థములను కావ్యముగా నంగీకరించినవాడు అనలము ననుష్ణ ముగా భావింపడేల?' అని ప్రశ్నించెను. ఇది "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" అన్న కావ్యప్రకాశకర్తయగు మమ్మటుని లక్ష్యము చేసికొన్నది. దీనినిబట్టి జయదేవుడు మమ్మటునికి పిమ్మటివాడు. మమ్మటుడు భోజదేవప్రశంసాపరమైన పద్యము నుదాత్తాలంకారమునకు నుదాహరణముగా నిచ్చెను. కావున మమ్మటుడు భోజ దేవునకు సమకాలికుడుకాని అనంతరకాలికుడుకాని కావలయును. భోజదేవుడు క్రీ. శ. 1010 నుండి 1055 వరకు రాజ్యపాలనముచేసినట్లు చారిత్రకుల నిర్ణయము. కావున, ఇది మమ్మటునకు పూర్వావధి. కావ్యప్రకాశ ప్రాచీనతమవ్యాఖ్యాతలలో రాజానకరుయ్యకు డొకడు. ఇతడు కాశ్మీరమున సుస్సల జయసింహుల రాజ్యపాలన కాలమున నుండెను. వారి రాజ్యకాలము క్రీ.శ. 1150 ప్రాంతము. ఇది మమ్మటునకు ఉత్తరావధి. తన గ్రంథమునకు వ్యాప్తికలిగి వ్యాఖ్యానము పుట్టవలయునన్న ఆకాలమున నర్ధశతాబ్దియైన పట్టి యుండును. కావున మమ్మటుడు పదునొకండవశతాబ్ది యుత్తరార్థమున నుండియుండును. రుయ్యకుడు తన యలంకార సర్వస్వమునందు 'తుల్యబలవిరోధో వికల్పః' అని లక్షణమును దెల్పి దీనిని పూర్వులు వివేచనము చేయలేదని తెల్పెను. టీకాకారుడైన జయరథుడు దానిని రుయ్యకోపజ్ఞమనియే సంభావించెను. జయదేవుడు చంద్రాలోకమున దానిని

యథాతథముగా గ్రహించెను. అట్లే విచిత్రాలంకారము మొదలైన పెక్కింటివిషయమున జయదేవుడు రుయ్యకునకు ఋణపడియున్నాడు, కాబట్టి జయదేవుడు రుయ్యకునకు సైతము పిమ్మటివాడు. కాబట్టి రుయ్యకునికాలము (క్రీ.శ. 1150) ఇతనికి పూర్వావధి.

ఉత్తరావధి చూతము. జయదేవుని ప్రసన్నరాఘవమునందలి 'కదలీ కదలీ కరభః కరభః' అని మొదలయిన (1-37) పద్యమును సాహిత్యదర్పణకర్తయైన విశ్వనాథుడు అర్థాంతరసంక్రమిత వాచ్యమున కుదాహరణముగా ప్రదర్శించెను. విశ్వనాథుడు పదునాలుగవ శతాబ్ది పూర్వార్ధమున నుండెను. సింగభూపాలుని రసార్ణవసుధాకరమునందు 'ప్రత్యంక మంకురిత సర్వరసావతార'మ్మని మొదలయిన పద్య మదాహృతమైనది. సింగభూపాలుడుకూడ పదునాలుగవశతాబ్ది పూర్వార్ధమున నేయుండెను. ఈ వివేచనమునుబట్టి జయదేవుడు రుయ్యకవిశ్వనాథుల నడిమిభాగమున, అనగా పదుమూడవశతాబ్దమున నుండి యుండునని నిర్ణయముచేయవచ్చును.

ప్రకృతము ననుసరింతము. జయదేవుడు చంద్రాలోకమున పూర్వాచార్య స్తుతి రూపమున తనఋణమును వెల్లడించియేయున్నాడు. తాను పెక్కురనుండి పెక్కు లక్షణములను గ్రహించి అలంకారశాస్త్రమార్గమును సుగమముచేసినాడు. అతని సులభసుందర శైలి అలంకారశాస్త్ర ప్రారంభకులకు ప్రరోచనమును కలుగజేయును; పర్యాప్త పాండిత్యమును సమకూర్చును. ఆ పద్య మిది—

"తం పూర్వాచార్య సూర్యోక్తి జ్యోతిః స్తోమోద్గమం స్తుమః
యం సంశ్రిత్య ప్రకాశస్తే మద్గుణత్రసరేణవః" (1-4)

గ్రంథనామమున కనుగుణముగా పరిచ్ఛేదములను మయూఖములుగా పేర్కొనుట జరిగినది, చంద్రాలోకమునందు పది మయూఖములుగలవు. ప్రథమ మయూఖము నందు గ్రంథప్రయోజనము కావ్యకారణము, కావ్యస్వరూప నిర్వచనము, పదవాక్య ఖండకావ్య వాక్యకదంబక లక్షణనిరూపణము— ద్వితీయమయూఖమునందు దోషస్వరూప నిరూపణము— తృతీయ మయూఖమునందు గుణస్వరూప నిరూపణము, గుణాలంకార స్వరూప నిరూపణము— పంచమమునందు అలంకారసామాన్యలక్షణనిరూపణము, శబ్దాలంకారములు, అర్థాలంకారములు—షష్ఠమునందు రసస్వరూప నిర్వచనము, నిరూపణము, భావస్వరూపనిర్వచనము, నిరూపణము, రీతిస్వరూపనిరూపణము, వృత్తిస్వరూప నిరూపణము—సప్తమమునందు వ్యంజనావ్యాపారస్వరూపనిరూపణము, వ్యంగ్యము, భేదద్వయనిరూపణము – అష్టమమునందు ధ్వని, గుణీభూతవ్యంగ్యము, త్రైవిధ్యము— నవమమునందు లక్షణాస్వరూపనిరూపణము — దశమమునందు అభిధాస్వరూపనిరూపణము, పాద్వైధ్యము గలవు. మొత్తముమీద అలంకార శాస్త్రమునందలి యన్నివిషయములును స్పష్టములైనవి.

తెలుగుదేశమునం దీనాడు చంద్రాలోకప్రశస్తి పంచమమయూఖము నాశ్రయించుకొనియున్నది. కొందర కితరమయూఖముల యునికియే తెలియదన్న నాశ్చర్యపడ వలసినది లేదు. తెలిసిన పంచమమయూఖమైనను రూపుమార్చుకొని వెలసినది. పైని చూపినట్లు అలంకార సామాన్యలక్షణ నిరూపణము, శబ్దాలంకారములు ప్రకృతమునందు కనిపింపవు. చంద్రాలోకమన్న అర్థాలంకారగ్రంథ మనియు, నందు వందయలంకారములు నిరూపితములయ్యెననియు బహుజనవిశ్వాసము. నేడు వాడుకయందున్న గ్రంథము లట్లే యున్నవి. తత్కారణము నూహించుటకుముందు మరొకసంగతి చూతము.

చంద్రాలోకమునకు నాలుగు టీకలు ప్రసిద్ధములై యున్నవి. అందు మొదటిది శరదాగమము. దీనిని ప్రద్యోతనభట్టు రచించెను. ఇతడు బుందేలు వంశభూపతియైన వీరభద్రదేవుని యాస్థానపండితుడు. అతని కాలమునుబట్టి పదునేడవశతాబ్ది యుత్తరార్థమునందు ప్రద్యోతనుడు శరదాగమము రచించెనని విద్వాంసుల నిశ్చయము. రెండవది రమ. ఈ టీకను వైద్యనాథపాయగుండే రచించెను. ఇతడు నాగోజీభట్టునకు శిష్యుడు. ఇతని కుమారుడైన బాలంబట్టుకూడా నాగోజిబట్టునకు శిష్యుడే. అట్లగుటవలన వైద్యనాథుడు నాగోజీభట్టునకు సమవయస్కుడుకాని కించిమానవయస్కుడుకాని కావలసియుండును. ఈయూహనుబట్టి యీతడు పదునేడవశతాబ్ది తుదిభాగమున నుండెనని నిర్ణయింపవచ్చును. మూడవది రాకాగమము. దీనిని గాగాభట్టు అన్న నామాంతరముగల విశ్వేశ్వర భట్టు రచించెను. ఇతడే ఛత్రపతి శివాజీకి పట్టాభిషేకమును క్షాత్రకల్పము ననుసరించి నిర్వహించెనట! శివాజీ పట్టాభిషేకము క్రీ. శ. 1674 లో జరిగినట్లు చారిత్రకుల నిశ్చయము. కావున గాగాభట్టు పదునేడవశతాబ్ది యుత్తరార్థముననే యున్నట్లు తేలుచున్నది. ఇక నాలుగవది బుధరంజనీవ్యాఖ్య. దీనిరచయిత వేంగళసూరి, ఈతని కాలమును నిర్ణయించుటకు తగిన యాధారములు మృగ్యములు. ఈతడు చంద్రాలోకమునందలి అర్థాలంకారములకు మాత్రమే వ్యాఖ్యానమును సంతరించెను. అందును కువలయానందపాఠములనే యాదరించెను. కావున వేంగళసూరి అప్పయదీక్షితులకు తరువాతివాడు కావలయును. అప్పయదీక్షితులు పదునారవశతాబ్ది యుత్తరార్ధమున పదునేడవశతాబ్ది తొలిపాదమున నుండెను. కావున వేంగళసూరి తదనంతరుడుగా పదునేడు పదునెనిమిది శతాబ్దుల నడుమ నుండి యుండవచ్చును. తెలుగుదేశమునందు మొదటి మూడు వ్యాఖ్యలకంటె నాలుగవవ్యాఖ్యకే ప్రసిద్ధి కలిగిన దనిపించును. ప్రకృతగ్రంథము తదనురూపమై యున్నది.

జయదేవుని చంద్రాలోక పంచమయూఖమునందు 8 శబ్దాలంకారములు పరిగణింపబడినవి. 87 అర్థాలంకారములు పరిగణింపబడినవి. తెలుగునాట వెలసిన గ్రంథమునందు శబ్దాలంకారములు లేవు. అర్థాలంకారములు పూర్తిగా వంద యున్నవి. జయదేవుడు రసవదాద్యలంకారములను తొమ్మిదింటిని పేర్కొని, అవి యితరులకు సమ్మతములని తెల్పి విడిచివేసెను. ప్రకృతగ్రంథమున వాని స్పర్శలేదు.

ప్రకృతగ్రంథమునందు కువలయానందమునుండి 21 అలంకారములు ప్రవేశించి నవి. అవి యివి— 1. ప్రస్తుతాంకురము 2. వ్యాజనింద 3. అల్పము 4. కారకదీపకము 5. మిథ్యాధ్యవసితి 6. లలితము 7. అనుజ్ఞ 8. లేశము 9. ముద్ర 10. రత్నావళి 11. విశేషకము 12. సూక్ష్మము 13. గూఢోక్తి 14. వివృతోక్తి 15. యుక్తి 16. లోకోక్తి 17. ఛేకోక్తి 18. నిరుక్తి 19. ప్రతిషేధము 20. విధి 21. హేతువు.

చంద్రాలోకములో నుండియు ప్రకృత చంద్రాలోకమునందు కానరానివి— 1. ప్రతీపోపమ 2. లలితోపమ 3. స్తబకోపమ 4. సంపూర్ణోపమ 5. విరోధము 6. ఉదారసారము 7. అనుమానము 8. భావికచ్ఛవి.

ఈవిధముగా చంద్రాలోకమునందు వంద అర్థాలంకారము లేర్పడినవి.

అడిదము సూరకవి 'ఆంధ్రచంద్రాలోకము' అనుపేర చంద్రాలోకము నాంధ్రీకరించెను. ఇతడు పదునెనిమిదవశతాబ్ది యుత్తరార్ధమునందున్నవాడు. ఇత డనువదించిన గ్రంథమున కాధారము పైవిధముగా నేర్పడినదేకాని మూలగ్రంథము కాదు. బుధరంజనీవ్యాఖ్య చూపిన వంద యలంకారములనే యీయనయు గ్రహించెను; లక్ష్య లక్షణములుకూడ నవియే. ఇందువలన అడిదము సూరకవికి బుధరంజని తెలిసియుండు ననియే భావింపవచ్చును. దీని కాద్యంతములుచూచిన సరిపోవును. సూరకవి గ్రంథమునందు ఉపమాలంకార లక్ష్యముగా 'హంసిచందాన నీకీర్తియబ్జనాభ! యభ్రగంగావగాహనం బాచరించు' అని కలదు. ఇది కువలయానందలక్ష్యము. జయదేవ చంద్రావలోకము 'హృదయే ఖేలతోరుచ్చైస్తన్వంగీస్తనయోరివ" అన్న లక్ష్యమును ప్రదర్శించినది. ఆంధ్రచంద్రాలోకము హేత్వలంకారముతో ముగియుచున్నది. కువలయానందము సంకరసంకరాలంకారముతో ముగియుచున్నది. హేత్వలంకారమునకు పిమ్మట కువలయానందము మరి యిరువది మూడలంకారములను దెల్పినది. హేతువుతో ముగియుటకు బుధరంజని కారణము కావలయును. జయదేవ చంద్రాలోకమునందు హేత్వలంకారము లేనేలేదు. కాబట్టి ఆంధ్ర చంద్రాలోకము బుధరంజని ననుసరించెననికాని, ఆనాడు తెలుగుదేశమున వ్యాప్తిలోనున్న గ్రంథము నా రెండు ననుసరించియుండునని కాని నిశ్చయముచేయుట సమంజసము.

మొత్తముమీద ప్రకృత చంద్రాలోకము జయదేవునిదికాదు; అప్పయదీక్షితులది కాదు. జయదేవుని ప్రణాళిక ననుసరించి అప్పయదీక్షితుల పాఠములతో నేర్పడిన యర్థాలంకారసంపుటి మాత్రమే యిది. ఇది యిట్లుండగా సూరకవి "బాలురకునైనఁ దెలియఁగాఁ గాళిదాసు । మును రచించెఁ జంద్రాలోకమును" అని వ్రాసెను. దీనినిబట్టి యీతడు జయదేవునికిగాని, అప్పయదీక్షితులకుగాని చంద్రాలోకముతోనున్న సంబంధము నెరుగడని తేలుచున్నది. తనగ్రంథమునకు ప్రాశస్త్యమును తెచ్చుకొనవలయుననియో, నిజముగా విశ్వసించియో కాళిదాసును కర్తగా చెప్పుకొనుట తటస్థించినది. ఇదిపొరపాటే కాని వాస్తవముకాదు.

జయదేవుని కలంకారములయందు ప్రీతి యధికముగాకలదు. కావ్యమందు అలంకార మవశ్యలక్షణమని యాతని యభిసంధి. మమ్మటుని నాక్షేపించుటలో ఆవిషయము సుస్పష్టమగుచున్నది. అంతేకాక భరతముని నాట్యశాస్త్రమునందు నాలుగలంకారములు మాత్రమేయుండి, మమ్మటుని కావ్యప్రకాశమునం దరువదియొక్క యలంకారములైనవి. రుయ్యకుని యలంకార సర్వస్వమునందు డెబ్బదియైదుకాగా జయదేవుని చంద్రాలోకము నందు ఎనుబదియేడైనవి. కువలయానంద సాంగత్యముచేత ప్రకృత చంద్రాలోకమునందు వంద లైనవి.

ఈపెరుగుదల ప్రణాళికానుగుణమే యనకతప్పదు. నాట్యశాస్త్రమునందు కావ్య లక్షణములుగా ముప్పదియారు ముచ్చటింపబడినవి. అవి యివి— విభూషణము, అక్షర సంహతి, శోభ, అభిమానము, గుణకీర్తనము, ప్రోత్సాహనము, ఉదాహరణము, నిరుక్తము, గుణానువాదము, అతిశయము, హేతువు, సారూప్యము, మిథ్యాధ్యవసాయము, సిద్ధి, పదోచ్చయము, ఆక్రందము, మనోరథము, ఆఖ్యానము, యాజ్ఞ, ప్రతిషేధము, పృచ్ఛ, దృష్టాంతము, నిర్భాసము, సంశయము, ఆశీస్సు, ప్రియోక్తి, కపటము, క్షమ, ప్రాప్తి, పశ్చాత్తాపము, అర్థానువృత్తి, ఉపపత్తి, యుక్తి, కార్యము, అనునీతి, పరిదేవనము. ఈ పేరులను పరికింపగా అలంకారములుగను, గుణములుగను నివి కానవచ్చును. అలంకార ములు పృథక్సిద్ధములు; గుణములు స్వతస్సిద్ధములు. అయినను బహిరంతరలంకరణమునకు రెండు నావశ్యకములే. అందువలననే భరతాచార్యు డిట్లు సంభావించుచున్నాడు—

> "షట్త్రింశదేతాని తు లక్షణాని ప్రోక్తాని వై భూషణ సమ్మితాని
> కావ్యేషు భావార్థగతాని తజ్జ్ఞైః సమ్యక్ప్రయోజ్యాని యథారసంతు"

అర్థభావరసము లలంకార్యములు. వాని నలంకరించునవే గుణాలంకారములు. అవియే కావ్యలక్షణములు. అవి రసోచితముగా నిబద్ధములగుట యభీష్టము. వీనినింకను సూక్ష్మముగాచూచి గుణములు రసధర్మములని, నిత్యములని, అలంకారములు శరీరశోభో త్కర్షకములని అనిత్యములని కొందరు నిర్ణయముచేసిరి. ఎందరెట్లన్నను, అలంకారముల సంఖ్య పెరుగుచునేవచ్చినది; పెరుగుచున్నది. నూతనములనుగూడ గుర్తించి యావిష్క రించుట యవసరము.

అలంకారములను స్థూలముగా ఆరుప్రాతిపదికల నాధారముచేసికొని వర్గీకరింప వచ్చును. 1. సాదృశ్యమూలకములు—ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము, రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతి, ఉల్లేఖము, అపహ్నుతి, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, తుల్యయోగిత, దీపకము, ప్రతివస్తూపమ, దృష్టాంతము, నిదర్శన, వ్యతిరేకము, సహోక్తి, వినోక్తి, సమాసోక్తి, పరికరము, పరికరాంకురము, శ్లేషము, అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసము, పర్యాయోక్తము, వ్యాజస్తుతి, వ్యాజనింద, ఆక్షేపము. 2. విరోధ మూలకములు— విరోధము, విభావన, విశేషోక్తి, అతిశయోక్తి, వ్యతిరేకము, అసంగతి, విషమము, సమము, చిత్రము, అధికము, అల్పము, అన్యోన్యము, విశేషము, వ్యాఘాతము

3. శృంఖలాబంధమూలకములు— కారణమాల, ఏకావళి, మాలాదీపకము, కారకదీపకము, సారము. 4. శాస్త్రన్యాయమూలకములు —కావ్యలింగము, అనుమానము, యథాసంఖ్యము, పర్యాయము, పరివృత్తి, పరిసంఖ్య, కావ్యార్థాపత్తి. వికల్పము, సముచ్చయము, సమాధి. 5. లోకన్యాయమూలకములు — ప్రత్యనీకము, ప్రతీపము, మీలితము, ఉన్మీలితము, లేశము, సామాన్యము, తద్గుణము, అతద్గుణము, ఉత్తరము, లోకోక్తి, యుక్తి, వివృతోక్తి, అనుగుణము, పూర్వరూపము. 6. గూఢార్థప్రతీతిమూలకములు— సూక్ష్మము, గూఢోక్తి, వ్యాజోక్తి, వక్రోక్తి, అత్యుక్తి, నిరుక్తి, ఉదాత్తము, భావికము, స్వభావోక్తి, ఛేకోక్తి, పిహితము. కొందరు అతిశయకథనము ప్రాతిపదికగా నొకవర్గము నేర్పరింతురు. వీరినింకను సూక్ష్మవివేచన చేయవచ్చును. ప్రకృత మవసరముకాదు.

సంస్కృత చంద్రాలోకమునకు టీకయు, వ్యాఖ్యయు సమకూర్చితిని. అనువుగా ఆంధ్రచంద్రాలోకపద్యముల నిచ్చితిని. కొన్నియెడల పద్యమునందలి గుణదోషములను 'విమర్శ' యనుపేర నుటంకించితిని. 'ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును' అని సూచించిన పద్యములు మూలమునకు నా యనువాదములు. నా వ్రాతప్రతిని చూచి, సరి చూచి, సముచితసూచనలు చేసిన మిత్రవరులు గుండవరపు లక్ష్మీనారాయణ గారికి, ధనకుధరము వేంకటాచార్యులు గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు. ఉపాధ్యాయునకు విద్యార్థిలోకపదముగా మార్గదర్శకులనుట మరవరానివిషయము. వారిజిజ్ఞాస నాయుపజ్ఞకు హేతువు. అది నా విద్యార్థుల విషయమున నా ప్రత్యయము. విజ్ఞుల విమర్శలకు విధేయుడను.

—సూరిశ్రీ.

# విషయసూచిక

*

# చంద్రాలోక సమున్మేషము



## 1. ఉపమాలఙ్కారః

1. ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః,
హంసీవ కృష్ణ ! తే కీర్తిః స్వర్గంగా మవగాహతే ॥

టీక : యత్ర = ఎచ్చట; ద్వయోః = రెంటియందు; సాదృశ్యలక్ష్మీః = సామ్యరూపమయిన సౌందర్యము; ఉల్లసతి = ప్రకాశించునో; (సా = అది); ఉపమా = ఉపమాలంకారము. కృష్ణ = ఓకృష్ణ; తేకీర్తిః = నీయొక్కకీర్తి; హంసీ + వ = ఆడుహంసవలె; స్వర్గంగామ్ = ఆకాశగంగయందు; అవగాహతే = మునుగుచున్నది.

వ్యాఖ్య : అర్థాలంకారములందు సర్వప్రధానమైనది యుపమాలంకారము. జయదేవుడు ప్రాధాన్యమునుబట్టి యుపమాలంకారముతోనే యర్థాలంకార విభాగమును ప్రారంభించుచున్నాడు. చంద్రాలోకమునందు జయదేవుడు సాధారణముగా ఒక నియతి ననుసరించుట పరిపాటి. శ్లోకమునందు పూర్వార్ధమును లక్షణ నిరూపణమునకు, ఉత్తరార్ధమును లక్ష్యప్రదర్శనమునకు నుపయోగించును.

ఉపమానమునకు, ఉపమేయమునకు — ఈ రెండింటికి సామ్యరూపమైన సౌందర్యము సహృదయరంజకముగా నెచ్చటనుండునో, అచ్చట నది ఉపమాలంకార మగునని లక్షణము.

ఓకృష్ణా ! నీకీర్తి హంసివలె నాకాశగంగయందు మునుగుచున్నది—ఇది లక్ష్యము.

ఇచ్చట కీర్తి హంసితో ఉపమింపబడినది. కీర్తి యుపమేయము; హంసి యుపమానము; ఆకాశగంగయందు మునుగుట రెండింటియందున్న సమానధర్మము. "ఇవ" అనునది యుపమావాచకము. ఉపమానము, ఉపమేయము, ఉపమావాచకము, సమానధర్మము — అను నీ నాలుగింటిని కలిగి యుండుటచేత, ఇది పూర్ణోపమ.

ఆంధ్ర చంద్రాలోకము :

గీ. వర్ణ్య ముపమాన ముపమానవాచకము స
మానధర్మము సంఘటింపనగు నుపమ ;
హంసి చందాన నీకీర్తి యబ్జనాభ !
యభ్రగంగావగాహనం బాచరించు.

విమర్శ : మూలమునందలి లక్షణమున కీలక్షణము భిన్నము. వర్ణ్యమని యనగా ఉపమేయమని అర్థము. ఉపమానవాచకమన్నది సరియైనరూపము కాదు; ఉపమావాచకమనికాని, ఔపమ్యవాచకమనికాని యనుట సమంజసము.

ఉపమేయాదులు నాలుగు నున్నంతమాత్రముచేతనే ఉపమాలంకారము కాదు. ఇది ఉపమేయోపమ, అనన్వయము, ప్రతీపము — మున్నగు నలంకారములలో సైత ముండును. ఈ నాలుగింటిలో నేమేని తగ్గినంత మాత్రమున ఉపమాలక్షణము కొరవడదు; అప్పు డది లుప్తోపమ యగును. కావున పై లక్షణము సమీచీనముగా లేదు. ఈ క్రింది పద్యము మూలానుగుణము; దీనిని గ్రహింపవచ్చును.

గీ. ఉపమ యను నలంకారమహా నొప్పిదముగ
రెంట విలసిల్లునేని సాదృశ్యలక్ష్మి ;
కృష్ణ ! హంసి విధమున నీకీర్తి గగన
గంగలోన నెరపు నవగాహనంబు.

## 2. లుప్తోపమాలఙ్కారః

2. వర్ణ్యోపమాన ధర్మాణా ముపమావాచకస్య చ,
ఏకద్విత్ర్యనుపాదానాద్భిన్నా లుప్తోపమాష్టధా॥

టీక : వర్ణ్య = ఉపమేయముయొక్కయు; ఉపమాన = ఉపమానము యొక్కయు; ధర్మాణామ్ = సమానధర్మముయొక్కయు; ఉపమావాచకస్య + చ = ఉపమావాచకమైన 'ఇవ' శబ్దముయొక్కయు (ఈ నాలుగింటి యొక్క); ఏక = ఒకదానియొక్క; ద్వి = రెండింటియొక్క; త్రి = మూడింటి యొక్క; అనుపాదానాత్ = అప్రయోగమువలన; లుప్తోపమా = లుప్తోపమ

యన్న యలంకారము; అష్టధా = ఎనిమిది విధములుగా; భిన్నా = విభజింప బడియున్నది.

వ్యాఖ్య : ఉపమేయము, ఉపమానము, సమానధర్మము, ఉపమావాచకము—అను నాలుగింటిలో ఒకదానినిగాని, రెండింటినిగాని, మూడింటినిగాని ప్రయోగింపకుండుటవలన లుప్తోపమ యెనిమిదిభేదములను కలిగియుండును. ఇందు లక్షణముతోపాటు భేద పరిగణనముకూడ జరిగినది. పూర్వము చెప్పి కొన్నట్లు ఉపమాలంకార సామగ్రియైన ఉపమేయాద్యంశములు నాలుగు నుప పాదింపబడినపుడు పూర్ణోపమ యగును. సామగ్రిపూర్ణత్వముచేత పూర్ణోపమాలంకారమన్న పేరు సార్థకమగుచున్నది. ఉపమేయాద్యంశములలో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని ఉపపన్నములు కాకపోవచ్చును, అప్పుడు లుప్తోపమయగును. సామగ్రీలుప్తత్వమువలన లుప్తోపమాలంకారమన్న పేరు సార్థకమగుచున్నది.

పైని చెప్పిన ఉపమేయాదులందు ఒక్క యంశము మాత్రమే లోపించుటవలన మూడు భేదము లేర్పడును. అవి వాచకలుప్త, ధర్మలుప్త, ఉపమానలుప్త యన్నవి. రెండంశములు మాత్రమే లోపించుటవలన నాలుగు భేదము లేర్పడును. అవి ధర్మవాచకలుప్త, వాచకోపమేయలుప్త, వాచకోపమానలుప్త, ధర్మోపమానలుప్త యన్నవి, మూడంశములు లోపించుటవలన ఒక్క భేదము మాత్రమే యేర్పడును. అది ధర్మోపమానవాచకలుప్త యన్నది.

మొత్తముమీద 1. వాచకలుప్త 2. ధర్మలుప్త 3. ఉపమానలుప్త 4. ధర్మవాచకలుప్త 5. వాచకోపమేయలుప్త 6. వాచకోపమానలుప్త 7. ధర్మోపమానలుప్త 8. ధర్మోపమానవాచకలుప్త — అని లుప్తోపమాలంకారమునకు ఎనిమిది భేదము లేర్పడును. తరువాత రెండు శ్లోకములలో లక్ష్యములు ప్రదర్శింపబడును.

ఆంధ్ర చంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వర్ణ్య ముపమాన మౌపమ్య వాచకము స
మానధర్మము సనువానిలోన నొకటి

రెండు మూఁడు ప్రస్తావింపకుండిరేని
నొప్పు నష్టభేదముల లుప్తోపమ యన.

3. తటిద్గౌరీన్దుతుల్యాస్యా కర్పూరన్తీ దృశోర్మమ,
కాన్త్యా స్మరవధూయన్తీ దృష్టా తన్వీ రహో మయా॥

4. యత్తయా మేళనం తత్రలాభో మే యచ్చ తద్రతేః,
తదేతత్కాకతాళీయ మవితర్కిత సమ్భవమ్॥

టీక : తటిత్ + గౌరీ = మెరపుతీగవలె గౌరవర్ణము కలదియు; ఇన్దు + తుల్య + ఆస్యా = చంద్రునితో సాటియైన ముఖముకలదియు; మమ + దృశోః = నా రెండు కన్నులకు; కర్పూరన్తీ = కర్పూరమువలె ఆచరించునదియు; కాన్త్యా = లావణ్యముచేత; స్మరవధూయన్తీ = స్మరవధువైన రతివలె ఆచరించునదియు; (అయిన); తన్వీ = యువతి; రహః = రహస్య ప్రదేశమునందు; మయా = నాచేత; దృష్టా = చూడబడినది. తయా = ఆమెతో; మేళనమ్ = సమావేశము; యత్ = ఏదియో; మే = నాకు; తత్ర = అక్కడ; తత్ + రతేః = ఆమెతోడి సురతముయొక్క; లాభః = ప్రాప్తి; యత్ + చ = ఏదియో; తత్ + ఏతత్ = అయిది యంతయు; కాకతాళీయమ్ = కాకతాళీయము; అవితర్కిత సంభవమ్ = అప్రయత్నసిద్ధము.

వ్యాఖ్య : ఈ రెండు శ్లోకములయందు లుప్తోపమ యందలి యెనిమిది భేదములకు లక్ష్యములు చూపబడినవి.

'తటిద్గౌరీ' అను సమాసమునకు "తటి దివ గౌరీ" అన్నది వివక్షితార్థము. మెరపుతీగవలె గౌర (పచ్చని) వర్ణముగలది యని యర్థము. ఇచ్చట 'ఇవ' అన్న ఉపమావాచకము లోపించినది. కావున ఇది వాచకలుప్తకు లక్ష్యము. ఇచ్చట 'తన్వి' యుపమేయము: 'తటిత్తు' ఉపమానము; 'గౌరత్వము' సాధారణధర్మము. ఉపమాసామగ్రియందలి నాలుగింటిలోను ఉపమేయము, ఉపమానము, సాధారణధర్మము అను మూడింటికి నిచ్చట ప్రవేశము కలదు, ఉపమావాచకము మాత్రమె లోపించినది. "అదర్శనం లోపః" అన్నది నిర్వచనము. కనిపింపకుండుటకే లోపమని సంకేతము. అర్థము గమ్యమానమగుచుండగా, తదర్థబోధకమగు పదము ప్రయోగమునందు కానరాకుండుట

యని తాత్పర్యము. 'ఇవ' శబ్ద మిట్లు లోపించుటచేతనే, యిది వాచకలుప్తకు లక్ష్య మగుచున్నది.

ఇన్దు తుల్యాస్యా- అని యన్నప్పుడు 'ఇన్దునా తుల్య మాస్యం యస్యాః సా' అన్నది విగ్రహవాక్యము. చంద్రునితో తుల్యమైన ముఖము కలది యన్నది యర్థము. ఇచ్చట ముఖము ఉపమేయము. చంద్రుడు ఉపమానము. తుల్యమైన అన్నది ఉపమావాచకము. ఉపమా సామగ్రియగు నాలుగింటియందును మూడింటికి ప్రవేశము కలదు; సాధారణధర్మము మాత్రమే లోపించినది. కావుననే యిది ధర్మలుప్తకు లక్ష్యమగుచున్నది.

మమదృశోః కర్పూరన్తీ- అని యన్నప్పుడు 'కర్పూరన్తీ' యన్న రూపమునకు 'కర్పూర మివాచరన్తీ' అన్నది యర్థము. కర్పూరము కన్నులకు చల్లనైయుండి యానందమును గూర్చునట్లే, తన్వి యానందమును గూర్చుచున్నదని తాత్పర్యము. అందువలన "తన్వి" యుపమేయము. "కర్పూరము' ఉపమానము. ఇంక గమ్యమానములగుచున్న సాధారణ ధర్మము, నుపమావాచకము పైలక్ష్యమునం దనుపాదానములైనవి. సాధారణధర్మోపమావాచకములకు లోపము కలుగుటచేత, ఇది ధర్మవాచక లుప్తకు లక్ష్యమగుచున్నది.

కాన్త్యా స్మరవధూయన్తీ- అని యన్నప్పుడు 'స్మరవధూయన్తీ' యన్న రూపమునకు 'స్మరవధూ మివాచరన్తీ' అన్నది యర్థము. మన్మథుని భార్యయైన రతివలె గాపించుకొనునదని తాత్పర్యము. ఇది ద్వితీయాంత మైన 'ఆత్మానమ్' అనుదానితో అన్వయమును గలిగియుండును. కాని యీపదము గమ్యమానమగుచున్నదే కాని యుపాదానము కాలేదు. కావున ఉపమేయము లోపము నొందినట్లే. అట్లే ఉపమావాచకముకూడ ఉపాదానము కాలేదు. సాధారణధర్మమగు కాంతి, ఉపమానమగు స్మరవధువు ప్రయుక్తములై యున్నవి. కావుననే యిది వాచకోపమేయ లుప్తకు లక్ష్యమగుచున్నది.

మొదటిశ్లోకమునందు నాలుగుభేదములకు నాలుగులక్ష్యములు పై విధముగా ప్రదర్శింపబడినవి. ఇందెచ్చటను ఉపమానమునకు లోపము కలుగ లేదన్నది గమనార్హము. ఉపమానలోపముగల లుప్తోపమభేదములు నాలుగు గలవు. వానికి లక్ష్యములను రెండవశ్లోకము ప్రదర్శించుచు. వాని నిప్పుడు వరుసగా పరిశీలింతము.

తదేతత్కాకతాళీయ మవితర్కిత సమ్భవమ్- అని యన్నప్పుడు 'కాకతాళీయమ్' అన్నరూపమునకు 'కాకతాళ మివ కాకతాళీయమ్' అన్నది వ్యుత్పత్తి. కాకతాళము వంటి దన్న యర్థమునందు 'కాకతాళీయమ్' అన్న రూప మేర్పడును. 'కాకతాళమ్' అన్నరూపమునకు 'ఇవే ప్రతికృతౌ' అన్న యధికార సూత్రమునుబట్టి ఛ ప్రత్యయము కలుగును. అప్పుడు "కాక తాళ + ఛ=కాకతాళ + ఈయ=కాకతాళీయ' అని యగును. ఇచ్చట ఛ ప్రత్యయరూపమున ఉపమావాచకము ప్రయుక్త మగుచున్నది. 'తదేతత్' అని యనుటచేత శ్లోకపూర్వార్థమునందున్న తయోమేళనం, తద్రతేర్లాభః- అను రెండు నొక్కటిగా ఉపమేయస్థానమును పొందుచున్నవి. అవితర్కిత సంభవత్వము సాధారణ ధర్మము. ఇచ్చట ఉపమావాచకము, వర్ణ్యము, సాధారణ ధర్మము ఉపాత్తములైనవి. ఇంక మిగిలినది ఉపమానము. దీని కిందు ప్రవేశము లేదు. కావుననే యిది ఉపమానలుప్తకు లక్ష్యమగుచున్నది.

తదేతత్కాకతాళీయ మవితర్కిత సమ్భవమ్- అని యన్నప్పుడు 'కాక తాళీయమ్' అన్నరూపమునందలి కాక, తాళశబ్దములు రెండును కాకతాళ సమాగమముచేత ఉత్పన్నమైన సమవేతక్రియను స్ఫురింపజేయును. కాకి యొక్క రాకవలె, తాటిపండు పడుటవలె అయినక్రియ "కాకతాళ" మగును. "కాకాగమనమివ తాళపతనమివ కాకతాళమ్" అన్నది వ్యుత్పత్తి. 'తద్ర తేర్లాభః' అన్నయుపమేయము తాళఫలభోగరూపమైన యుపమానమును గమ్యమానము చేయుచున్నది. కాని అది యుపాదానము కాలేదు. అట్లే సమాసార్థము కలదు. 'ఇవ' శబ్దముకూడ ఉపాదానము కాలేదు. 'అవి తర్కిత సమ్భవమ్' అన్నది సాధారణధర్మము. కావుననే యిది ఉపమాన వాచకలుప్తకు లక్ష్యమగుచున్నది.

తదేతత్కాకతాళీయ మవితర్కితసమ్భవమ్- అన్నచోట 'అవితర్కిత సంభవమ్' అన్నది సాధారణధర్మముగా వ్యవహరించుట పైని గమనించితిమి. దానిని తొలగించి "అభవత్కిం బ్రవీమి తే" అన్నపాఠమును గల్పించుకొన్నచో ధర్మము లోపించును. ఉపమానము లోపించినట్లు ఇంతకు ముందే చూచితిమి. కావున 'తదేతత్కాకతాళీయ మభవత్కిం బ్రవీమితే" అని యన్నప్పు డిది ధర్మోపమానలుప్తకు లక్ష్యమగును. ఇచ్చట ఛప్రత్యయరూపమున నివార్థక ముపాత్తమైనట్లు గ్రహింపవలసి యుండును.

తదేతత్కాకతాళీయ మభవత్కిం బ్రవీమి తే- అని యన్నప్పుడు సమాసత్వముచేత 'ఇవ' శబ్దార్థమునకు లోపము కలిగినది. పాఠాంతరగ్రహణముచేత సాధారణధర్మమునకు లోపము కలిగినది. కాకతాళీయమని యనుటచేత తాళఫలోపభోగరూపమైన యుపమానము లోపించినట్లు ముందే చెప్పుకొంటిమి. కావుననే, యిది ధర్మోపమానవాచకలుప్తకు లక్ష్యమగుచున్నది.

ఇది యెక్కువభాగము వ్యాకరణము నాశ్రయించి యేర్పడుచున్నది. ప్రత్యయార్థమునందు 'ఇవ' శబ్దోపాదానము నంగీకరించుటయు, సమాసార్థమునందు అంగీకరింపకుండుటయు శాస్త్రపద్ధతి.

ఆంధ్ర చంద్రాలోకమునందు సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. చంచలాగౌరి పూర్ణేందు సదృశవదన
యరయఁ గర్పూరదాకార యొరిమచేత
స్మరవధూయదాత్మిక రహస్యప్రదేశ
మందుఁ దన్వంగి నాకుఁ గన్పించె దానరచ్చె;
తత్సమాగతియు నచటఁ దద్రతియును
గాకతాళీయ మవితర్కితాకలితము.

విమర్శ : ధర్మము నుపాదానము చేయునప్పుడు పై పద్యమును యథాతథముగా గ్రహింపవచ్చును. సాధారణధర్మమును లోపింపజేయునప్పుడు చివరిపంక్తిని 'గాకతాళ్యము మేమనం గలను సఖుఁడ ?' అని మార్చుకొనవలయును. అట్లు మార్చినప్పుడుమాత్రమే ధర్మోపమానలుప్త, ధర్మోపమాన వాచకలుప్త- యన్నభేదములకు లక్ష్యములు సిద్ధించును.

## 2. అనన్వయాలఙ్కారః

5. ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః,
ఇన్దు రిన్దురివ శ్రీమానిత్యాదౌ తదనన్వయః॥

టీక : ఏకస్య + ఏవ = ఒకే; వస్తునః = వస్తువునకు; ఉపమానో ఉపమేయత్వం = ఉపమానత్వమును ఉపమేయత్వమును; (వర్ణితం) యత్ = (వర్ణింప

బడినది) యేదో; తద్ (వర్ణితం) = ఆ వర్ణింపబడినది. ఇన్దుః=చంద్రుడు; ఇన్దుః + ఇవ=చంద్రునివలె; శ్రీమాన్=శోభావంతుడు; ఇతి + ఆదౌ=మున్నగు దానియందు; అనన్వయః=అనన్వయాలంకారము.

వ్యాఖ్య : ఒకే వస్తువునకు ఉపమానత్వము నుపమేయత్వముగూడ కల్పింపబడినయెడల అది యనన్వయాలంకార మగునని లక్షణము. సాధారణ ముగా రెండు వస్తువులను గ్రహించి పోల్చుట లోకధర్మము. వర్ణ్యమగు వస్తు వొకటి; అదియే ఉపమేయము. అవర్ణ్య మింకొకటి; అదియే ఉపమానము. అనన్వయము అనియనగా "అన్వయముకాకుండుట" అన్నది శబ్దార్థము. ఉపమేయమైన వస్తువు మరొకవస్తువుతో అన్వయమును పొందకుండుట యిక్కడ విశేషము. ఈవిశేషమునుబట్టి అనన్వయాలంకార మన్నపేరు సార్థకమగుచున్నది. అనన్వయము ద్వితీయవస్తువ్యవచ్ఛేదకము; అనగా రెండవవస్తువుతోడి సాదృశ్యము నంగీకరింపదని తాత్పర్యము. ఉపమేయ ముగా వర్ణితమైనదే ఉపమానముగా వర్ణితమగును. వర్ణ్యము నిరుపమాన మన్నది యుద్దిష్టము.

చంద్రుడు చంద్రునివలె శోభావంతుడు- ఇది యుదాహరణము. చంద్రుడు ఉపమేయము; చంద్రుడు ఉపమానము; వలె ఉపమావాచకము; శోభావత్త్వము సాధారణధర్మము. ఉపమేయమైన చంద్రుడే యుపమాన ముగా వర్ణింపబడుటచేత అనన్వయాలంకార లక్షణము సరిపడుచున్నది. దీనివలన చంద్రుని నిరుపమానత ద్యోతిత మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

క. జగతి నొక వస్తువునకే
తగ నుపమానోపమేయత ఘటించుట చె
న్నగునేని నది యనన్వయ
మగు శశి శశిభంగి కాంత్యుదగ్రుఁ డనుక్రియన్.

విమర్శ : లక్షణలక్ష్యములు సక్రమముగానే యున్నవి. కాని పంప కము రెండింటికి సమముగా లేదు. లక్షణము మూడుపాదములు దాటి ప్రస రించినది. లక్ష్య మొక్కపాదమునందే యొదిగిపోయినది. పద్యమునందు

పూర్వార్ధమున లక్షణము, నుత్తరార్ధమున లక్ష్యమునుండుట యుచితముగా నుండును. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వర్ణ్యము నవర్ణ్యమొక్కటే వస్తువయిన
నది యనన్వయాలంకార మై రహించు;
తారకామనోహరుని విధానఁ దార
కా మనోహరుఁ డచ్ఛప్రకాశమూర్తి.

## 3. ఉపమేయోపమాలఙ్కారః

6. పర్యాయేణ ద్వయోస్తచ్చేదుపమేయోపమామతా,
ధర్మోఽర్థఇవ పూర్ణశ్రీరర్థో ధర్మ ఇవ త్వయి॥

టీక : ద్వయోః = రెండింటికిని; పర్యాయేణ=పర్యాయక్రమమున్న; తత్ + చేత్ = ఉపమేయోపమానత్వము వర్ణింపబడినయెడల; (సా = అది); ఉపమేయోపమా=ఉపమేయోపమ యన్నయలంకారముగా; మతా=సమ్మతింపబడినది॥ ధర్మః=ధర్మము; అర్థః + ఇవ=అర్థమువలె; అర్థః=అర్థము; ధర్మః + ఇవ=ధర్మమువలె; త్వయి=నీయందు; పూర్ణశ్రీః=శ్రీమంతము.

వ్యాఖ్య : రెండు వస్తువులకు పర్యాయక్రమమున నుపమేయోపమానత్వమును కల్పించినయెడల నది యుపమేయోపమాలంకార మగు నని లక్షణము. ఇచ్చట రెండు వస్తువులు మాత్రమే యుండును. మొదట నొకవస్తువుపమేయముగా వ్యవహరించును. అప్పుడు రెండవది యుపమాన మగును. రెండవది యుపమేయముగా వ్యవహరించునప్పుడు మొదటిది యుపమాన మగును. ఇట్లు రెండు వస్తువులే పర్యాయక్రమమున నుపమేయము నుపమానము గూడనై వ్యవహరించును. ఇచ్చట మూడవ వస్తువున కవకాశ మెంత మాత్రమును లేదు. ఈ యలంకారము తృతీయ వస్తువ్యవచ్ఛేదకము.

నీయందు ధర్మ మర్థమువలె, అర్థము ధర్మమువలె శ్రీమంతము– అన్నది లక్ష్యము. ఇచ్చట ధర్మము, అర్థము. అని రెండు వస్తువులు గలవు. మొదటి భాగమునందు ధర్మ ముపమేయమై అర్థ ముపమాన మగుచున్నది. రెండవ భాగమునందు అర్థ ముపమేయమై ధర్మ ముపమాన మగుచున్నది. 'ఇవ' అన్నది ఉపమావాచకము. "పూర్ణశ్రీః' అన్నది సాధారణధర్మము. ఇచ్చట మూడవవస్తువు లేనేలేదు.

ఆంధ్రచంద్రాలోకము :

క. మునుపటివలెఁ బర్యాయం
బున నుపమానోపమేయముల నది కల్పిం,
చిన నుపమేయోపమ యనఁ
దనరారుచునుండుఁ గృతుల దర్పకమథనా !

గీ. ధర్మ మర్థము భంగి నర్థంబు ధర్మ
మట్లు నీయందు లక్ష్మీసమన్వితంబు
లతనుఁ డిందుండు బలె నిందుఁ డతనుఁడు బలె
విరహపీడనదక్షు లన్కరణి శర్వ !

విమర్శ : ఇచ్చట లక్షణ మొక పద్యమునందు, లక్ష్యములను మరొక పద్యమునందు చెప్పుట జరిగినది. లక్షణలక్ష్యముల నొక్క పద్యముననే చెప్పుట చంద్రాలోక సంప్రదాయము. ఒకే యలంకారము పెక్కుభేదములను గలిగియున్నప్పుడు తక్క, తక్కినయన్నిచోట్ల నీ సంప్రదాయము పాటింపబడినది. అట్లు సంగ్రహించి చెప్పుట అధ్యేతల గ్రహణశక్తికి సహకరించును. కాబట్టి యీక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. రెండుఁ బర్యాయమునఁ బ్రవర్తించునేని
మెచ్చుగొను నుపమానోపమేయ మనఁగ;
ధర్మ మర్థంబుకరణి నర్థంబు ధర్మ
మట్లు నీయందుఁ బూర్ణ శోభాస్పదములు.

## 4. ప్రతీపాలఙ్కారః (తద్భేదాః)

7. ప్రతీప ముపమానస్యోపమేయత్వ ప్రకల్పనమ్,
త్వల్లోచనసమం పద్మం త్వద్వక్త్ర సదృశో విధుః॥

టీక : ఉపమానస్య=ఉపమానమునకు; ఉపమేయత్వ ప్రకల్పనమ్= ఉపమేయత్వమును చేకూర్చుట; ప్రతీపమ్=ప్రతీపాలంకారము॥ పద్మం= పద్మము; త్వత్ + లోచనసమం=నీయొక్క లోచనములకు సమానమైనది; విధుః=చంద్రుడు; త్వత్ + వక్త్రసదృశః=నీయొక్కముఖముతో సాటి యైనవాడు.

వ్యాఖ్య : పూర్వార్ధమున లక్షణము, ఉత్తరార్ధమున రెండు లక్ష్యములు ప్రదర్శింపబడినవి.

ఉపమానముగా ప్రసిద్ధమైనదాని నుపమేయముగా కల్పించినయెడల ప్రతీపాలంకార మగునని లక్షణము. సాధారణముగా ఉపమానము ప్రసిద్ధము గుణోత్కర్షమునై యుండును. అట్టిదాని కుపమేయత్వము కల్పించుటచేత న్యూనత్వము కలుగును. ఉపమానమున కిట్టి విరుద్ధత కలుగుటచేతనే దీనికి 'ప్రతీపము' అనుపేరు సార్థక మగుచున్నది.

ఇచ్చట ఉపమానము కాదగిన వస్తువునకు ఉపమేయత్వము కల్పింపబడును. ప్రకృతమైన రెండవ వస్తు వెట్లును వర్ణ్యమేకదా! కావున నిచ్చట అవర్ణ్యమయిన యుపమేయమునకు, వర్ణ్యమయిన యుపమేయమునకు సాదృశ్యము చెప్పుట జరుగుచున్నదన్నమాట! ఉపమానమున కుపమేయత్వ కల్పనముచేత, వర్ణ్యావర్ణ్యములు రెండును ఉపమేయములే యని గ్రహింపవలయును.

ప్రతీపాలంకారము అయిదుభేదములను కలిగియుండును. మొదటి భేదమునకు లక్షణ మిది. తక్కినభేదములందును ఉపమానమునకు న్యూనత్వము నాపాదించుటయే కలదు. కావుననే ప్రతీప మనుపేరు చెల్లుచున్నది.

పద్మము నీలోచనముతో సమముగా నున్నది. ఇది లక్ష్యము. లోచనము వర్ణ్యముగాను, పద్మము ఉపమానముగాను వర్ణింపబడుట ఉపమాద్యలంకారములయందలి పద్ధతి. ఇక్కడ తద్విరుద్ధముగా ప్రసిద్ధమైన పద్మమునే యుపమేయముచేసి, వర్ణ్యమగు లోచనముతో పోల్చుట జరిగినది. కావుననే యిది ప్రతీపమైనది. ఇట్లు వర్ణించుటచేత వర్ణ్యము (లోచనము) నకు గుణోత్కర్షము కలుగును. చంద్రుడు నీముఖముతో సమానుడు— అన్నది మరొక యుదాహరణము. దీనినిగూడ నిట్లే యన్వయించుకొనవచ్చును.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అలరును బ్రతీప ముపమాన మైనయట్టి
వస్తు వుపమేయ మగుచును వర లెనేని;
నీ విలోచన సదృశముల్ నీరజములు;
నీ ముఖసముండు పరిపూర్ణసోముఁ డనఁగ.

ద్వితీయ భేదము :

8. అన్యోపమేయలాభేన వర్ణ్యస్యానాదరశ్చ తత్,
అలం గర్వేణ తే వక్త్ర! కాన్త్యా చన్ద్రో భవాదృశః॥

టీక : అన్య + ఉపమేయలాభేన=అన్యమైన యుపమేయము లభించుటచేత; వర్ణ్యస్య=ప్రకృతమైన యుపమేయమునకు; అనాదరః=తిరస్కారము; (వర్ణితం చేత్=వర్ణింపబడినయెడల); తత్ + చ=అది యొక ప్రతీపము॥ వక్త్ర=ఓవదనమా; తే=నీయొక్క; గర్వేణ=గర్వము; అలమ్=చాలును; చన్ద్రః=చంద్రుడు; కాన్త్యా=శోభచేత; భవాదృశః=నీతో సమానుడు.

వ్యాఖ్య : పూర్వార్థమున లక్షణము, ఉత్తరార్థమున లక్ష్యము ప్రదర్శింపబడినవి.

అవర్ణ్యమైన యుపమేయము లభించుటచేత వర్ణ్యము ననాదరించినట్లు చెప్పినయెడల, అదియును ప్రతీపాలంకారమే యగును. ఇది లక్షణము. ఇక్కడకూడ ప్రకృతవర్ణ్యమును తిరస్కరించుట యున్నప్పటికిని, ఉపమాన కోటికి చెందిన అవర్ణ్యమును ఉపమేయముగా పరిగణించుట జరుగుచునే యున్నది. కావుననే, యిది ప్రతీప మగుట.

ఓ వదనమా! ఇంక నీగర్వము చాలును. కాంతిచేత చంద్రుడు నీతో సమానుడు- అన్నది లక్ష్యము. వదనము ప్రకృతవర్ణ్యము. కాంతి సమాన ధర్మము. చంద్రుడు అప్రకృతమైన యుపమేయము. వదనమునకు కాంతి యందు తనతో సాటిరాగలవారు లేదన్న గర్వమున్నది. చంద్రునకుసైతము కాంతి యున్నది; కావున నీకు సాటి కాగలడు- అనిచెప్పుటచేత ప్రకృతము ననాదరించుట జరుగుచున్నది. కాని కాంతిమత్త్వమునందు ప్రసిద్ధినొందిన చంద్రుని నుపమేయముగా పరిగణించి, అతనికిని కాంతిగలదని చెప్పుట చంద్రునికి న్యూనత్వమునే కల్పించుచున్నది. కావుననే యిది ప్రతీపాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్ర చంద్రాలోకము :

గీ. పరఁగ నన్యోపమేయలాభంబుచే న
నాదరము వర్ణ్యమున కిడ నదియు నగును;

గర్వ మొందఁగ నేల మొగంబ ! నీకుఁ
గాంతిని భవాదృశుఁడు తారకావిభుండు.

తృతీయభేదము :

9. వర్ణ్యోపమేయలాభేన తథాన్యస్యాప్యనాదరః
కః క్రౌర్యదర్పస్తే మృత్యో ! త్వత్తుల్యా స్సన్తిహి స్త్రియః॥

టీక : వర్ణ్య + ఉపమేయలాభేన=ప్రకృతమైన యుపమేయము లభించుటచేత; అన్యస్య + అపి=అప్రకృతమైన యుపమేయమునకు సైతము; అనాదరః=తిరస్కారము; (వర్ణితం చేత్=వర్ణింపబడినయెడల); తథా=అట్లే; (ప్రతీపంస్యాత్=ప్రతీపమగును)॥ మృత్యో=ఓ మరణమా; తే=నీకు; క్రౌర్య దర్పః=క్రూరత్వమునందు గర్వము; కః=ఏమి (నిష్ప్రయోజనమని భావము) త్వత్ + తుల్యాః = నీతో సాటియగువారు; స్త్రియః = స్త్రీలు; సన్తిహి= ఉన్నారు లే.

వ్యాఖ్య : ప్రకృతమైన యుపమేయము లభించుటచేత అప్రకృతమైన యుపమేయము ననాదరము చేసినయెడల ఇది యింకొకవిధమైన ప్రతీప మగును. ఇది లక్షణము.

ఓ మృత్యువా ! నీకు క్రౌర్యదర్పమేల ? నీతో సాటియగువారు స్త్రీలు కలరు లె- అన్నది లక్ష్యము. స్త్రీలు వర్ణ్యము; మృత్యువు అవర్ణ్యము; క్రౌర్యదర్పము సాధారణధర్మము. నేనే క్రౌర్యమునందు అన్నింటిని మించిన దాన నని మృత్యువున కొక గర్వము కలదు. అది ప్రసిద్ధము. ఇప్పు డంతటి క్రౌర్యముగలవారు స్త్రీలు గలరని చెప్పుటచేత, మృత్యువునకు తిరస్కారమే లభించుచున్నది. వర్ణ్యమునుబట్టి తుల్యధర్మముగల అవర్ణ్యమును తిరస్కరించుటవలన నిది ప్రతీపలక్షణమునకు సరిపడుచున్నది.

ఆంధ్ర చంద్రాలోకము :

గీ. ఒరుని యనాదరంబు వర్ణ్యోపమేయ
లాభమునఁ గల్గ నదియుఁ జెలంగు; మిత్తి !
క్రౌర్యదర్పంబు నీకేల ? కలరు చాలఁ
ద్వత్సమము లైనయట్టి కాంతాజనములు.

విమర్శ : మూలమునందలి 'అన్యస్యాప్యనాదరః' అన్నది యనువాదమందు "ఒరుని యన్యాదరంబు" అని యైనది. మూలమునందలి 'అన్య' శబ్దము సాంకేతికము. దీనికి అప్రకృతము. అవర్ణ్యము మొదలగు పదమునే యుపయోగింపవలయును. అట్లుండుట శాస్త్రపద్ధతి, ఇక్కడ 'ఒరుని' అని మహార్థకముగా నుపయోగించుట జరిగినది. ఇది సందర్భసముచితము కాదు. ఆ తరువాత నుండవలసినది 'అనాదరంబు' అనియే. అట్లున్నయెడల ఛందస్సు చెడును. "అన్యాదరంబు" అని యున్నదానికి అర్థము సంగతము కాదు. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. పరఁగు వర్ణ్యోపమేయ లాభంబుచేత
నన్యము ననాదరంబు సేయంగ నదియు;
మృత్యువా! క్రౌర్యదర్పం బదేల నీకు?
స్త్రీలు కలరులే! యిల నిన్ను బోలువారు.

చతుర్థభేదము :

10. వర్ణ్యేనాన్యస్యోపమాయా అనిష్పత్తివచశ్చ తత్
ముధాపవాదో ముగ్ధాక్షి! త్వన్ముఖాభం కిలామ్బుజమ్॥

టీక : వర్ణ్యేన = ప్రకృతముతో; అవర్ణ్యస్య = అన్యమునకు; ఉపమాయాః=ఔపమ్యముయొక్క; అనిష్పత్తివచః=అసంభవమన్న మాట; తత్ + చ=మరియొక ప్రతీపము॥ ముగ్ధాక్షి=ఓ మనోహర నేత్రా; అంబుజమ్= పద్మము; త్వత్ + ముఖాభమ్ = నీముఖకాంతివంటి కాంతిగలది (అనుట); ముధా + అపవాదః+కిల=మిథ్యారూపమగు నపవాదము కదా!

వ్యాఖ్య : వర్ణ్యముతో అవర్ణ్యమునకు పోలిక అసంభవ వచనమని చెప్పినయెడల, అది యింకొక ప్రతీపభేద మగును. ఇది లక్షణము. ముఖాదులు వర్ణ్యములు; పద్మాదులు అవర్ణ్యములు; రెండింటికిని సామ్యము ప్రసిద్ధము. కాని, యిచ్చట సామ్యము అసంభవ మని చెప్పుటచేత అవర్ణ్యము అత్యంత తిరస్కారపాత్రమగుచున్నది. కావుననే యిది ప్రతీప మగుట.

ఓ ముగ్ధాక్షి! పద్మము నీముఖశోభను గలిగియున్నదనుట మిథ్యాపవాదమేకదా. అన్నది లక్ష్యము. ముఖము వర్ణ్యము; పద్మము అవర్ణ్యము; అథ సమానధర్మము. ముఖమును పద్మముతో పోల్చుట ప్రసిద్ధము. దానిని

వ్యత్యయముచేసి పద్మమునే ముఖముతో పోల్చినయెడల ప్రతీపమగును. ఇప్పుడట్టిపోలికయే అసంభవమని, మృధాపవాదమని యనుటచేత పద్మము అత్యంతతిరస్కృత మగుచున్నది. దీనివలన ప్రకృతమైన వర్ణ్యమునకు ప్రకర్ష యేర్పడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. వర్ణ్యమున నుపమానాన్యవస్తువునకుఁ
దగ ననిష్పత్తి వచనంబు దప్పుల నిదియు;
ధవళనయన ! మృషాపవాదంబు యుష్మ
దానన సమాన మానంట యంబుజంబు.

విమర్శ : ఉపమాన + అన్యవస్తువు అని యన్నప్పుడు ఉపమానము కంటె నన్యమగు వస్తువన్న యర్థమును గ్రహింపరాదు. ఉపమానముగా ప్రసిద్ధమగు నన్యవస్తువన్న యర్థమును మాత్రమే గ్రహింపవలయును. మూలమునందు 'అన్యస్యోపమాయాః' అని యుండుటచేత 'ఉపమా' శబ్దమును 'అన్యస్య' అనుదానికి విశేషణముగా గ్రహించుట జరిగియుండును. కాని అది సరికాదు. 'ఉపమాయాః' అనుదానికి దీటుగా 'ఔపమ్యముయొక్క' అను భావమును సూచించు పద మిచ్చట కానరాకున్నది. 'ఔపమ్యముయొక్క యనిష్పత్తివచనము అన్నది యుద్దిష్టమయిన యన్వయము; కావున, ఇచ్చట సందర్భమునుబట్టి ''ఔపమ్యముయొక్క' అనుదాని నధ్యాహృతము చేసికొనవలసి యుండును.

పంచమభేదము :

11. ప్రతీప ముపమానస్య కైమర్థ్య మపి మన్వతే
దృష్టం చేద్వదనం తస్యాః కింపద్మేన ? కి మిన్దునా ?

టీక : ఉపమానస్య = ఉపమానముయొక్క; కైమర్థ్యమ్ + అపి = కిమర్థమని ప్రశ్నించుటనుగూడ; ప్రతీపమ్ = ప్రతీపాలంకారముగా; (సూరయః = పండితులు); మన్వతే = భావించుచున్నారు॥ తస్యాః = స్త్రీయొక్క; వదనమ్ = ముఖము; దృష్టం + చేత్ = చూడబడినయెడల; పద్మేన + కిమ్ = పద్మముతో నేమి ప్రయోజనము; ఇందునా + కిమ్ = చంద్రునితో నేమిపని.

వ్యాఖ్య : ఉపమానముయొక్క కైమర్థ్యముకూడ ప్రతీపాలంకార మగు నని లక్షణము. కిమ్ + అర్థమ్ అని యనగా 'దేనికొరకు' అని యర్థము; అనగా నిరర్థకము, నిష్ప్రయోజకము- నని యే తాత్పర్యము. కిమర్థస్యభావః కైమర్థ్యమ్. కైమర్థ్య మని యనగా నిష్ప్రయోజకత్వ మని భావము. ఉపమానము యొక్క కార్యము నుపమేయమే చేయుచుండగా ఉపమానము నిష్ప్రయోజక మగును గదా ! అప్పుడు ఉపమేయమే గుణోత్కర్షమగును. కావుననే యిదికూడ ప్రతీపభేద మగుచున్నది.

సుందరీవదనమును సందర్శించినయెడల పద్మమేల ? చంద్రుడేల ? అన్నది లక్ష్యము. వదనము వర్ణ్యము; పద్మ చంద్రులు అవర్ణ్యము. పద్మమును గాని చంద్రునిగాని దర్శించుటచేత గలిగెడి యానందము వదనమును దర్శించుటచేతనే కలుగుచున్నది కావున నింక, పద్మాదులతో ప్రయోజనములేదు. ఇట్లనుటచేత వదనముయొక్క అధిక్యము ప్రతిష్ఠితమగుచున్నది. ముఖమును పద్మముతోగాని, చంద్రునితోగాని పోల్చుట ప్రసిద్ధము. పద్మధర్మము, చంద్రధర్మము ముఖమునందే యుండుటచేత పద్మచంద్రులకు తిరస్కారము లభించుచున్నది అందువలననే ప్రతీపమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము:

గీ. తనరు నుపమాన కైమర్థ్యమును బ్రతీప
మనఁగఁ గావ్యములందు; నీ యలరుఁబోఁడి
నెమ్మొగము చూడఁబడెనేని నీరజముల
తోడ నేమి ? సుధాంశునితోడ నేమి ?

## 5. రూపకాలఙ్కారః (తద్భేదాః)

12. విషయ్యభేద తాద్రూప్య రఞ్జనం విషయస్య యద్
రూపకం తత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః॥

టీక : విషయస్య = ఉపమేయముయొక్క; విషయి + అభేదరఞ్జనమ్ = ఉపమానముతోడి యభేదవర్ణనమును; విషయి + తాద్రూప్యరఞ్జనమ్ = ఉపమానముతోడి తాద్రూప్యవర్ణనమును; యత్ = ఏదియో; తత్ + రూపకమ్ = అది రూపకాలంకారము॥ తత్ = అరూపకాలంకారము; ఆధిక్య + న్యూనత్వ

+ అనుభయ + ఉక్తిభిః = అధికోక్తిచేతను, న్యూనతోక్తిచేతను, అనుభయోక్తిచేతను; త్రిధా = మూడు విధములుగా; (స్యాత్ = అగును.)

వ్యాఖ్య : ఒక్క శ్లోకమునందే రచయిత రూపకాలంకారమునకు లక్షణమును, భేదములను గూడ సమూకలనము చేసియున్నాడు. లక్ష్యములను తరువాతి శ్లోకములలో వరుసగా ప్రదర్శించును. ఇట్లు అనేకభేదము లున్నప్పుడుమాత్రమే లక్షణమునుండి లక్ష్యమును వేరుచేసి చూపుట జరుగును. అట్లు కానియెడల ఒకేశ్లోకమున, పూర్వార్ధమున లక్షణమును ఉత్తరార్ధమున లక్ష్యమును ప్రదర్శించుట రచయిత సర్వసాధారణముగా పాటించు పరిపాటి.

ఉపమేయమునకు ఉపమానముతోడి యభేదమునుగాని, తాద్రూప్యమునుగాని వర్ణించినయెడల రూపకాలంకారమగును. ఇది లక్షణము. అభేదమనగా భేదభావమని యర్థము. తాద్రూప్యమని యనగా తద్రూపత్వమని యర్థము. అభేదరంజనమువలన ఉపమానముకంటె నుపమేయము భిన్నము కానట్లుగా వర్ణించుట జరుగును. తాద్రూప్యరంజనమువలన ఉపమేయమునకుపమానము తోడి సాదృశ్యముమాత్రమే వర్ణితమగును. రంజనపదమువలన ఈ యభేదము కాని సాదృశ్యము కాని సహృదయ హృదయరంజకమై యుండవలయునన్నది నిష్కర్ష. 'ఆరోపాత్తు రూపకమ్' అన్న నిరుక్తినిబట్టి రూపకమునం దారోపణమే జరుగుచున్నదని గుర్తింపవలయును. అభేదము నారోపించుటచేత అభేదరూపకము తాద్రూప్యము నారోపించుటచేత తాద్రూప్యరూపకము- అని రూపకాలంకారము స్థూలముగా రెండుదరకములైనది.

అధికోక్తి, న్యూనోక్తి, అనుభయోక్తి- అనువానివలన పైరెండు భేదములును మరల మూడేసి భేదములను పొందును. అప్పుడు అధికాభేదరూపకము, న్యూనాభేదరూపకము, అనుభయాభేదరూపకము, అధికతాద్రూప్యరూపకము, న్యూనతాద్రూప్యరూపకము, అనుభయతాద్రూప్యరూపకము- అని మొత్తము ఆరు భేదములగును.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. ప్రకట మగునట్టి విషయంబునకు విషయ్య
భేద తాద్రూప్య రంజనం బేది యదియు

రూపకం బిది మూఁడు తీరులఁ దనర్చు
నధికతా న్యూనతానుభయ వచనాప్తి.

13. అయం హి ధూర్జటి స్సాక్షాద్యేన దగ్ధాః పురః క్షణాత్,
అయ మాస్తే వినా శమ్భు స్తార్తీయీకం విలోచనమ్॥

టీక : యేన=ఎవనిచేత; క్షణాత్=క్షణకాలములో; పురః=పురములు; దగ్ధాః=దహింపబడినవో; (సః=అ); ధూర్జటిః=శివుడు; సాక్షాత్=ప్రత్యక్షముగా; అయం+హి=నిశ్చయముగా నితడే॥ తార్తీయీకం=మూడవదియైన; విలోచనం=కన్ను; వినా=లేనట్టి; శమ్భుః=శివుడు; అయం=ఇతడు; ఆస్తే=అయియున్నాడు.

వ్యాఖ్య : లక్ష్యములను విలోమక్రమమున ప్రదర్శించుట జరుగుచున్నది. లక్షణము లేక్రమమున నిరూపితములైనవో యాక్రమముననే లక్ష్యములును నిరూపితము లగుచుండుట సాధారణ పద్ధతి. వక్తృవివక్షనుబట్టి, వస్తుప్రాధాన్యమునుబట్టి క్రమము మారవచ్చును. పూర్వము చెప్పికొన్న క్రమమునుబట్టి అధికత్వాభేదరూపకమును ప్రప్రథమముగా ప్రదర్శింపవలసియుండును. ఇక్కడ ప్రాధాన్యమునుబట్టి అభేదరూపకభేదములలో కడపటిదైన అనుభయాభేదరూపకమును ప్రదర్శించుట జరిగినది.

ఎవనిచేత పురములు క్షణములో దగ్ధములైనవో, ఆధూర్జటియే యితడు అన్నది లక్ష్యము. ఇది యొకరాజు నుద్దేశించి చెప్పినమాట. 'ఆధూర్జటియే యితడు' అని చెప్పుటచేత అభేదము ప్రతిపన్న మగుచున్నది. 'సాక్షాత్' అన్న పదము దీనికి సహకరించుచున్నది. 'హి' అన్నది నిశ్చయద్యోతకము. ఈశ్వరుడు త్రిపురములను దగ్ధము గావించెను; ఈరాజు శత్రుపురములను దగ్ధము గావించెను. పురదాహకధర్మ మిరువురకు సమానమే. అల్పత్వము కాని అధికత్వము కాని ఉక్తము కాలేదు. కావుననే యిది యనుభయాభేదరూపక మగుచున్నది. ఇది మొదటి భేదము.

మూడవకన్నులేని శంభుడే యీతడు- ఇది యొకరాజునుగూర్చి చేసిన వర్ణనము. 'శంభుడే యీతడు' అని యనుటచే రాజునకును శంభునకును అభేదము చెప్పబడినది. కావున అభేదరూపకము. శంభుడు మూడు కన్నులు గలవాడు. ఈతడు మూడవకన్ను లేనివాడు. లేకపోవుట న్యూనత్వ ప్రతి

పాదకము. కావుననే యిది న్యూనాభేదరూపకమునకు లక్ష్య మగుచున్నది. ఇది రెండవ భేదము.

14. శమ్భుర్విశ్వ మవత్యద్య స్వీకృత్య సమదృష్టితామ్,
అస్యా ముఖేన్దునా లబ్ధే నేత్రానన్దే కిమిన్దునా॥

టీక : అద్య=నేడు; శమ్భుః=ఈశ్వరుడు; సమదృష్టితామ్=సమదృష్టిత్వమును; స్వీకృత్య = స్వీకరించి; విశ్వమ్ = ప్రపంచమును; అవతి=రక్షించుచున్నాడు॥ అస్యాః = ఈమెయొక్క; ముఖ + ఇన్దునా = ముఖచంద్రునిచే; నేత్రానందే = నయనానందము; లబ్ధే (సతి)=కలుగుచుండగా; ఇందునా + కిమ్ = చంద్రునితో నేమి ?

వ్యాఖ్య : ఈశ్లోకమునందు రెండింటికి లక్ష్యములు చూపబడినవి. శంభు డిప్పుడు సమదృష్టిని స్వీకరించి విశ్వమును రక్షించుచున్నాడు. ఇది కూడ ఒకరాజునుగూర్చి చేసిన వర్ణనమే. 'శంభుడు కాపాడుచున్నాడు' అని యనుటచేత ప్రత్యక్షముగా నున్న రాజునకు శంభునితో అభేదము సాధింపబడుచున్నది. కావున అభేదరూపకము. శంభుడు మూడు కన్నులు గలవాడు. కావున సమదృష్టిలేనివాడు. ప్రత్యక్షముగనున్న శంభుడు సమదృష్టిగలవాడు; అనగా సమదృష్టిని గలిగియుండుట యన్నయాధిక్యము గలవాడు. కావుననే యిది అధికాభేదరూపకమునకు లక్ష్యమైనది. ఇంతవరకు అభేదరూపకమునకు గల మూడు భేదములకు లక్ష్యములు ప్రదర్శించుట జరిగినది.

ఈమెయొక్క ముఖచంద్రునిచే నేత్రానందము కలుగుచుండగా చంద్రుడేల ? అన్నది లక్ష్యము. 'ముఖమేవ చన్ద్రః' ముఖమే చంద్రు డను నర్థమున ముఖచంద్రుడు అన్న సమాసము ప్రయుక్తము. ముఖము వేరు; చంద్రుడు వేరు– భిన్నత్వము స్పష్టముగా నున్నది. అయినను ముఖమునకు చంద్రత్వారోపము జరుగుచున్నది. ఆరోపయతి రూపయుక్తం కరోతీతి రూపకమ్– అను నిర్వచనమునుబట్టి రూపకము సార్థకమగుచున్నది. ఇక్కడ విషయమైన ముఖమునకు చంద్రత్వారోపముచేత తాద్రూప్యరూపక మగుచున్నది. ఇచ్చట ఉపమానముకంటె అధికత్వమును గాని న్యూనత్వమును గాని తెలుపకుండుటచేత, ఇది అనుభయతాద్రూప్యరూపకము. ఇక్కడకూడ ప్రతిలోమక్రమమే యనుసరింపబడినది.

చివరకు వచ్చుసరికి 'చంద్రు డేల?' అని యుపమాన కైముత్యము కూర్పబడినది. దీనినిబట్టి 'ప్రతీపాలంకారము'గా నిర్ణయింపవలయు ననిపించుట సహజము. కాని అలంకారనిర్ణయము ప్రాధాన్యవివక్షను బట్టి జరుగవలయును. పూర్వమున 'ముఖచంద్రుడు' అన్నచోటి యారోపము ప్రధానము. తత్ప్రాధాన్యమును బట్టియే ఉపమాన తిరస్కారమున కవకాశము కలుగుచున్నది. కావున దీనిని రూపకముగానే నిర్ణయించుట సముచితము.

15\. సాధ్వీయ మపరా లక్ష్మీ రసుధా సాగరోదితా,
అయం కళఙ్కినశ్చన్ద్రాన్ముఖచన్ద్రో௨తిరిచ్యతే॥

టీక: ఇయం సాధ్వీ = ఈ పతివ్రత; అపరాలక్ష్మీః=అపరలక్ష్మి; న + సుధాసాగర + ఉదితా=అమృతసాగరమునుండి యుత్పన్నము కానిది॥ కళఙ్కినః=కళంకముగల; చన్ద్రాత్ = చంద్రునికంటె; అయం = ఈ; ముఖచన్ద్రః=ముఖరూపమైన చంద్రుడు; అతిరిచ్యతే=అతిశయించుచున్నాడు.

వ్యాఖ్య: ఈసాధ్వి సుధాసాగరమునందు సంభవింపని అపరలక్ష్మి—అన్న లక్ష్యమునందు 'అపరలక్ష్మి' అని యనుటచేత లక్ష్మికంటె భిన్నత్వము ప్రతిపన్న మగుచున్నది; అయినను లక్ష్మీధర్మారోపణము జరుగుచున్నది. విషయమునందు విషయిరూపత్వరంజనము జరుగుచుండుటచేత, ఇది తాద్రూప్యరూపక మగును. లక్ష్మి సుధాసాగరోదిత; అది ఆమెయందలి యాధిక్యము. ఈమె అసుధాసాగరోదిత; ఇది యామెయందలి న్యూనత్వము. వర్ణ్యమునకు న్యూనత్వము చెప్పబడుటచేత న్యూనత్వ తాద్రూప్యరూపకమునకిది లక్ష్యము. ఇది తాద్రూప్యరూపకమునందు రెండవ భేదము.

కళంకవంతుడైన చంద్రునికంటె ఈముఖచంద్రు డతిశయించుచున్నాడు. ముఖచంద్రుడు అని యనుటచేత ముఖరూపమైన చంద్రుడు అన్నది స్పష్టము. ఇచ్చట ముఖమునకు చంద్రత్వమారోపితమైనది. కావున తాద్రూప్యరూపకము సిద్ధించుచున్నది. చంద్రుడు కళంకవంతుడు; ముఖచంద్రుడు అతిశయసహితుడు. విషయము విషయికంటె నాధిక్యమును గలిగియున్నట్లు చెప్పబడుటచేత, ఇది అధికతాద్రూప్యరూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఇది తాద్రూప్యరూపకమునందు మూడవభేదము.

ఆంధ్రచంద్రాలోకము :

క. ఈతండే కద సాక్షా
ద్భాతేశుఁడు క్షణములోనఁ బురములు భస్మీ
భూతంబు లయ్యె నెవ్వని
చేత ననఁగ లక్ష్య మమరు శేషవిభూషా !

విమర్శ : పైది అనుభయాభేదరూపకమునకు లక్ష్యము.

గీ. ఉన్నవాఁ డీతఁడే తిగకన్ను లేని
శంభుఁ డవ్వుచును; శంభుఁ డీసమయమునను
విశ్వ మేలెడి సమదృష్టి స్వీకరించి;
యనఁగ నివి లక్ష్యము లగు శశాంకమౌళి !

విమర్శ : 'ఉన్నవాఁ డీతఁడే తిగకన్నులేని శంభుఁడవ్వుచును' అని యున్నంతవరకు న్యూనాభేదరూపకమునకు లక్ష్యము. మిగిలిన భాగము అధికాభేదరూపకమునకు లక్ష్యము. ఈ రెండు పద్యములలోను అభేదరూపకమునకు సంబంధించిన మూడు భేదములకు నుదాహరణములు సంతరింపబడినవి.

క. దీని ముఖేందునిచే నే
త్రానందము నాకు లబ్ధ మగుచుండంగా
నా నిందు కలువనెచ్చెలి
చే నేమగు నన్నయట్లు శీతాంశుధరా !

విమర్శ : తాద్రూప్యరూపమునకు లక్ష్యములను ప్రదర్శించుచు, అందు చివరిభేదమైన అనుభయతాద్రూప్యరూపమునకు ప్రథమస్థానము నొసగి యున్నాఁడు.

గీ. సాధ్వి యిది యసుధార్ణవజాత యైన
యపర లక్ష్మి; కళంకి యైనట్టి విధుని
కంటె మిగులెడు ముఖసుధాకరుఁ డనంగ
లక్ష్యములుగాఁ, దనర్చు నిలాశతాంగ !

విమర్శ : 'అపరలక్ష్మి' యని యన్నంతవరకు న్యూనతాద్రూప్య రూపకమునకు లక్ష్యము. మిగిలినభాగము అధికతాద్రూప్యరూపకమునకు లక్ష్యము.

## 6. పరిణామాలఙ్కారః

16. పరిణామః క్రియార్థశ్చేద్విషయీ విషయాత్మనా
ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా॥

టీక : విషయీ=ఉపమానము; విషయాత్మనా = ఉపమేయరూపమున; క్రియార్థః + చేత్=కార్యసాధకమైనయెడల:పరిణామః=పరిణామాలంకారము; (భవతి=అగును)॥ మదిరేక్షణా=మత్తలోచన; ప్రసన్నేన=స్వచ్ఛమయిన; దృక్ + అబ్జేన=నేత్రభూతమైన పద్మముతో; వీక్షతే=చూచుచున్నది.

వ్యాఖ్య : ఇందు పూర్వార్థము లక్షణము. ఉత్తరార్థము లక్ష్యము. ఉపమానము ఉపమేయాత్మకత్వముచేత క్రియాసాధకమైన యెడల పరిణామాలంకార మగును. ఇది లక్షణము. ఉపమేయముతో ధర్మసాదృశ్యముగల ఉపమానము ఘటింపబడియు, ప్రకృతకార్యసాధనమునకు తనకు సామర్థ్యము చాలకపోవుటచేత ఉపమేయత్వమునే యపేక్షించును. ఈ యపేక్షచేతనే దీనికి పరిణామ మన్న పేరు సార్థక మగుచున్నది.

మదిరేక్షణ ప్రసన్నమైన నేత్రాబ్జముతో వీక్షించుచున్నది. ఇది లక్ష్యము. ఇచ్చట నేత్రము విషయము; అబ్జము విషయి. నేత్రమునందు అబ్జత్వ మారోపితమగుటచే, ఇది రూపకము కావలయును. 'వీక్షించుచున్నది' అన్నక్రియాపదమువలన నట్లుకాకుండ నైనది. రూపకమునందు ఆరోపితమైన అబ్జమునకే ప్రాధాన్యము. అదియే క్రియాపదముతో నన్వయింపవలసి యుండును. ఇచ్చట, అట్లే యనుకొనుటకు వీలుకాదు. అబ్జమునకు వీక్షణశక్తి లేదు. కావున వీక్షణశక్తిగల నేత్రముగా పరిణామము నొందవలసి వచ్చుచున్నది. ఇట్లు విషయియైన అబ్జము వీక్షణశక్తికొరకై విషయమగు నేత్రముతో తాదాత్మ్యము నొందుచున్నది. అప్పుడుమాత్రమే క్రియాన్వయ సామర్థ్యము కలుగుచున్నది. కావుననే యిది పరిణామాలంకారమునకు లక్ష్యము కాగలిగినది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. విషయి విషయాత్మతను గ్రియాన్వితమైన
నదియుఁ బరిణామమనఁగఁ బ్రఖ్యాతి కెక్కు;
నవనిలోనఁ బ్రసన్నేక్షణాంబుజమున
నాయతేక్షణ చూచెడి ననఁగ శర్వ!

## 7. ఉల్లేఖాలఙ్కారః

17. బహుభి ర్బహుధోల్లేఖా దేక స్యోల్లేఖ ఇష్యతే,
స్త్రీభిః కామోఽర్థిభిస్స్వర్ద్రుః కాలశ్శత్రుభిరైక్షి సః॥

టీక : ఏకస్య=ఒక్కనియొక్క (ఒక్కనిగూర్చి); బహుభిః=పెక్కురచేత; బహుధా=పెక్కువిధములుగా; ఉల్లేఖాత్ = వర్ణనమువలన; ఉల్లేఖః=ఉల్లేఖాలంకారము; (సూరభిః = పండితులచేత); ఇష్యతే=అంగీకరింపబడుచున్నది॥ సః=అతడు; స్త్రీభిః = స్త్రీలచేత, కామః = మన్మథునిగాను; అర్థిభిః =యాచకులచేత: స్వర్ద్రుః = కల్పవృక్షముగాను; శత్రుభిః = విరోధులచేత; కాలః=యమునిగాను; ఐక్షి=చూడబడెను.

వ్యాఖ : అనేకధర్మసంయుక్తమైన విషయమును వేరువేరు వ్యక్తులు తమకిష్టమైన ధర్మమునుబట్టి తద్ధర్మవిశిష్టమగు నుపమానముతో పోల్చివర్ణించిన యెడల ఉల్లేఖాలంకార మగును. ఇది లక్షణము. ఉల్లేఖ మనగా వర్ణన మని యర్థము. కావున, ఉల్లేఖాలంకార మను పేరు సార్థక మగుచున్నది.

ఆరాజు స్త్రీలచేత మన్మథునిగాను, యాచకులచేత కల్పవృక్షముగాను, విరోధులచేత యమునిగాను చూడబడెను- ఇది లక్ష్యము. ఆ రాజు సౌందర్య దాతృత్వ పరాక్రమ గుణవిశిష్టుడు. స్త్రీలు సౌందర్యధర్మమును పురస్కరించుకొని మన్మథసాదృశ్యము కల్పించుకొనిరి. కావుననే అతనిని మన్మథాత్వమునుబట్టి మన్మథునిగానే దర్శించిరి. అట్లే దాతృత్వమును పురస్కరించుకొని కల్పవృక్షత్వమును బట్టి కల్పవృక్షముగానే యాచకులు దర్శించిరి. శత్రువులు పరాక్రమ ధర్మమునుబట్టి యమ్మృతమునే దర్శించిరి. ఒకేవ్యక్తి పెక్కురచేత పెక్కువిధములుగా పెక్కురతో పోల్చబడుటచేత ఇది ఉల్లేఖాలంకార మగుచున్నది. ఇది ఉల్లేఖమునందొక భేదము. సూరకవి గ్రంథమున దీని కను వాదము లేదు. ఈ పద్యమును గ్రహింపవచ్చును.

గీ. పెక్కు రొక్కని వర్ణింపఁ బెక్కు గతుల
నది ప్రశస్తమా నుల్లేఖ మనెడిపేర;
మదనుఁ డని స్త్రీలు కల్పద్రుమం బటంచు
యాచకులు కాలుఁ డని యరుల్ చూచి రతని.

రెండవ భేదము :

18. ఏకేన బహుధోల్లేఖేప్యసౌ విషయభేదతః
గురు ర్వచస్యర్జునోఽయం కీర్త్యా భీష్మ శ్శరాసనే॥

టీక : ఏకేన=ఒక్కనిచేత; (ఏకస్య=ఒక్కనియొక్క); విషయభేదతః =ధర్మభేదమునుబట్టి; బహుధా=అనేకవిధములుగా; ఉల్లేఖే (సతి)=వర్ణనము కాగా; అసౌ+అపి=అదికూడ; (ఉల్లేఖోభవతి = ఉల్లేఖాలంకారమగును)॥ అయం=ఇతడు; వచసి=వాక్కునందు; గురుః=బృహస్పతి; కీర్త్యా=కీర్తియందు; అర్జునః=అర్జునుడు; శరాసనే=విలువిద్యయందు; భీష్మః=భీష్ముడు.

వ్యాఖ్య : ఒక్కడే వేర్వేరు గుణములనుబట్టి యొక్కనిని వేర్వేరు వ్యక్తులతో అభిన్నునిగా వర్ణించినయెడల, ఇదికూడ ఉల్లేఖాలంకారమే యగును. ఇది లక్షణము. పూర్వభేదమునందు గ్రహీతలు పెక్కురు. అక్కడ కూడ తత్తదభిమతములను బట్టియే వైవిధ్యము కలిగినది. ధర్మములనుబట్టి యేర్పడిన వైవిధ్యము రెండు విధములయిన యుల్లేఖమునందును సమానమే. వక్తలు పెక్కురయినప్పుడు ధర్మము వాచ్యముకాక గౌణముగా నున్నది. వక్త యొక్కడే యైనప్పుడు ధర్మము వాచ్యముగా వెల్లడింనబడుచున్నది. మొదటిభేదము గ్రహీతృభిన్నత్వము నాశ్రయించుకొన్నది; అందు ధర్మ ప్రతిపత్తి గౌణము. రెండవభేదము గ్రహీత్రైకత్వము నాశ్రయించుకొన్నది; ఇందు ధర్మప్రతిపత్తి వాచ్యము.

ఇతడు వక్తృత్వమునందు బృహస్పతి, కీర్తియం దర్జునుడు, విలువిద్యయందు భీష్ముడు- ఇది లక్ష్యము. ఒకరాజు నుద్దేశించి యొకడు పలికిన ప్రశంసావాక్య మిది. రాజు వక్తృత్వ, కీర్తిమత్త్వ, ధన్విత్వ గుణవిశిష్టుడు. మూడు విధములయిన గుణములచేత ముగ్గురితో అభేదము కల్పింపబడినది. రాజు ఉపమేయము; వక్తృత్వము సాధారణధర్మము; ఉపమానము బృహస్పతి. కీర్తిమత్త్వము సాధారణధర్మమైనప్పుడు ఉపమాన మర్జునుడు;

ధన్విత్వము సాధారణధర్మ మైనప్పుడు ఉపమానము భీష్ముడు. ఒకేవ్యక్తి వేర్వేరు ధర్మములనుబట్టి వేర్వేరు వ్యక్తులతో అభేదమును పొందుట యిచ్చట నున్నది. కావుననే యిది యుల్లేఖమునకు లక్ష్యమగుచున్నది.

మొత్తముమీద చెప్పుకొన్నప్పుడు ఉల్లేఖమనియే నిర్ణయింపవలయును. కాని యిందు "గురు' శబ్దముచేత 'గొప్పవాడు' అన్న యర్థముకూడ కలుగుచున్నది. పైని చెప్పికొన్నట్లు 'బృహస్పతి" యన్న యర్థమును గలదు. ఇట్లే "అర్జున' శబ్దమునకు నిర్మలుడు, పార్థుడు అన్న యర్థములు గలవు. 'భీష్మ" శబ్దమునకు భయంకరుడు, శాంతనవుడు అన్న యర్థములు గలవు. కావున అనేకార్థసంశ్రయత్వముచేత శ్లేషాలంకారముకూడ నగుచున్నది.

పాక్షికముగా చూచినప్పుడు 'అయం గురుర్వచసి" అనుచోట అనుభయాభేదరూపకము కనుపట్టును. "అర్జునోఽయం కీర్తౌ' అయం భీష్మశ్శరాసనే' అనుచోట్ల సైతము రూపకము కలదు. కాని యిట్లు పాక్షికముగా చూచుట మొత్తముమీద నున్న యుల్లేఖమునకు భంజక మగును. కావున ప్రాధాన్యమును బట్టి యుల్లేఖమునే పరిగణింపవలయును. అది పరిపాటి.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అమితగతు లగు విషయభేదముల నొకని
చేత నుల్లేఖ మొదవినఁ జెలఁగు నదియు;
గురుఁడు వచనంబులందున నరుఁడు కీర్తిఁ
జాపమున భీష్ముఁ డతఁడన్న చందమునను.

## 8. 9, 10 స్మృతి భ్రాన్తి సన్దేహాలఙ్కారాః

19. స్యాత్ స్మృతి భ్రాన్తి సన్దేహై స్తదఙ్కాలఙ్కృతిత్రయమ్,
పఙ్కజం పశ్యతః కాన్తాముఖం మే గాహతే మనః॥

టీక : స్మృతి + భ్రాన్తి + సందేహైః=స్మరణ భ్రమ సంశయముల చేత; తత్ + అఙ్కం = ఆ పదములచేత చిహ్నితమైన; అలంకారత్రయమ్= మూడలంకారములు; స్యాత్ = అగును॥ పఙ్కజం + పద్మమును; పశ్యతః = చూచుచున్న; మే = నాయొక్క; మనః=మనస్సు; కాంతాముఖం = ప్రియా ముఖమునందు; గాహతే=ఆసక్త మగుచున్నది.

వ్యాఖ్య : ప్రథమార్ధమునందు మూడలంకారములకు లక్షణము తెలుపబడినది. ఉత్తరార్ధమున నందలి మొదటి యలంకారమునకు లక్ష్యము ప్రదర్శింపబడినది. ప్రథమజ్ఞాన మనుభవము. ఆ యనుభవమును పునర్నవీభవించునది స్మృతి. స్మృతివలన నేర్పడు నలంకారము స్మృతిమంతము. దీనిని స్మృతిమదలంకారము, స్మృత్యలంకారము— అనికూడ పిలువవచ్చును. ఇందు ఉపమానోపమేయములం దొకదానిని దర్శించుటచేత ప్రసిద్ధసాదృశ్యమును బట్టి రెండవది స్మరణకు వచ్చినట్లు వర్ణించుట జరుగును.

మిథ్యాజ్ఞానము భ్రాంతి. భ్రాంతివలన నేర్పడు నలంకారము భ్రాంతిమంతము. దీనిని భ్రాంతిమదలంకారము, భ్రాంత్యలంకారము— అనికూడ పిలువవచ్చును. ఇందు ఉపమానోపమేయములయందలి సాధారణధర్మమును బట్టి యుపమేయము నుపమానముగా భ్రమించినట్లు వర్ణించుట జరుగును.

అనిశ్చయజ్ఞానము సందేహము. సందేహమువలన నేర్పడు నలంకారము సందేహము. వర్ణ్యావర్ణ్యముల సాధారణధర్మమును మాత్రమే దర్శించి విశేషధర్మమును దర్శింపకపోవుటవలన నుద్భవించిన యనిశ్చయము వర్ణింపబడుట యిందు జరుగును.

ఈ మూడింటిలో మొదటిదైన స్మృత్యలంకారమునకు లక్ష్యము ఉత్తరార్ధమునందు ప్రదర్శింపబడినది. పద్మమును జూచుచున్న నాయొక్కమనస్సు ప్రియాముఖమునం దాసక్తమగుచున్నది. ఇది లక్ష్యము. పద్మము విషయి. పద్మమును దర్శించుచుండగా తత్సాదృశ్యముగల ప్రియాముఖము జ్ఞప్తికి వచ్చెను. పూర్వానుభూతమే నవీభూతమగుట జ్ఞప్తి. ఇట్లు సదృశవస్తుస్మరణము వర్ణింపబడుటచే ఇది స్మృత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అలరు స్మృతి భ్రాంతి సందేహ పదములం
దగు నలంకారములు మూఁడు; తమ్మిఁ జూచు
నాదు డెందంబు వికసిత నలిననేత్ర
యాస్యమున కగ్గమయ్యెడి ననఁగ శర్వ !

విమర్శ : స్మృత్యాదులచేత స్మృత్యాదిపదములతోడి యలంకారము లేర్పడు నన్నది లక్షణము. 'స్మృత్యాదులచేత' నన్నది పైలక్షణమున ప్రసక్తము కాలేదు. కావున స్పష్టత చాలదు.

ఈ క్రిందిపద్యమును గ్రహింపవచ్చును.

గీ. స్మృతియు భ్రాంతియు సందేహ మెసఁగునేని
నగు నలంకారములు తత్తదంకయుక్తి;
అంబుజము గాంచి నాప్రియురాలి మొగము
నందు లగ్నమయ్యెను మదీయాంతరంబు.

20. అయం ప్రమత్తమధుపస్త్వన్ముఖం వేత్తి పఙ్కజమ్,
పఙ్కజం వా సుధాంశుర్వేత్యస్మాకం తు న నిర్ణయః॥

టీక : అయం = ఈ; ప్రమత్తమధుపః = మదించిన తుమ్మెద: త్వత్ + ముఖమ్=నీయొక్క ముఖమును; పఙ్కజం=పద్మమని; వేత్తి = తలచుచున్నది॥ పఙ్కజం వా=పద్మమో; శీతాంశుః + వా = చంద్రుడో; ఇతి = అన్నది; అస్మాకంతు=మాకు; న + నిర్ణయః=నిశ్చయము లేదు.

వ్యాఖ్య : ఇందు పూర్వార్ధమున భ్రాంతిమంతమునకు లక్ష్యము. ఉత్తరార్ధమున సందేహమునకు లక్ష్యము ప్రదర్శింపబడినవి.

ఈ మదించిన తుమ్మెద నీవదనమును పద్మమని తలచుచున్నది. ఇచ్చట వర్ణ్యము వదనము. వదనమునకు పద్మసాదృశ్యముండుటచేత పద్మభ్రాంతి కలుగుట కవకాశము కలదు. పద్మమునకు సూర్యాస్తమయ సమయమున సంకోచము నొందుట మున్నగు విశిష్టధర్మములు గలవు. కాని విశిష్టధర్మమును దర్శింపక, సాదృశ్యమునుమాత్రమే దర్శించి వదనమును పద్మముగా నెంచుటచేత, ఇది భ్రాంతిమదలంకారలక్షణమునకు సరిపడుచున్నది.

పద్మమో చంద్రుడో మాకు నిశ్చయము లేదు. నిశ్చయము లేకపోవుటయే సందేహము. ఇచ్చట వర్ణ్యము ముఖము. ముఖమునకు పద్మసాదృశ్యము చంద్రసాదృశ్యము కూడ కలదు. ముఖమును పద్మత్వమునుబట్టి పద్మ మనవలయునో, చంద్రత్వమునుబట్టి చంద్రు డనవలయునో నిర్ణయము లేనట్లు వర్ణించుటచేత, ఇది సందేహాలంకార లక్షణమునకు సరిపడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

ఆ. వె. ఈ ప్రమత్త మధుప మెఱిఁగెడి నీమోము
పంకజం బఁటంచుఁ; బంకజంబొ

యమృతకరుఁడో నిర్ణయము లేదు మాకైన
ననఁగ లక్ష్యములు సుధాంశుమకుట !

విమర్శ : ఇందు 'పంకజం బంటుంచు' నన్నంతవరకు భ్రాంతిమంత మునకు లక్ష్యము. మిగిలినభాగము సందేహాలక్ష్యము భ్రాంతిమల్లక్ష్యము నందు సంస్కృతమునందున్న 'వేత్తి' అను పదమునకు సమానార్థకముగా 'ఎఱింగెడి' నన్నపదము ప్రయుక్తమైనది. అది సరికాదు. ఎఱుఁగుట యథార్థ జ్ఞానము. భ్రాంతి మిథ్యాజ్ఞానము. కాబట్టి 'ఎఱింగెడి' అను పదమునకు బదులుగా "ఎంచెడి" అన్నపదమును పఠించినయెడల లక్ష్యము లక్షణాను గుణమై యుండును.

## 11. అపహ్నుత్యలఙ్కారః (తద్భేదాః)

21. శుద్ధాపహ్నుతి రన్యస్యారోపార్థో ధర్మనిహ్నవః,
నాయం సుధాంశుః కింతర్హి వ్యోమగఙ్గా సరోరుహమ్॥

టీక : అన్యస్య = అవర్ణ్యముయొక్క; (ధర్మస్య=ధర్మముయొక్క); ఆరోపార్థః=ఆరోపణము ప్రయోజనముగాకల; ధర్మనిహ్నవః=ప్రకృతధర్మ నిషేధము; శుద్ధాపహ్నుతిః = శుద్ధాపహ్నుతియను నలంకారము; (భవతి = అగును)॥ అయం=ఇతడు; న + సుధాంశుః = చంద్రుడు కాడు; కిం తర్హి= మఱియేమి; వ్యోమగఙ్గా సరోరుహమ్=ఆకాశగంగయందలి పద్మము.

వ్యాఖ్య : అపహ్నుత్యలంకారము ఆరుభేదములను గలిగియుండును. శుద్ధాపహ్నుతి, హేత్వపహ్నుతి, పర్యస్తాపహ్నుతి, భ్రాంతాపహ్నుతి, ఛేకాప హ్నుతి, కైతవాపహ్నుతి- అన్నవి ఆభేదములు. అందు మొదటిదైన శుద్ధాప హ్నుతికి పూర్వార్థమున లక్షణమును, ఉత్తరార్థమున లక్ష్యమును గ్రంథకర్త నిరూపించుచున్నాడు.

ప్రకృతవస్తువునందు అన్యవస్తుధర్మము నారోపించుటకై ప్రకృతధర్మ మును నిషేధించిన శుద్ధాపహ్నుత్యలంకార మగును. ఇది లక్షణము. నిషేధ మువలన ప్రకృతధర్మమును మరుగుపరుచుట యిచ్చట జరుగుచున్నది. మరుగుపుచ్చుట యనగా, అపహ్నవము నాధారము గాభావించుకొని యేర్పడిన యలంకారమగుటచే దీని కపహ్నుతి యను పేరు సార్థకమగుచున్నది.

ఇతడు సుధాంశుడు కాదు; మఱియేమి? ఆకాశగంగయందలి పద్మము. ఇది లక్ష్యము. ఇచ్చట సుధాంశుడు వర్ణ్యము. పద్మము అవర్ణ్యము. అవర్ణ్యధర్మమైన పద్మత్వము నారోపించుటకై వర్ణ్యధర్మమైన సుధాంశుత్వమును 'కాడు' అను క్రియాపదముచేత నిషేధించుట జరుగుచున్నది. ఈ నిషేధమునకు అవర్ణ్యధర్మారోపణమే ప్రయోజనము. ఇచ్చట నిషేధము మాత్రమే యున్నది; నిషేధమునకు కారణాదులను నిబద్ధము చేయలేదు. కావుననే యిది శుద్ధాపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అన్యధర్మంబు నిలుప, లే దందు ధర్మ
మనిరయేని శుద్ధాపహ్నుతి నెగడుఁ గృతి;
నితఁడు కాఁడు సుధాంశుఁ డదేమి యనిన
నభ్రగంగాసరోరుహం బన్నయట్లు.

రెండవ భేదము

22. స ఏవ యుక్తిపూర్వశ్చే దుచ్యతే హేత్వపహ్నుతిః
నేన్దు స్తీవ్రో న నిశ్యర్కః సిన్ధోరౌర్వోఽయముత్థితః॥

టీక : యుక్తిపూర్వః + చేత్ = కారణపూర్వకమై యున్నయెడల; సః + ఏవ = అదియే; హేత్వపహ్నుతిః = హేత్వపహ్నుతి యని; ఉచ్యతే = పిలువబడును. తీవ్రః = తీక్ష్ణముగానున్న; అయం = ఈతడు; న + ఇన్దుః = చంద్రుడుకాడు; నిశి (స్థితః) = రాత్రియందు (ఉండుటచేత); న + అర్కః = సూర్యుఁడు కాడు; సిన్ధోః = సముద్రమునుండి; ఉత్థితః = వెలువడిన; ఔర్వః = బడబాగ్ని.

వ్యాఖ్య : శుద్ధాపహ్నుతియే హేతుపూర్వకమై యున్నయెడల హేత్వపహ్నుతి యగును. ఇది లక్షణము. వర్ణ్యధర్మమును హేతుపూర్వకముగా నిషేధించి, అవర్ణ్యధర్మము నారోపించుట యిందు జరుగును.

ఇతడు తీవ్రముగా నున్నాడు కావున చంద్రుడు కాడు, రాత్రివేళ సూర్యుఁడుఁడడు; సముద్రమునుండి వెలువడిన బడబాగ్నియే యిది. ఇది లక్ష్యము. విరహిణియైన యువతి చంద్రోపాలంభన సమయమున నుపయోగిం

చిన వచన మిది. ఇచ్చట వర్ణ్యము చంద్రుడు. చంద్రుడు సహజముగా చల్లని వాడు. ఇచ్చటియువతి విరహతప్త కావున చంద్రుడు తీవ్రముగా నని పించుట సహజము. తీవ్రత్వమును హేతువుగా పరిగణించి చంద్రునియొక్క చంద్రత్వమును నిషేధించుట జరిగినది. అయినచో సూర్యుడు కావలయును. సూర్యుడు రాత్రివేళ నుండడు కాబట్టి సూర్యుడగుటకును వీలులేదు. చంద్రత్వ సూర్యత్వములు రెండును నిషిద్ధములైనవి. తీవ్రత్వమును హేతువుగా గ్రహిం చియే సముద్రమునుండి వెలువడిన బడబాగ్ని యని నిశ్చయించుట జరిగినది. బడబాగ్నికూడ నింతకు ముందున్నదియే. అప్పుడు సముద్రగర్భముననున్నది. ఇప్పుడు సముద్రమునుండి వెలువడినకారణముగా తీవ్రత్వమును గలిగి యున్నది. ఈవిధముగా యుక్తిపూర్వకముగా చంద్రునియందు చంద్రత్వ మును నిషేధించి, బడబాగ్నిత్వమును నెలకొల్పుటచేత హేత్వపహ్నుతి లక్షణమునకు సరిపడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అదియకద యుక్తిపూర్వక మయ్యెనేని
హేత్వపహ్నుతి యనఁగను గృతులఁ బేర్చుఁ;
గాఁడు శశి తీవ్రుఁ డర్కుఁడు లేఁడు రాత్రి
వనధిగర్భసముత్థితౌర్వం బితండు.

మూఁడవభేదము :

23. అన్యత్ర తస్యారోపార్థః పర్యస్తాపహ్నుతిస్తు సః,
నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్॥

టీక : అన్యత్ర=అన్యమగు విషయమునందు; తస్య = ప్రకృతమైన విషయముయొక్క; ఆరోపార్థః=ఆరోపించెడి యర్థము; సః=అది; పర్యస్తాప హ్నుతి యను నలంకారము॥ అయం=ఇతడు; న+సుధాంశుః=చంద్రుడు కాడు; కిం+తర్హి=మరేమి; ప్రేయసీ ముఖమ్ (+ఏవ)=ప్రియురాలి ముఖమే; సుధాంశుః=చంద్రుడు.

వ్యాఖ్య : అన్య వస్తువునందు ప్రకృతవస్తువుయొక్క ధర్మము నారో పించుటకొరకు వస్తుధర్మమును నిషేధించిన యెడల పర్యస్తాపహ్నుతి యన్న

యలంకార మగును. ఇది లక్షణము. ఇచ్చట స్వధర్మమును నిషేధించినను, మరొక వస్తువునం దదే ధర్మమును నిక్షేపించుట జరుగుచున్నది. ఇట్లు సమీపమందలి మరొక వస్తువునందు స్వధర్మమును నెలకొల్పుటచేతనే పర్యస్తాపహ్నుతి యనుపేరు దీనికి సార్థకమగుచున్నది.

ఇతడు చంద్రుడు కాడు. మరేమి? ప్రేయసీముఖమే చంద్రుడు-అన్నది లక్ష్యము. ఇచ్చట చంద్రుడు వర్ణ్యము. "కాడు" అన్న శబ్దముచేత చంద్రునియందలి చంద్రత్వము నిషేధింపబడినది. 'ప్రేయసీముఖమే చంద్రుడు' అని యనుటచేత ప్రేయసీముఖమునందు చంద్రత్వము ఆరోపింపబడినది. ఇట్లు చంద్రత్వము చంద్రునినుండి తొలగింపబడి, పర్యస్త వస్తువయిన ముఖమునందు ఆరోపితమైనది. కావుననే యిది పర్యస్తాపహ్నుతికి లక్ష్యమగుచున్నది.

ఇది విరహార్తుడయిన ఒక యువకుని వచనము. ప్రేయసికి దూరముగా నున్నప్పుడు సుధాంశుడు సంతాపకరు డగుచున్నాడు. సుధాంశుడు సహజముగా అహ్లాదకరుడు కావలయును; తద్విరుద్ధముగా నుండుటచేత, తల్లక్షణము నిషిద్ధమగుచున్నది. ప్రేయసీముఖమే ఆహ్లాదకరము. ఆహ్లాదకరత్వముబట్టి ముఖమునకే చంద్రత్వ మారోపింపబడుచున్నది.

నిషేధము లేకుండ ఆరోపముమాత్రమే జరిగినయెడల, అది రూపకముమాత్రమే యగును. 'ప్రేయసీముఖమే చంద్రుడు' అని యున్నప్పుడు అభేద రూపకము కావలయును. కావున నిషేధము అపహ్నుతికి ముఖ్యము.

ఆంధ్రచంద్రాలోకము ;

క. కృతి నగుఁ బర్యస్తాప
హ్నుతి పెరచోట నుపమాన మునుచుటకై సి
హ్నుతిఁ జేసినఁ; గాఁ డీతఁడు
సితకిరణుఁడు విధుఁడు ప్రేయసీముఖ మనఁగన్.

విమర్శ: 'ఉపమాన మునుచుటకై' యన్నది సరికాదు. పర్యస్తాపహ్నుతియందలి వస్తువులు రెండును వర్ణ్యములే. 'ఈతఁడు సితకిరణుఁడు కాఁడు' అని యెదురుగా నున్నవానిని నిర్దేశించుట స్పష్టముగా నుండగా 'సితకిరణుడు' అవర్ణ్యుని యనుట కుదురదు. ముఖము వర్ణ్యమన్నది తెలియు

చునే యున్నది. కావున ఒక వర్ణ్యమునందలి ధర్మమును మరొక వర్ణ్యము నందు నెలకొల్పుట యిచ్చట జరుగుచున్నది. ఇందులకు మొదటి వర్ణ్యము నందు తద్ధర్మము లేదని నిషేధించుట యావశ్యక మగుచున్నది.

పైపద్యమునందు 'నుపమానమునుచుటకై' అన్నదానికి బదులుగా 'నిజధర్మమునుచుటకై' యని చదువుకొనిన సముచితముగా నుండును. అప్పుడు లక్షణము సంగతమగును.

నాలుగవభేదము :

24. భ్రాన్తాపహ్నుతి రన్యస్య శఙ్కాయాం భ్రాన్తివారణే;
తాపం కరోతి సోత్కమ్పం జ్వరః కిం ? న సఖిస్మరః॥

టీక : అన్యస్య = ఇతరవస్తువుయొక్క; శఙ్కాయాం=భ్రాంతియందు; భ్రాన్తివారణే (సతి)=భ్రాంతి వారింపబడుచుండగా; భ్రాన్తాపహ్నుతిః = భ్రాంతాపహ్నుతి యన్న యలంకారము; (స్యాత్ = అగును)॥ స + ఉత్కమ్పమ్=మిక్కిలి వణకుతో; తాపం కరోతి=తాపమును కలుగజేయును; కిం జ్వరః=జ్వరమా: న సఖి=కాదు మిత్రమా; స్మరః=మరుఁడు.

వ్యాఖ్య : ఇతరవస్తువన్న శంక కలిగినప్పుడు, ఆ శంకను తొలగించి నిశ్చయజ్ఞానమును కలిగించినయెడల భ్రాంతాపహ్నుతి యన్న యలంకార మగును. ఇది లక్షణము. రెండు వస్తువులకున్న ధర్మసాదృశ్యముచేత ఒక వస్తువును మరొకవస్తువుగా భ్రమించుట జరుగవచ్చును. అప్పుడు వేత్తయైన వాడు భ్రాంతిని తొలగించి నిశ్చయజ్ఞానమును కలుగజేయును. మొదటనున్న భ్రాంతిని అపహ్నవముచేయుట (మరుగుపుచ్చుట) యిందు జరుగుచున్నది. కావున దీనికి భ్రాంతాపహ్నుతి యనుపేరు సార్థక మగుచున్నది.

[సంస్కృతమునందు జ్వరః స్మరః అన్నమాటలు రెండును పుంలింగ ములు. తెలుగున నొక్కటి అమహద్వాచకమై, రెండవది మహద్వాచక మగును. కావున ప్రత్యయములు భేదించును. ఒకదానితో అన్వయించు నపుడు క్రియ యొకరూపమున, మరొకదానితో అన్వయించునపుడు మరొక రూపమున నుండును. కావున అన్వయసౌలభ్యము నపేక్షించి స్మరశబ్దమునకు తాత్పర్యార్థమును గ్రహించుట తగియుండును. ఇచ్చట అట్లే గ్రహింపబడు చున్నది.]

సోత్కంపముగ తాపము కలిగించుచున్నది; జ్వరమా? కాదు విరహమా— ఇది లక్ష్యము. ఇద్దరు మిత్రుల నడుమ జరిగిన సంభాషణ మిది. మొదటివాడు తనకున్న శరీరతాపమును వెల్లడించెను. రెండవవాడు తాప కారణము నెరుగడు. తాపము జ్వరమువలనగాని, విరహమువలనగాని కలుగ వచ్చును. ధర్మసాదృశ్యముగల రెండింటిలో నొకదానిని గ్రహించి యాతడు "జ్వరమా?" యని ప్రశ్నించెను. ఇది యథార్థము కాదు. ఆతనికి యథార్థ జ్ఞానము లేదు. అనగా భ్రాంతినొంది ఒక దానికి బదులుగా నొకదానిని గ్రహించెను. కావున మొదటివాడు 'జ్వరముకాదు' అని నిషేధించి, "విరహము" అన్న యథార్థజ్ఞానమును గలిగించెను. భ్రాంతివారణమునకై అన్యవస్తునిషేధము జరుగుచున్నది. కావున నిది భ్రాంతాపహ్నుతికి లక్ష్య మగుచున్నది'

ఆంధ్రచంద్రాలోకము :

గీ. భ్రాంతి వారింపఁబడెనేనిఁ బరునిశంకఁ
దేజరిల్లు భ్రాంతాపహ్నుతి యనఁ గృతులఁ;
దాపపటిచెడి మిత్ర! సోత్కంపముగను
జ్వరమ? యది కాదు మరుఁ డన్న చందమునను.

విమర్శ : మూలమునందలి 'అన్యస్య శఙ్కాయామ్' అనుదానికి "అన్య జనస్య శఙ్కాయామ్" అన్న యర్థమును గ్రహించి "పరునిశంక" నని యను వాదము చేయుట జరిగినది. కొందరు వ్యాఖ్యాతలుకూడ ఇట్లే గ్రహించిరి. కాని 'అన్యస్య' యని యన్నప్పుడు 'అన్యవస్తునః' అని చెప్పుకొనుట రుచిర ముగా నుండును. ఇచ్చట 'అన్యవస్తువు' అని యనగా వక్తృవివక్షితవస్తువు కంటె భిన్న వస్తువని యర్థము. అన్యవస్తువన్న భ్రాంతి కలుగుచుండగా, దానిని వారించి యథార్థజ్ఞానమును కలిగించుటయే యిచ్చట జరుగుచున్నది.

అయిదవభేదము :

25. చేకాపహ్నుతి రన్యస్యశఙ్కాతస్తథ్య నిహ్నవే
ప్రజల్పన్మత్పదే లగ్నః కాన్తః కిమ్? న హి నూపురః॥

టీక : అన్యస్య = అన్యవస్తువుయొక్క; శఙ్కాతః = తథ్యమిథ్యా మధ్య స్థితివలన; తథ్యనిహ్నవే (సతి) = తథ్యమును నిషేధించుట జరుగుచుండగా;

ఛేకాపహ్నుతిః = ఛేకాపహ్నుతి యను నలంకారము; (భవతి=అగును)॥ ప్రజల్పన్=వదరుచు; మత్పదే=నాపదమునందు; లగ్నః=తగిలినది; కాన్తః కిమ్=కాంతుడా; నహి=కాదు; నూపురః=కాలియందె.

వ్యాఖ్య : ఇతరవస్తువుయొక్క శంక కలుగగా, దాని నవకాశముగా తీసికొని తథ్యమును నిషేధించినయెడల ఛేకాపహ్నుతి యగును. ఇది లక్షణము. నిశ్చయజ్ఞానము కలిగినపుడు నిషేధించుట కవకాశము లేదు. సంశయమున్నప్పుడు మాత్రమే ఒకదానిని హరించి, మరొకదానిని బలపరుచుట కవకాశముండును. మిథ్యావస్తువును నిషేధించి తథ్యవస్తువును సమర్థించినయెడల భ్రాంతాపహ్నుతి యగునని పైని చెప్పికొంటిమి. దానికి సరిగా విపర్యయమిది. తథ్య మిథ్యావస్తువులకు నడుమ నిశ్చయము లేనప్పుడు తథ్యమును నిషేధించి; తన్మూలముగా మిథ్యావస్తువును సమర్థించుట యిచ్చట జరుగును. ఇట్లు చేయగల్గుట నిపుణులకు మాత్రమే సాధ్యము. ఛేకు లనగా నిపుణులని యర్థము. ఛేకాపహ్నుతి యను పేరు దీని కిందువలన సార్థకమగుచున్నది.

వాగుచు నా కాలియందు లగ్నమయ్యెను. కాంతుడా? కాదు. అందె– ఇది లక్ష్యము. ఒక నాయిక తనచెలికత్తెకు రహస్యవృత్తాంతమును విన్పించుచున్నది. ప్రజల్పన్ మత్పదేలగ్నః" అని యనుసరికి, అక్కడికి మూడవవ్యక్తి వచ్చుట తటస్థించెను. ఈవాక్యమును విని, కుతూహలము నాపుకొనలేక, వీరి ప్రసంగమునందు జోక్యము కలిగించుకొనెను. 'కాన్తః కిమ్?" అని ప్రశ్నించెను. ఈ ప్రశ్నమునుబట్టియే ఆమెకు నిశ్చయజ్ఞానము లేదన్నవిషయము తేలిపోవుచున్నది. కావుననే నిపుణురాలైన నాయిక తథ్యవిషయమును మాటుపరిచి "నహి, నూపురః' అని సమాధానమిచ్చినది. ఇట్లు నిపుణముగా తథ్యమును నిషేధించి, అతథ్యమును సమర్పించుటచేత ఇది ఛేకాపహ్నుతికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. తేజరిల్లు ఛేకాపహ్నుతి పరశంక
వలనఁగద తథ్యనిహ్నవం బలరెనేని;

రోదన యొనర్చుచుఁ దవిలె మత్పదములందు
నధిపుఁడా ? కాఁడు, నూపురం బన్నయట్టు.

ఆఱవభేదము :

26. కైతవాపహ్నుతిర్వ్యక్తౌ వ్యాజాద్యై ర్నిహ్నుతేః పదైః
నిర్యాన్తి స్మరనారాచాః కాన్తా దృక్పాతకైతవాత్॥

టీక : వ్యాజ + ఆద్యైః = వ్యాజము, ఛలము, కైతము మొదలయిన; పదైః = పదములచేత; నిహ్నుతేః = ధర్మనిషేధముయొక్క; వ్యక్తౌ = స్పష్టతయందు; కైతవాపహ్నుతిః = కైతవాపహ్నుతి యన్న యలంకారము; (భవతి = యగును)॥ కాన్తా = ప్రియురాలియొక్క; దృక్పాత = దృష్టిప్రసార మనెడి; కైతవాత్ = మిషవలన; స్మరనారాచః = మన్మథబాణములు; నిర్యాన్తి = వెలువడుచున్నవి.

వ్యాఖ్య : వ్యాజాదిపదములచేత స్పష్టముగా వర్ణ్యముయొక్క ధర్మము నిషేధింపబడినయెడల నిది కైతవాపహ్నుతి యగును. ఇది లక్షణము. అపహ్నుత్యలంకార లక్షణమునందు చెప్పికొన్నట్లే యిచ్చట సైతము అవర్ణ్యధర్మము నారోపించుటయే ప్రయోజనముగా వర్ణ్యధర్మమును నిహ్నవించుట జరుగుచున్నది. ఇచ్చట కైతవార్థక పదప్రయోగ మదనముగా నుండును. కావుననే కైతవాపహ్నుతి యనుపేరు దీనికి సార్థకమగుచున్నది.

స్త్రీల చూపులన్న మిషతో మన్మథుని తూపులు వెలువడుచున్నవి- ఇది లక్ష్యము. 'కైతవాత్' అన్నపదము ప్రయుక్తమైనది. ఈపదముచేత స్త్రీల చూపులను చూపులుకావని నిషేధించుట జరిగినది. ఈ నిషేధించుటకు ప్రయోజనమున్నది. అవి మన్మథుని తూపులు. మన్మథబాణత్వము నారోపించుటకొరకై వీక్షణత్వము నిహ్నవింపబడినది. వర్ణ్యమైన వీక్షణములకు వీక్షణ ధర్మమును నిషేధించి, అవర్ణ్యమైన బాణములయొక్క ధర్మమును ఆరోపించుట కైతవపదముచేత నిషేధము జరుగుట- అనువానిని బట్టి యిది కైతవాపహ్నుతికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

వ్యాజ ముఖపదముల నిహ్నవంబు నెగడఁ
గైతవాపహ్నుతి యఁటంద్రు కవిజనములు;

కామినీజన దృక్పాత కైతవమున
నతను శరములు వెలువడుచున్న యట్లు.

## 12. ఉత్ప్రేక్షాలఙ్కారః (తద్భేదాః)

27. సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా
ఉక్తానుక్తాస్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే.

టీక : వస్తుహేతు ఫలాత్మనా=వస్తుమత్వముచేత, హేతుమత్వముచేత ఫలవత్వముచేత; సంభావనా = ఊహించుట; ఉత్ప్రేక్షా=ఉత్ప్రేక్ష యన్న యలంకారము; స్యాత్=అగును॥ అత్ర=ఇచ్చట; ఆద్యా=మొదటిది: ఉక్త + అనుక్త + ఆస్పదా = ఉక్తవిషయయు, అనుక్తవిషయయు; (భవతి=అగును): పరే = మిగిలిన రెండును; సిద్ధ + అసిద్ధ + ఆస్పదే=సిద్ధవిషయయు, అసిద్ధ విషయయు; (భవతః = అగును.)

వ్యాఖ్య : వస్తువునుబట్టి, హేతువునుబట్టి, ఫలమునుబట్టి యూహించుట యుత్ప్రేక్షాలంకార మగును. ఇది లక్షణము. ఉపమానమునకున్న ధర్మములే యుపమేయమునం దుండుటచేత నుపమేయమున కుపమాన తాదాత్మ్యము నూహించినయెడల ఉత్ప్రేక్ష యగును.

ఈ యుత్ప్రేక్ష మూడు విధములుగా నుండును. ఒక వస్తువునకు వస్త్వంతర తాదాత్మ్యము నూహించినయెడల వస్తూత్ప్రేక్ష యగును; దీనికి స్వరూపోత్ప్రేక్ష యను నామాంతరము గలదు. హేతువుకాని దానిని హేతువుగా నూహించినయెడల హేతూత్ప్రేక్ష యగును. ఫలము కానిదానిని ఫలముగా నూహించినయెడల ఫలోత్ప్రేక్ష యగును.

ఈ మూడింటిలో మొదటిదైన వస్తూత్ప్రేక్ష ఉక్తాస్పదము ననుక్తాస్పదమునై రెండు భేదములనొందును. అనగా వస్తూత్ప్రేక్ష ఉక్తవిషయ వస్తూత్ప్రేక్ష అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష- అని రెండు విధములుగా పరిగణింపబడును. తక్కిన రెండును సిద్ధాసిద్ధ విషయభేదముచేత మరల రెండేసి విధములుగా నగును. అప్పుడు సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష, అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష, సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష, అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష- అను నాలుగుభేదము లేర్పడును. వెనుకటి రెండుభేదములు, ఈనాలుగుభేదములు కలిసి ఉత్ప్రేక్ష మొత్తముమీద ఆఱు విధములుగా నుండును.

ఇంతవరకు రచయిత ఉత్ప్రేక్షకు లక్షణమును, భేదములను తెలిపెను. లక్ష్యములను ప్రదర్శింపలేదు. ఇకముందు తాను పైనిచూపిన క్రమమున కనుక్రమముగా లక్ష్యములను ప్రదర్శించును.

ఆంధ్రచంద్రాలోకము :

క. విదితము లుత్ప్రేక్షలు పెం
పొదవెడుఁ గావ్యములయందు నుక్తానుక్తా
స్పదమును సిద్ధాసిద్ధా
స్పదము ననన్ వస్తుహేతు ఫలరూపమునన్.

విమర్శ : ఈపద్యమునందు ఉత్ప్రేక్షకు లక్షణము కానరాదు. విభాగము మాత్రమే కలదు. అదియు సక్రమముగా లేదు. ఉన్నది యున్నట్లుగా గ్రహించినచో ఉత్ప్రేక్ష ఆఱుభేదములనుగాక పన్నెండు భేదములను పొందునన్న భ్రాంతిని కలిగించుచున్నది. అచ్చట స్పష్టనిర్దేశ మవసరము. ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వస్తుహేతు ఫలముల సంభావనమునఁ
త్రివిధమై యలంకార ముత్ప్రేక్షయొప్పు;
అది దుక్త యనుక్తయౌ నాస్పదంబు
చేత మలిరెండు సిద్ధ యసిద్ధ యౌను.

మొదటిభేదము :

28. ధూమస్తోమం తమశ్శఙ్కే కోకీ విరహ శుష్మణామ్,
లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః॥

టీక : తమః = చీకటిని; కోకీ విరహ శుష్మణామ్=చక్రవాకాంగనల వియోగాగ్నులయొక్క; ధూమస్తోమమ్=పొగలసమూహముగా; (అహమ్ = నేను); శఙ్కే=తలచుచున్నాను॥ తమః = చీకటి; అఙ్గాని=అవయవములకు; లిమ్పతి + ఇవ=పూత పూయుచున్నట్లు; (భవతి = ఉన్నది); నభః=ఆకాశము; అఞ్జనమ్ = కాటుకను; వర్షతి + ఇవ=వర్షించుచున్నట్లు; (భవతి = ఉన్నది.)

వ్యాఖ్య : ఇందు వస్తూత్ప్రేక్షకు లక్ష్యములు చూపబడినవి. పూర్వా

ర్థము ఉక్తవిషయ వస్తూత్ప్రేక్షకు లక్ష్యము; ద్వితీయార్థమునందు అనుక్త విషయ వస్తూత్ప్రేక్షకు రెండు లక్ష్యములు చూపబడినవి.

చీకటిని చక్రవాకాంగనా విరహాగ్నులనుండి పుట్టిన ధూమసమూహ మని తలచుచున్నాను. ఇచ్చట చీకటి వర్ణ్యము. చీకటికి నైల్యము, దృష్టి ప్రతిరోధకత్వము మున్నగు ధర్మములు గలవు. ఈధర్మములు ధూమస్తోమమున కును గలవు. కావున ధర్మసామ్యమునుబట్టి వర్ణ్యమైన చీకటికి అవర్ణ్యమైన ధూమస్తోమముతో తాదాత్మ్య మూహింపబడినది. కావున నిది వస్తూత్ప్రేక్ష. ఇందు వర్ణ్యమైన 'చీకటి' కూడ చెప్పబడినది. విషయము చీకటి; విషయి ధూమస్తోమము. విషయము స్పష్టముగా చెప్పబడియుండుటచేత, యిది ఉక్త విషయ వస్తూత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది.

చీకటి అవయవములకు పూతపూయుచున్నట్లున్నది– ఇచ్చట వాక్య సమాప్తికొరకు 'ఉన్నది' అన్న క్రియను మనము కలుపుకొంటిమి. ఇచ్చట కర్త చీకటి. ఇది పూతపూయుచున్నట్లున్నది– ఇచ్చట విషయి చెప్పబడినది. విషయము ప్రసక్తము కాలేదు. నిజమునకు చీకటి వ్యాపించుట అంగములకు పూతపూయుచున్నట్లున్నది– అని యన్నచో విషయమును విషయియు స్పష్టపడెడివి. అట్లు కాలేదు. 'వ్యాపించుట' అన్న విషయము (వర్ణ్యము) అనుక్తమైనది. కావున, ఇది అనుక్తవిషయవస్తూత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది.

ఆకాశము కాటుకను వర్షించుచున్నట్లున్నది– ఇచ్చట కూడ 'ఉన్నది' అన్న క్రియాపదమును వాక్యసమాప్తికొరకు మనము కలుపుకొంటిమి. ఇచ్చట కర్త ఆకాశము. ఇది వర్షించుచున్నట్లున్నది. దేనిని ? కాటుకను. కావున, ఇచ్చటి కిది సమగ్రవాక్యము. 'వర్షతీవ' అన్నది విషయి, దీనికి విషయము కాదగినది ప్రసక్తము కాలేదు. చీకటి వ్యాపించుట యన్నదియే విషయము. ఆకాశమునుండి భూమివరకు చీకటి వ్యాపించుట ఆకాశము కాటుకను వర్షించుటవలె నున్నది యని తాత్పర్యము. ఇట్లు విషయము ప్రసక్తము కానందువలన, ఇది అనుక్తవిషయ వస్తూత్ప్రేక్షకు లక్ష్యమగు చున్నది.

ఇచ్చట అనుక్తవిషయకు రెండు లక్ష్యములు చూపబడినవన్న సంగతిని గుర్తించితిమి. ఒకే యలంకారభేదమునకు తక్కినచోట్ల ఒక లక్ష్యమునే

చూపుచుండుటవలన, గ్రంథకర్త యిచ్చట ఏదో ప్రయోజనము నపేక్షించియే రెండింటిని చూపించుట జరిగెనని యొక రూహించిరి. మొదటిది పదార్థో త్ప్రేక్షకును, రెండవది వాక్యార్థోత్ప్రేక్షకును లక్ష్యములుగా ప్రదర్శింప బడినవని వారి నిర్ణయము. శ్లోకపూరణము కొరకు రెండవలక్ష్యమును జోడించెనని యింకొకరి నిశ్చయము. గ్రంథకర్త పదార్థ, వాక్యార్థభేదమును పరిగణించినట్లు కానరాదు. కాబట్టి లక్ష్యములను భిన్నదృష్టితో ఎన్నవలసిన యావశ్యకము కానరాదు.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. చక్రవాకీ వియోగాగ్ని జనితధూమ
సమితియని శంకచేసెదఁ దిమిరపటలి;
తమము కురిసెడిబలె నుండె ఖము గనియెడు
నంగములయందు నదిబలె నంజనంబు.

విమర్శ : ఇందు పూర్వార్ధము ఉక్తవిషయ వస్తూత్ప్రేక్షకు లక్ష్యము. ఇది సక్రమముగా నున్నది. ఉత్తరార్ధమున అనుక్తవిషయ వస్తూత్ప్రేక్షకు రెండు లక్ష్యము లుండవలయును. ఏదియు సక్రమముగా లేదు. అన్వయ మును కుదిరించుట కష్టముగా నున్నది. కావున అనుక్తవిషయ వస్తూత్ప్రే క్షకు ఈక్రింది రెండు పంక్తులను రెండు లక్ష్యములుగా గ్రహింపవచ్చును.

అంధకారము తనువెల్ల నలదునట్లు;
అంజనంబును వర్షించునట్లు నభము.

ఇచ్చట నింకొకవిషయమును చెప్పుకొనవలయును.

అట్లు, బలె- అన్న యుపమావాచకము లిచ్చట పొడకట్టుచున్నవి. సంస్కృతమూలమునందు సైతము 'ఇవ' అని కలదు. వీనిని బట్టి యిచ్చటిది యుపమాలంకార మని నిర్ణయింపవలె నని యనిపించును. కాని, అట్లు కాదు. ఉపమాలంకార మందున్నట్లే ఉత్ప్రేక్షయందు నుపమావాచక ముండుట కభ్యంతరము లేదు. ఉపమాలంకారమునందు వర్ణ్యావర్ణ్యముల కున్న సాధారణ ధర్మము సహజమై లోకప్రసిద్ధమై యుండును. ఉత్ప్రేక్షయందు కవి కల్పితమై యుండును. ఈ భేదమును గమనించుట ముఖ్యము.

రెండవభేదము :

29. రక్తౌ తవాఙ్ఘ్రీ మృదులౌ భువి విక్షేపణాద్ధ్రువమ్,
త్వన్ముఖాభేచ్ఛయా నూనం పద్మైర్వైరాయతే శశీ॥

టీక : మృదులౌ=సుకుమారములైన; తవ + అఙ్ఘ్రీ=నీయొక్క రెండు పాదములు; భువి=నేలమీద; విక్షేపణాత్ = మోపుటవలన; రక్తౌ=ఎఱ్ఱనివి; (భవతః=అయినవి); ధ్రువమ్=నిశ్చయము॥ శశీ=చంద్రుడు; త్వత్ + ముఖ + ఆభా + ఇచ్ఛయా=నీయొక్క ముఖకాంతియందలి కోరికచేత; పద్మైః(సహ) =పద్మములతో; వైరాయతే=పోరాడుచున్నాడు. నూనమ్=నిశ్చయము.

వ్యాఖ్య : ఇందు హేతూత్ప్రేక్షకు లక్ష్యములు చూపబడినవి. పూర్వార్ధము సిద్ధవిషయహేతూత్ప్రేక్షకు లక్ష్యము. ఉత్తరార్ధము అసిద్ధవిషయ హేతూత్ప్రేక్షకు లక్ష్యము.

సుకుమారములైన నీపాదములు నేలమీద మోపుటచేత నెఱ్ఱబడినవి; ఇది నిశ్చయము- ఇది ప్రియుడు ప్రేయసితో ననుచున్న ప్రశంసావాక్యము. ఇచ్చట పాదము లెఱ్ఱగా నగుటకు నేలమీద మోపుట హేతువుగా చెప్ప బడినది. ఇది హేతువు కాదు. సహజముగానే ఆమె పాదము లెఱ్ఱనివి. హేతువుకాని దానిని హేతువుగా నూహించుట యనులక్షణమునుబట్టి యిది హేతూత్ప్రేక్షకు లక్ష్య మగుచున్నది. ఎంత సుకుమారములైన పాదములైనను నేలమీదమోపుట తప్పదు. కావున నేలమీద మోపుట యన్నది సిద్ధ విషయమే. కావుననే యిది సిద్ధవిషయ హేతూత్ప్రేక్షకు లక్ష్యము.

నీముఖకాంతియందలి కోరికచేత చంద్రుడు పద్మములతో పోరాడు చున్నాడు- ఇదికూడ ప్రియుడు ప్రేయసితో ననుచున్న ప్రశంసావాక్యమే. ఇచ్చట చంద్రుడు పద్మములతో పోరాడుటకు ముఖకాంతియందలి కోరిక కారణముగా చెప్పబడినది. ఇది కారణము కాదు. చంద్రుని కాలము రాత్రి; రాత్రి యగుసరికి పద్మములు ముకుళించుకొనిపోవును. సూర్యునికాలము పగలు; పగ లగుసరికి పద్మములు వికసించును. కావున సహజముగానే చంద్రపద్మములకు విరోధమున్నది. కారణము కానిదానిని కారణముగా నూహించుట యను లక్షణమును బట్టి యిది హేతూత్ప్రేక్ష యగును. నిజము నకు చంద్రునకు 'ముఖకాంతి యందలికోరిక' యున్నదనుటకూడ ఉప

పన్నముకాదు. చంద్రుడచేతన పదార్థము. కావున, చంద్రుని కీ కోరిక యున్నదనుట కవికల్పితము. అనగా అసిద్ధవిషయమని యర్థము. అందుచేతనే, యిది అసిద్ధవిషయహేతూత్ప్రేక్షకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము :

గీ. అవని మోచుటవలన సూ యరుణములు భ
వన్మృదు పదాంబుజములు ధ్రువంబనంగఁ;
ద్వన్మఖాభేచ్ఛచేతఁ బద్మములతోడఁ
బగ యొనర్చెడి యామినీభర్త యనఁగ.

విమర్శ : పూర్వార్థము సిద్ధ విషయహేతూత్ప్రేక్షకు, ఉత్తరార్థము అసిద్ధవిషయహేతూత్ప్రేక్షకు లక్ష్యములు.

మూలమునందు ధ్రువమ్, నూనమ్- అను పదము లుపయుక్తములైనవి. ఇవి రెండును నిశ్చయార్థకములే. అహేతువును హేతువుగా నూహించి నిరూపించు యత్నమే యిచ్చట నున్నది. కావున దానికి బలము చేకూరుటకై నిజముగా, నిశ్చయముగా- మొదలయిన మాటలను వాడుట జరుగును. వీనిని బట్టియే యిచ్చట లోకప్రసిద్ధకంటె కవియూహకే ప్రాబల్యము కలదని తెలుచున్నది. ఇట్లే తలంతును, భావింతును- మొదలయిన మాటలుకూడ ఉత్ప్రేక్షకు సార్థకత్వమును కలిగించును.

మూడవ భేదము

30. మధ్యః కిం కుచయోర్ధృత్యై బద్ధః కనకదామభిః,
ప్రాయోఽబ్జం త్వత్పదేనైక్యం ప్రాప్తుం తోయే తపస్యతి॥

టీక : మధ్యః = నడుము; కుచయోః = స్తనములయొక్క; ధృత్యై = ధారణముకొరకై; కనకదామభిః=బంగారుగొలుసులచేత; బద్ధః + కిమ్ = బంధింపబడినదా ?॥ అబ్జమ్=పద్మము; త్వత్ + పదేన=నీయొక్కపాదముతో; ఐక్యమ్=సాయుజ్యమును; ప్రాప్తుమ్ = పొందుటకొరకై; ప్రాయః=బహుశః; తోయే=నీటియందు: తపస్యతి = తపస్సు చేయుచున్నది.

వ్యాఖ్య : ఇందు ఫలోత్ప్రేక్షకు లక్ష్యములు చూపబడినవి. పూర్వార్థము సిద్ధవిషయ ఫలోత్ప్రేక్షకు లక్ష్యము. ఉత్తరార్థము అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్షకు లక్ష్యము.

కుచములను మోయుటకై నీనడుము బంగారుగొలుసులతో బంధింప బడినదా యేమి? ఇదియొక ప్రియుడు ప్రశంసాపూర్వకముగా సౌందర్యవర్ణనము చేయుచు ప్రియురాలితో నన్న వచనము. ఇచ్చట బంగారుగొలుసులతో బంధింపబడుటకు కుచధారణము ఫలముగా చెప్పబడినది. కనకదామబంధనము లేకపోయినప్పటికిని నడుము సహజముగానే కుచధారణము చేయును. కనుక, కనకధామబంధనమునకు ఫలము కుచధారణము కాదు. ఫలము కానిదానిని ఫలముగా నూహించుట యన్న లక్షణమునుబట్టి, యిది ఫలోత్ప్రేక్ష యగును. నడుము స్తనములను ధరించుటయన్నది ప్రసిద్ధవిషయమే. కావుననే, యిది సిద్ధవిషయఫలోత్ప్రేక్షకు లక్ష్యముగా ప్రదర్శింపబడినది.

కొందరు 'కనకదామభిః' అని యన్నప్పుడు ప్రకృతమైన వళిత్రయమును నిగరణముచేసి అప్రకృతమును మాత్రమే చెప్పినట్లు తలచిరి. వళులన్న బంగారుగొలుసులచేత నడుము బంధింపబడినదని వారి తాత్పర్యము. అప్పుడచ్చట రూపకాతిశయోక్తి యన్న యలంకార మున్నట్లు చెప్పవలయును. అయినను ప్రాధాన్యవివక్షచేత, మొత్తము వాక్యమునందు విస్తరించియున్న ఫలోత్ప్రేక్షను చెప్పుటయే సమంజసము.

పద్మము బహుశః నీపదసమైక్యము పొందుటకై నీటియందు తపస్సు చేయుచున్నది- పద్మము నీటియందుండుట సహజలక్షణము. దానికి వేరు ప్రయోజనము లేదు. ఇచ్చట పదసమైక్యము పొందుట యన్నది ఫలముగా నూహింపబడినది. పద్మము పాదముతో ఏకత్వమునొందుట యన్నది యెన్నడును జరుగదు. ఇట్లు ఫలముకానిదానిని ఫలముగా నూహించుటచేత, ఇది అసిద్ధవిషయఫలోత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది.

ఇచ్చట నింకొకవిషయమును గమనింపవలయును. 'తపస్యతి' అని యన్నప్పుడు 'తపఃకర్మ' ప్రాణులకు, వివేకులకు మాత్రమే సాధ్యము. అది పద్మమునకు సాధ్యము కాదు. కావున 'నీటనుండుట' యన్నవిషయమును మాటుచేసి 'తపస్సుచేయుట' యన్న విషయిని వెల్లడించుట జరిగినదని యనవలయును. అప్పుడిదికూడ వెనుక చెప్పికొన్నట్లు రూపకాతిశయోక్తి యగును. అయినను తావన్మాత్రమును గాక వాక్యమునంతను గ్రహించినప్పుడు ఫలోత్ప్రేక్షయని నిర్ణయించుటయే సమంజసము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కట్టఁ బడెనేమొ మధ్యంబు కనకదామ
ములను వక్షోజ ధారణంబునకు ననఁగఁ;
ద్వత్పదైక్యము గనఁగఁ బద్మములు నీటఁ
దపము చేసెడి ననెడి చందమున శర్వ!

విమర్శ: పూర్వార్ధము సిద్ధవిషయఫలోత్ప్రేక్షకు లక్ష్యము; ఉత్తరార్ధము అసిద్ధవిషయఫలోత్ప్రేక్షకు లక్ష్యము. ఈపిమ్మట సూరకవి గమ్యోత్ప్రేక్షలక్షణము తెలిపెను. మూలమునలేకున్నను వ్యాఖ్యానముల సాహాయ్యమున దీనిని చెప్పియుండును. ఫలోత్ప్రేక్ష కిచ్చిన లక్ష్యములు రెండును గమ్యోత్ప్రేక్షకు లక్ష్యములే.

క. వలె ననుపదంబు మొదలుగఁ
దలఁతు ధ్రువము శంకఁ జేసెదను నిశ్చయమున్
పలుకులతోఁ బాసిన వ
ర్తిలు గమ్యోత్ప్రేక్ష యనఁగఁ గృతుల మహేశా!

## 13. అతిశయోక్త్యలఙ్కారః (తద్భేదాః)

31. రూపకాతిశయోక్తిః స్యా న్నిగీర్యాధ్యవసానతః
పశ్య నీలోత్పల ద్వంద్వా న్నిస్సరన్తి శితాశ్శరాః॥

టీక: అధ్యవసానతః=అభేదరూపమైన యారోపణముతో; నిగీర్య=దాపరికము చేసి; (వర్ణితంచేత్=వర్ణింపబడినయెడల); రూపకాతిశయోక్తిః=రూపకాతిశయోక్తి యను నలంకారము; స్యాత్=అగును॥ నీలోత్పల ద్వంద్వాత్=నల్లకలువలజంటనుండి; శితాః=వాడియైన; శరాః=బాణములు; నిస్సరన్తి=వెలువడుచున్నవి; పశ్య=చూడుము.

వ్యాఖ్య: అతిశయోక్త్యలంకార మెనిమిది విధములుగా నుండును. రూపకాతిశయోక్తి, సాపహ్నవాతిశయోక్తి, భేదకాతిశయోక్తి, సంబంధాతిశయోక్తి, అసంబంధాతిశయోక్తి, అక్రమాతిశయోక్తి, చపలాతిశయోక్తి, అత్యంతాతిశయోక్తి- అన్నవి ఆవిధములు. వీనియన్నింటియందును సహజత్వముకంటె అతిశయించిన వర్ణనమే కనుపట్టును. ఈ యతిశయవర్ణనము చేతనే

అతిశయోక్తి యను పేరు ఈ యలంకారమునకు సార్థకమగుచున్నది. అందు మొదటిదైన రూపకాతిశయోక్తి యిచ్చట నిరూపితమైనది.

అవర్ణ్యముయొక్క ధర్మము నారోపణముచేయుటచేత వర్ణ్యమును మాటుపుచ్చినయెడల రూపకాతిశయోక్తి యను నలంకారమగును- ఇది లక్షణము. రూపకాలంకారమునందుసైతము అవర్ణ్యధర్మమును వర్ణ్యమునం దారోపించుట జరుగును. కాని, అచ్చట వర్ణ్యముకూడ పేర్కొనబడును. అతిశయోక్తియందును వర్ణ్యమును పేర్కొనుట జరుగదు. రూపకముయొక్క లక్షణమునే కలిగియు, వర్ణ్యమును నిగరణము చేయుట యన్న యదనపు లక్షణముచేత, ఇది రూపకాతిశయోక్తి యగుచున్నది.

నల్లకలువల జంటనుండి వాడియైన బాణములు వెలువడుచున్నవి చూడు- ఇది లక్ష్యము. నిజమునకు కలువలనుండి బాణములు వెలువడుట యన్నది అసంభావ్యము. ఇచ్చట కలువలు, బాణములు అన్నవి వేనికో యుప మానములుగా వ్యవహరించియున్నవి. ఒక యువతి కన్నుల జంటనుండి చూపులు వెలువడుచున్నవి. ఇది వక్తవ్యము, ఇచ్చటి కన్నులజంట అను వర్ణ్యమునకు నల్లకలువలజంట యుపమానము; చూపులు అను వర్ణ్యమునకు వాడియైనబాణము లుపమానము. లక్ష్యమునందు ఉపమానములుమాత్రమే పేర్కొనబడినవి. ఉపమేయములు పూర్తిగా నిగీర్ణములైనవి. ఉపమేయములపై నుపమానధర్మముల నారోపణముచేయుట యధ్యవసానము. ఇట్లు అధ్యవ సానముచేత వర్ణ్యములను మాటుపుచ్చుట యను లక్షణమునుబట్టి, యిది రూపకాతిశయోక్తికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. రూపకాతిశయోక్తి పేర్చునుపమాన
మాత్రము వచించి వర్ణ్యంబు మాటిరేని;
నల్లదోవకవ క్రొవ్వాడి నారసములు
వెలువడె ననంగ లక్ష్యమౌ నలిననేత్ర!

రెండవ భేదము

32. యద్యపహ్నుతి గర్భత్వం సైవ సాపహ్నవా మతా,
త్వత్సూక్తిషు సుధా రాజన్! భ్రాన్తాః పశ్యన్తి తాం విధా॥

టీక : అపహ్నుతి గర్భత్వమ్ = అపహ్నుతితో కూడియుండుట; యది (వర్ణితమ్)=వర్ణింపబడినయెడల; సా + ఏవ = అరూపకాతిశయోక్తియే; సాపహ్నవా = సాపహ్నవాతిశయోక్తి యని; (విదుషామ్ = పండితులకు); మతా=సమ్మతము॥ రాజన్=ఓరాజా; త్వత్ + సూక్తిషు=నీయొక్క సూక్తుల యందు; సుధా=అమృతము; (వర్తతే = ఉన్నది); భ్రాన్తాః=అజ్ఞానులు; తామ్=దానిని; విధౌ=చంద్రునియందు: పశ్యన్తి=వెదకుచున్నారు.

వ్యాఖ్య : అపహ్నుతితోకూడియున్న రూపకాతిశయోక్తి సాపహ్నవాతిశయోక్తి యగును- ఇది లక్షణము. అపహ్నుతియందు అన్యధర్మము నారోపించుటకుగాను, వర్ణ్యముయొక్క ధర్మము నిషేధింపబడును. రూపకాతిశయోక్తియందు అన్యధర్మారోపణముచేత వర్ణ్యమును మాటుపుచ్చుట జరుగును. ఈరెండులక్షణములును కలిసియున్నయెడల సాపహ్నవాతిశయోక్తి యగును.

ఓరాజా! నీ సూక్తులయందు సుధ యున్నది. అవివేకులు దానిని చంద్రునియందు అన్వేషించుచున్నారు. ఇది లక్ష్యము. ఒక చాటుకారుడు రాజును ప్రశంసించుచు వచించిన వాక్యమిది. నిజమునకు చంద్రుడు సుధాంశుడు. అమృతకిరణములను గలిగియుండుట చంద్రుని ధర్మము. చంద్రుని యందమృతము నన్వేషించువారి నవివేకులుగా పరిగణించుటచేత, చంద్రుని యందలి సుధాంశుత్వమును నిషేధించుట జరుగుచున్నది. ఇంతవరకు నిది యపహ్నుతి. నీ సూక్తులయందు సుధయున్నది యనుట యథార్థము కాదు. సుధకు జన్మస్థానము చంద్రమండలము కావచ్చును; పాలసముద్రము కావచ్చును. వాక్కులు సుధకు జన్మస్థానముకావు. కావున సుధ యుపమానము మాత్రమే. మాధుర్యమన్నది యుపమేయము. ఉపమానధర్మము నుపమేయమునం దారోపించి, ఉపమేయమును నిగరణము చేయుటచేత ఇదియతిశయోక్తి. ఇట్లు అపహ్నవము తోడి యతిశయోక్తి యగుటచేత, ఇది సాపహ్నవాతిశయోక్తికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అగు నపహ్నుతి గర్భత్వ మయ్యెనేని
నదియ సాపహ్నవాఖ్యయా నతిశయోక్తి;

యుష్మదుక్తుల సుధ వెల్గుచుండ దాని
భ్రాంతు లీక్షించెదరు నిశాభర్త యందు.

విమర్శ : లక్ష్యమునందు 'యుష్మదుక్తుల సుధ వెల్గుచుండ' అని యనుటవలన సుధకు వెల్గుట యను ధర్మము నారోపించుట జరుగుచున్నది. అది యనావశ్యకమేకాక, భ్రాంతికారకముకూడ కావచ్చును. కాబట్టి 'యుష్మదీయసూక్తుల సుధయుండ' నని యనుకొనుట సమంజసముగా నుండును.

మూడవ భేదము

33. భేదకాతిశయోక్తి స్స్యాత్తస్యైవాన్యత్వ వర్ణనమ్,
అన్యదేవాస్య గామ్భీర్య మన్యద్ధైర్యం మహీపతేః॥

టీక : తస్య+ఏవ = లోకసామాన్యమగుదానికే; అన్యత్వవర్ణనమ్= లోకభిన్నత్వమును వర్ణించుట; భేదకాతిశయోక్తిః=భేదకాతిశయోక్తి యను నలంకారము; స్యాత్ = అగును॥ అస్య మహీపతేః = ఈరాజుయొక్క; గామ్భీర్యమ్+ఏవ=గంభీరత్వమే; అన్యత్=ఇతరమైనది; ధైర్యమ్=ధీరత్వము; అన్యత్ = ఇతరమైనది.

వ్యాఖ్య : లోకసామాన్యమగు విషయమునకే అన్యత్వకల్పనముచేసిన యెడల భేదకాతిశయోక్తి యగును. ఇది లక్షణము. ఈకల్పనమువలన లోకాతిశాయిత్వము సమర్పితమగుచున్నది. లోకసామాన్యమగు నొకవిషయమునకు విశిష్టత్వమును చేకూర్చుటకై అన్యత్వకల్పనముచేయుట జరుగుచున్నది. దాని వలన, ఆవస్తువు తనజాతివస్తువులకలెు భేదమును కలిగియున్నట్లు అతిశయింపబడుచున్నది. కావుననే యిది భేదకాతిశయోక్తియనుపేర సార్థకమగుచున్నది.

ఈరాజు గాంభీర్యమే వేఱు, ధైర్యమే వేఱు- అన్నది లక్ష్యము. గాంభీర్యము ఒకచోట నొకలక్షణమును మరొకచోట మరొకలక్షణమును గలిగియుండదు. అది యన్నియెడల ఒకేవిధమగు లక్షణమును గలిగియుండును. అది యందువలననే గాంభీర్యమగును. అట్లే ధీరునియొక్క లక్షణమే ధీరత్వము. అది ధీరులందు ఒక్కమాదిరిగానే యుండును. లోకసామాన్యమగు గాంభీ

ర్యమే రాజునకున్నదన్నచో విశేషములేదు. కావుననే దీనికి భిన్నత్వము నాపాదించుట జరుగుచున్నది. లోకసామాన్యమగు ధైర్యగాంభీర్యములకును, రాజవిశిష్టమగు ధైర్యగాంభీర్యములకును భేదము నాపాదించి, అతిశయమును సాధించుటచేత ఇది భేదకాతిశయోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అన్యథాఖ్యప్తి యద్దాని కయ్యె నేని
భేదకాతిశయోక్తినాఁ బెంపుమీఱు;
వింత యీతని గాంభీర్యవిలసనములు
వింత యీతని ధీరతా విభవ మనఁగ.

నాలుగవ భేదము

34. సంబన్ధాతిశయోక్తి స్స్యా దయోగే యోగ కల్పనమ్,
సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశన్తి విధుమణ్డలమ్॥

టీక : అయోగే = సంబంధము లేనిచోట; యోగకల్పనమ్=సంబంధమును గల్పించుట; సంబన్ధాతిశయోక్తిః=సంబంధాతిశయోక్తి యన్నయలంకారము; స్యాత్=అగును॥ అస్యపురస్య = ఈ నగరము యొక్క; సౌధ + అగ్రాణి=భవనముల శిఖరములు; విధుమణ్డలమ్=చంద్రబింబమును; స్పృశన్తి= తాకుచున్నవి.

వ్యాఖ్య : సంబంధము లేనిచోట సంబంధమున్నట్లు కల్పించినయెడల సంబంధాతిశయోక్తి యగును. ఇది లక్షణము. ఇట్లు సంబంధమును కల్పించుట చేత వర్ణ్యమున కాధిక్యమాపాదింపబడుచున్నది. సంబంధకల్పనముచేత అతిశయము సాధింపబడుట యిందు జరుగుచున్నది. కావుననే దీనికి సంబంధాతిశయోక్తి యను పేరు సార్థకమై యున్నది.

ఈనగరమునందలి భవనాగ్రములు చంద్రమండలమును స్పృశించుచున్నవి– ఇది లక్ష్యము. ఇచ్చట భవనముల యౌన్నత్యమును వర్ణించుట యుద్దిష్టము. భవనము లెంతయున్నతములై యున్నప్పటికిని, చంద్రబింబమును స్పృశించుట జరుగదు. చంద్రబింబము మిక్కిలి యున్నతముగా నున్నదనుట నిశ్చితము. అంత యున్నతముగానున్న చంద్రబింబమును సౌధాగ్రములు స్పృశించుచున్నవనుటచేత భవనముల యౌన్నత్యము గమ్యమానమగు

చున్నది. నిజమునకు ఇచ్చట సంబంధములేదు. లేనిచోట సంబంధమున్నట్లు చెప్పి వర్ణ్యమున కతిశయమును సంపాదించుటచేతనే, యిది సంబంధాతిశయోక్తికి లక్ష్యముగా సరిపోవుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. ఇం బడరు కావ్యముల యో
గం బొడవక యుండ యోగకల్పన మైనన్
సంబంధాతిశయోక్తి; పు
రిం బలుసౌధములు విధుని స్పృశియించెడినాన్.

అయిదవ భేదము

35. యోగేఽప్యయోగోఽసంబన్ధాతిశయోక్తి రితీష్యతే,
త్వయి దాతరి రాజేన్ద్ర! స్వర్ద్రుమా న్నాద్రియామహే॥

టీక: యోగే (సతి)= సంబంధముండగా; అయోగః= సంబంధము లేకుండుట; (వర్ణితంచేత్=వర్ణింపబడినయెడల); అసంబన్ధాతిశయోక్తిః + ఇతి =అసంబంధాతిశయోక్త్యలంకారమని; (సూరిభిః = పండితులచేత); ఇష్యతే= వాంఛింపబడుచున్నది॥ రాజేన్ద్ర=ఓ మహారాజా; త్వయి దాతరి=నీవు దాతవైయుండగా; (వయం=మేము); స్వర్ద్రుమాన్= కల్పవృక్షములను; న + ఆద్రియామహే=ఆదరింపము.

వ్యాఖ్య: సంబంధమున్నప్పుడు సంబంధము లేదని వర్ణించినయెడల అసంబంధాతిశయోక్తి యగును. ఇది లక్షణము. ఇచ్చట, ఉన్న సంబంధమును లేదని చెప్పుటచేత వర్ణ్యమున కాధిక్యము సంపాదింపబడుచున్నది. అసంబంధము నాపాదించుటచేత అతిశయము కలుగుటనుబట్టి దీనికి అసంబంధాతిశయోక్తి యనుపేరు సరిపడుచున్నది.

ఓరాజా! నీవు దాతవైయుండగా మేము కల్పవృక్షముల నాదరింపము. ఇది లక్ష్యము. కొందరు యాచకులు రాజుయొక్క దానగుణమును మెచ్చుకొనుచు రాజుతో పల్కిన పల్కులివి. ఇచ్చట వర్ణ్యము దాతృత్వము. కల్పవృక్షములు యాచకుల సర్వవాంఛలను దీర్చుటయందు సుప్రసిద్ధములు. కావున యాచకులకు కల్పవృక్షములతో విడనిసంబంధముండుట వాస్తవము.

కావుననే యాచకులు కల్పవృక్షములను నిర్లక్ష్యము చేయలేరు. ఇచ్చట నిర్లక్ష్యము చేయుచున్నట్లు చెప్పుటచేత, ఉన్నసంబంధమును లేదని చెప్పుట జరుగుచున్నది. ఇట్లు చెప్పుటచేత రాజు దాతృత్వము కల్పవృక్షముల దాతృత్వమును మించియున్న భావము గమ్యమానమగుచున్నది. ఇట్లు అసంబంధమును వర్ణించి, వర్ణ్యమున కతిశయమును సంపాదించుటచేత, ఇది అసంబంధాతిశయోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. యోగ మొదవుచు నుండి సుయోగ మొదవ
కున్న మును చెప్పునదియయ్యె యొప్పుఁ గృతుల;
దాత వీవగుచుండఁగ ధరణినాథ!
యాదరింపము దివిజద్రుమాళి నాగ.

విమర్శ : ఈలక్షణము సక్రమముగా లేదు. 'సుయోగము' అని యనుటవలన 'చక్కని సంబంధము' అన్నయర్థము కలుగును. ఏదో యొకపాటి సంబంధ ముండుటకు అవకాశము కలుగుచున్నది. నిజమున కిక్కడ అసంబంధమే ఉక్తము కావలయును. అది పైపద్యమునందు స్పష్టముగా లేదు. ఇంకొక్కవిషయము. 'మును చెప్పునదియయ్యె యొప్పుఁ గృతుల'నని చెప్పుటచేత, ఇదికూడ సంబంధాతిశయోక్తి యని నిర్దేశించినట్లగుచున్నది. పూర్వపద్యమున సంబంధాతిశయోక్తి యని స్పష్టముగా నున్నది. ఇదికూడ నదియే కావలసివచ్చును. పూర్వపద్యమున 'నతిశయోక్తి' యని మాత్రమే యున్న యెడల, అది యొకభేదమనియు నిదియొకభేదమనియు సమన్వయము సాధించుకొనవచ్చును. ఇప్పు డది కుదురదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఉండి యోగంబు లేనియ ట్లుక్తమైన
నమరునట యసంబంధంపు టతిశయోక్తి;
నీవు దాతవైయుండఁగా నృపతివర్య!
ఆదరింపము మేము దివ్యద్రుమాళి.

ఆఱవ భేదము

36. అక్రమాతిశయోక్తిస్స్యాత్సహత్వే హేతుకార్యయోః,
ఆలిఙ్గన్తి సమం దేవ! జ్యాం శరాశ్చ పరాశ్చ తే॥

టీక : హేతుకార్యయోః=కారణకార్యములకు; సహత్వే (వర్ణితే సతి) =సహభావము వర్ణింపబడుచుండగా; అక్రమాతిశయోక్తిః = అక్రమాతిశయోక్తియన్న యలంకారము; స్యాత్ = అగును॥ దేవ=ఓప్రభూ; తే=నీ యొక్క; శరాః+చ=బాణములును; పరాః+చ=శత్రువులును; సమమ్=సమకాలమున; జ్యామ్=వింటినారిని- నేలన; ఆలిఙ్గన్తి=కౌగిలించుచున్నారు.

వ్యాఖ్య: కారణకార్యములకు సహభావము వర్ణింపబడినచో నది యక్రమాతిశయోక్తి యలంకారమగును. ఇది లక్షణము. కారణకార్యములకు పూర్వాపరక్రమము నియతము. అట్లు కాక కారణకార్యములు ఏకకాలమునందే జరుగుట యక్రమము. అక్రమము నాధారముగా చేసికొని, వర్ణ్యమున కతిశయమును గూర్చుటచేత, దీనికి అక్రమాతిశయోక్తి యనుపేరు సార్థకమన్నది.

ఓరాజా! నీబాణములును నీశత్రువులును సమముగా జ్యాలింగనము గావించుచున్నారు- ఇది లక్ష్యము. బాణమును ప్రయోగించుట ముందు జరుగును; తదనంతరము బాణపాతమువలన శత్రువులు చనిపోవుదురు. ఇది క్రమము. ఇచ్చట క్రమము పరిగణింపబడలేదు. బాణములు జ్యాలింగనము చేసినవి; అనగా వింటినారిని స్పృశించినవి. అదేసమయమున శత్రువులు జ్యాలింగనము చేసిరి; అనగా భూమిపైని పడిపోయిరి. కారణమైన బాణప్రయోగము, కార్యమైన శత్రుశరీరపాతము- ఒక్కమారుగా జరిగిన వనుటచేత, కారణకార్యములకు సహభావము వర్ణితమైనది. అందువలననే యిది అక్రమాతిశయోక్తికి లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అక్రమాతిశయోక్తి ప్రఖ్యాతి కెక్కు-
హేతుకార్యంబులకు సహవృత్తి గలుగ;
జ్యాపరీరంభణైక దక్షత వహించె
నీ శరంబులు నీశత్రునృపులతోడ.

విమర్శ : ఈ పద్యమునందు లక్ష్యము కొంచెము సరుదుబాటు నపేక్షించుచున్నది. ఉన్నది యున్నట్లుగా, ఇది సహోక్తికి లక్ష్యమగునే కాని అక్రమాతిశయోక్తికి లక్ష్యము కాదు. ఈ రెండింటియందును సహభావమే ప్రధానముగా నుండును. సహోక్తియందు "సహ" యను పదము ప్రయుక్తమై సహభావమును ప్రదర్శించును. అక్రమాతిశయోక్తియందు సహపదప్రయుక్తి సహ్యముకాదు. 'నీశరంబులు నీశత్రునృపులతోడ' నని "తోడ" నన్న సహార్థకమును వాడుటచేత, ఇది సహోక్తికి లక్ష్యమగును. కావున, దానిని తొలగించి 'నీశరములును నీశత్రునృపచయములు' అని నాలుగవ పాదమును సవరించుకొనుట యుచితముగా నుండును.

ఏడవ భేదము

37. చపలాతిశయోక్తి స్స్యాత్కార్యే హేతుప్రసక్తిజే,
యాస్యామీత్యుదితే తన్వ్యా వలయోఽభవదూర్మికా॥

టీక : హేతుప్రసక్తిజే = కారణప్రసంగముచేత పుట్టిన; కార్యే (వర్ణితే సతి)=కార్యము వర్ణింపబడుచుండగా; చపలాతిశయోక్తిః = చపలాతిశయోక్తి యన్నియలంకారము; స్యాత్ = అగును॥ యాస్యామి + ఇతి = వెళ్ళబోవుచున్నానని; ఉదితే (సతి)=చెప్పగా; తన్వ్యాః = ప్రియురాలియొక్క; ఊర్మికా =ఉంగరము; వలయః=కంకణముగా; అభవత్=అయ్యెను.

వ్యాఖ్య : కారణము ప్రసక్తమైనంతలోనే కార్యము జరిగినట్లు చెప్పిన యెడల, అది చపలాతిశయోక్తి యగును. ఇది లక్షణము. కారణము జరిగిన పిమ్మట కార్యము జరుగుట క్రమము. కారణమునుగూర్చి ప్రసంగించినంతలోనే, తద్జ్ఞానముచేతనే కార్యముత్పన్నమయ్యెననుట యిచ్చట కలదు. ఇది చపలాత్వమునకు నిదర్శనము. 'చపల" యనగా మెఱపుదీగ. మెఱపుదీగ హఠాత్తుగా స్ఫురించునట్లే, యిచ్చటికార్యమును హఠాత్తుగా స్ఫురించును. చపలత్వము నాధారముగా చేసికొని వర్ణ్యమున కతిశయమును సమకూర్చుట చేతనే, దీనికి చపలాతిశయోక్తి యన్న పేరు సార్థకమగుచున్నది.

నేను వెళ్ళుచున్నానని చెప్పినంతలో ప్రియురాలి కుంగరము కంకణమయ్యెను- ఇది లక్ష్యము. ప్రియుని విరహమును సహింపజాలక ప్రియురాలు కృశించుట సహజమే. కాని. యిచ్చట విరహమే ప్రారంభము కాలేదు. విర

హమునకు హేతువైన వెళ్ళుటసైతము జరుగలేదు. వెళ్ళుదునన్న వార్త మాత్రమే ప్రసక్తమైనది. అంతమాత్రముచేతనే, అతడు వెళ్ళినపిమ్మట, ఎంతో కాలమునకు పిమ్మట కృశించినట్లు వెనువెంటనే కృశించిపోయెను. ఇక్కడి కార్యము హఠాత్స్ఫురితము. ఉంగరము వ్రేలి కాభరణము. అది చేతికి కంకణమయ్యెను. ఆమె చిక్కినప్పుడు ఆమె చేయి వ్రేలంత యయ్యెననిభావము. ఇట్లు భర్తృ గమనవార్తచేతనే భార్య కృశించె ననుటవలన, ఇది చపలాతిశయోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఒప్పుఁ గృతిఁ జపలాతిశయోక్తి కార
ణప్రసక్తిజ కార్యమైనను; విభుండు
చనియెద నఁటన్నమాత్రనే చాన కయ్యె
వలయ ముంగర మన్నట్లు వామదేవ !

ఎనిమిదవ భేదము :

**38.** అత్యన్తాతిశయోక్తి స్స్యాత్పౌర్వాపర్య వ్యతిక్రమే,
అగ్రే మానో గతః పశ్చాదనునీతా ప్రియేణ సా॥

టీక : పౌర్వాపర్య వ్యతిక్రమే (సతి)=పూర్వోత్తర భావమునకు వైరుద్ధ్యము కలుగగా; అత్యన్తాతిశయోక్తిః=అత్యంతాతిశయోక్తి యను నలంకారము; స్యాత్ = అగును॥ అగ్రే = ముందుగా; మానః = అభిమానము; గతః= తొలగిపోయెను; పశ్చాత్=తరువాత; సా = ఆమె; ప్రియేణ=ప్రియునిచేత; అనునీతా=అనునయింపబడెను.

వ్యాఖ్య : కారణ కార్యముల పూర్వోత్తర క్రమమునందు వ్యత్యయము కలిగినట్లు వర్ణించినయెడల, అత్యంతాతిశయోక్తి యగును. ఇది లక్షణము. ఇంతకు ముందు చెప్పికొన్నట్లుగా పూర్వము కారణమును, అనంతరము కార్యమును ప్రవర్తింపవలయును. అది క్రమము. కార్యము ముందుగా జరిగి, కారణము తరువాత జరిగినట్లయిన ఉండవలసిన క్రమము వ్యత్యస్తమైనట్లే. కారణముతోపాటు కార్యము జరుగుట, కారణప్రసంగము చేతనే కార్యము జరుగుట యిదివరకు చూచితిమి. ఇదివానిని మించియున్నది కావుననే దీనికి అత్యంతాతిశయోక్తి యనుపేరు సార్థకమగుచున్నది.

ఆమెకోపము పోయినది; తరువాత నత డూరడించెను- ఇది లక్ష్యము. కోపము పొందిన ప్రియురాలిని ప్రియుడు డూరడింపవలయును. అప్పుడామె కోపమును విడిచి ప్రసన్నురాలు కావలయును. ఇది క్రమము. ఊరడించుట కారణము, కోపమును విడుచుట కార్యము. ఇచ్చట కార్యము ముందు జరిగినట్లును, కారణము తరువాత జరిగినట్లును వచింపబడినది. కారణకార్యముల పౌర్వాపర్యవ్యత్యయ మన్న లక్షణమునుబట్టి యిది అత్యంతాతిశయోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. ప్రియ మత్యంతాతిశయో
క్తియనన్ మును కార్య ముప్పతిలఁ గారణ మా
పయి నగుట; యింతి మానము
పయనం బాయెను ప్రియుండు పదపడి సనియెన్.

విమర్శ : లక్ష్యమునందు 'అనునయించెను' అన్న పదమునకు బదులుగా 'అనియె' నని వ్రాసెను. ఈ మాటకు అంతటి సామర్థ్యము లేదు. 'అనునయించెను' అన్న అర్థము వచ్చినగాని లక్ష్యము సరిపడదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. మునుపె కార్యంబు జరిగి యావెనుక హేతు
వైనఁ బరఁగు నత్యంతమా నతిశయోక్తి;
పడఁతి మునుమునుఁదె కోపంబు విడిచిపెట్టె
నంతఁ దన్మనోహరుఁ డామె ననునయించె.

## 14. తుల్యయోగితాలఙ్కారః (తద్భేదాః)

39. వర్ణ్యానా మితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా,
సంకుచన్తి సరోజాని స్వైరిణీ వదనాని చ॥

టీక : వర్ణ్యానామ్ (వా) = ప్రకృతములకు గాని; ఇతరేషాంవా=అప్రకృతములకు గాని; ధర్మ + ఐక్యమ్ = ధర్మసంబంధమైన ఏకత్వము; (వర్ణితం చేత్=చెప్పబడినయెడల); తుల్యయోగితా=తుల్యయోగిత యన్న యలంకా

రము॥ సరోజాని=పద్మములును; స్వైరిణీ వదనాని + చ=జారస్త్రీలయొక్క ముఖములును; సంకుచన్తి=ముడుచుకొనుచున్నవి.

వ్యాఖ్య : వర్ణ్యములకుగాని, అవర్ణ్యములకుగాని, ధర్మైక్యమును చెప్పినయెడల తుల్యయోగిత యగును. ఇది లక్షణము. తుల్యములైనవాని నొకచోట చేర్చుట యిందు కానవగును. ఇచ్చట ధర్మైక్య ప్రతిపాదకమగు పదము కూడ నొక్కటే, యొక్కమాటే యుపాత్తమగును. కావుననే తుల్యయోగిత యనుపేరు సార్థకమగుచున్నది.

తుల్యయోగితాలంకారము మూడు భేదములను కలిగియున్నది. అందు మొదటి భేదమునకు లక్షణము మాత్రమే యిచ్చట ప్రసక్తమైనది. ఈ మొదటి భేదముకూడ రెండురకములు. మొదటిది వర్ణ్యములకు ధర్మైక్యమును వర్ణించుట వలన నేర్పడును. దీనిని ప్రకృతగోచర తుల్యయోగిత యనవచ్చును. రెండవది అవర్ణ్యములకు మాత్రమే ధర్మైక్యమును వర్ణింపగా నేర్పడును. దానిని అప్రకృత గోచర తుల్యయోగిత యనవచ్చును. శ్లోకముయొక్క ఉత్తరార్థమునందు ప్రకృత తుల్యయోగితకు లక్ష్యము ప్రదర్శింపబడినది. అప్రకృత తుల్యయోగితకీ తరువాత చూపబడును.

పద్మములును, జారస్త్రీల ముఖములును ముడుచుకొనుచున్నవి— ఇది లక్ష్యము. ఇది సాయంకాల వర్ణనము. సూర్యుడస్తమించుటతోడనే పద్మములు ముడుచుకొనును. రాత్రి సమయము జారస్త్రీలకు సంతోషదాయకమే. కాని యిచ్చట సంతోషము నిలుచుటకు వీలులేకుండ పూర్ణ చంద్రోదయమైనది. జారస్త్రీలకు రహస్యభంగమగును. కావున వారి ముఖములు ముడుచుకొనును. ఇచ్చట పద్మములును, స్వైరిణీ వదనములును గూడ ప్రకృతములే. ఈ రెండింటికిని 'సంకుచన్తి' యన్న యొకే పదముచేత ధర్మైక్యము సాధింపబడినది. అందుచేతనే యిది ప్రకృతగోచరతుల్యయోగితకు లక్ష్యముగా పరిపడుచున్నది.

దీనికి సూరకవి పద్యము లభ్యము కాలేదు. మూలమున కనువాదముగా ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వెలయుఁ దుల్యయోగిత వర్ణ్యములకు నేని
నన్యములకేని ధర్మైక్య మమరునేని;

వారిజములును స్వైరిణీ వదనములును
జంద్రుఁ డుదయించి నంతట సంకుచించు.

40. త్వదఙ్గమార్దవే దృష్టే కస్య చిత్తే న భాసతే,
మాలతీ శశభృల్లేఖా కదళీనాం కఠోరతా॥

టీక : త్వత్=నీయొక్క; అఙ్గ మార్దవే=శరీర సౌకుమార్యము; దృష్టే (సతి)=చూడఁగా; కస్య=ఎవనియొక్క; చిత్తే=మనస్సునందు; మాలతీ=మాలతీలతయొక్కయు; శశభృల్లేఖా=చంద్రకళయొక్కయు; కదళీనామ్=అరటిబోదయొక్కయు; కఠోరతా=కాఠిన్యము; న+భాసతే=స్ఫురింపకుండును.

వ్యాఖ్య : అప్రకృతగోచర తుల్యయోగిత కిది యుదాహరణము. నీశరీర సౌకుమార్యమును జూచినయెడల ఎవని మనస్సునకు మాలతీలత యొక్కయు, చంద్రకళయొక్కయు, అరటిబోదయొక్కయు కాఠిన్యము గోచరింపకుండును? ఇది ఒక ప్రియుడు ప్రియురాలి శరీర సౌకుమార్యమును ప్రశంసించుచు వేసిన ప్రశ్నము. ఇచ్చట వర్ణ్యము ప్రియురాలి శరీరము. మాలతీలత, చంద్రకళ, అరటిబోద- ఈమూడును గూడ అవర్ణ్యములే. వర్ణ్యమున కాధిక్యమునుగల్గించుటకుగాను, అవర్ణ్యములకు ఏకధర్మాన్వయము నిరూపితమైనది. ఇట్లు అవర్ణ్యములకు ధర్మైక్యము వర్ణింపబడుటచేతనే యిది అప్రకృత గోచర తుల్యయోగితకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. సకియ ! నీమృదు తనులత దృష్టమగునేని
చిత్తమున నెవ్వనికిఁ బ్రకాశింపకుండుఁ
గదళికా మాలతీ లతికా శశాంక
రేఖల కఠోరత యఁటన్నరీతి శర్వ !

రెండవ భేదము

41. హితాహితే వృత్తితౌల్య మపరా తుల్యయోగితా,
ప్రదీయతే పరాభూతి ర్మిత్ర శాత్రవయో స్సమా॥

టీక : హిత+అహితే=మిత్రునియందును శత్రునియందును; వృత్తితౌల్యమ్=వర్తన సంబంధమైన తుల్యత్వము; (వర్ణితం చేత్=వర్ణింపబడిన

యెడల); (సా=అది); అపరా=మరొక; తుల్యయోగితా=తుల్యయోగిత॥ త్వయా=నీచేత; మిత్ర శాత్రవయోః=మిత్రులకును శత్రువులకును; పరా + భూతిః=ఉత్కృష్టమైన యైశ్వర్యము; పరాభూతిః=పరాభవము; ప్రదీయతే= ఈయబడుచున్నది.

వ్యాఖ్య : మిత్రునియందును శత్రువునందును తుల్యప్రవర్తనము వర్ణింపబడినయెడల, అదికూడ తుల్యయోగితయే యగును. ఇది లక్షణము. ప్రవృత్తి తుల్యత్వముమబట్టి మిత్రునకును శత్రునకును సమయోగిత్వము కలుగుట యిచ్చట కనిపించును.

నీచేత మిత్రులకును శత్రులకును పరాభూతి యీయబడుచున్నది- అని యన్నప్పుడు మిత్రులకు 'పరాభూతి', యనగా ఉత్కృష్టమైన యైశ్వర్య మీయబడుచున్నదని యర్థము; శత్రులకు 'పరాభూతి' యనగా పరాభవము కలిగింపబడుచున్నదని యర్థము. మిత్రులకు శత్రులకు కూడ పరాభూతి నిచ్చుటయే జరుగుచున్నది. కావున నిచ్చుట తుల్యప్రవర్తన మున్నది. అందు వలననే యిది తుల్యయోగితకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఆప్తరిపులందు వృత్తితౌల్యమగు నేని
నదియు నొకతుల్యయోగిత యండ్రు కృతుల;
రాజ ! నీచేత మిత్ర శాత్రవుల కియ్యఁ
బడె నరిష్టంబనిన మాడ్కి ఫాలనేత్ర !

విమర్శ : మూలమునందు "పరాభూతిః" అన్నదానినిబట్టి వృత్తితౌల్యము సంపాదింపబడినది. అవమాన మన్న యర్థమున నది యేకపదము. ఉత్కృష్టమైన యైశ్వర్య మన్న యర్థమున నది విశేషణ విశేష్యములుగా రెండు పదము లగును. 'భూతిః' అన్నది విశేష్యము, ఇది స్త్రీలింగ శబ్దము. కావున దీని విశేషణము వ్యస్తముగా నున్నప్పుడు 'పరా' యని దీర్ఘాంతమై స్త్రీలింగ రూపమున నుండును. తెలుగున నవమాన మన్న యర్థమున 'పరాభూతి' యని వాడవచ్చును. రెండవ యర్థమున 'పరభూతి' యనియే కావలసివచ్చును. కావున తెలుగున నీ పదము అర్థద్వయ బోధకము కాజాలదు. ఈ మర్మము గుర్తించి, సూరకవి "అరిష్టము" అన్నపదమును వాడి అర్థద్వయమును

సాధించుకొనుచున్నాడు. 'రిష్టము' అన్నది మూలపదము. దీనికి కీడు, మేలు- అన్న విరుద్ధార్థములు రెండును గలవు. అయినను 'రిష్టము' అనుపదము కాక దీనికి నఞ్ తత్పురుషరూపమైన 'అరిష్టము' ప్రసిద్ధముగా నున్నది. దీని కితరార్థములతోపాటు మేలు, కీడు- అన్న రెండర్థములు గలుగును. 'మేలు' అన్నప్పుడు సమానార్థముగా 'వైభవము' గ్రహింపవచ్చును. రాజు మిత్రులకు శత్రులకు నరిష్టము నిచ్చుచున్నాడనుటచేత వృత్తితౌల్యము నిరూపితమగుచున్నది. ఈ మార్పు సముచితమై యున్నది.

మూడవ భేదము

42. గుణోత్కృష్టైః సమీకృత్య వచోఽన్యా తుల్యయోగితా,
లోకపాలో యమః పాశీ శ్రీదశ్శక్రో భవానపి॥

టీక : గుణ + ఉత్కృష్టైః=ఉత్తమగుణ గరిష్ఠులగు వారితో; సమీకృత్య =సమానముగా కలిపి; వచః=వాక్యము; (వర్ణితం చేత్ = వర్ణింపబడిన యెడల); అన్యా=మరొక; తుల్యయోగితా=తుల్యయోగిత; (భవతి=అగును)॥ యమః=యముడు; పాశీ=వరుణుడు; శ్రీదః=కుబేరుడు; శక్రః=ఇంద్రుడు; భవాన్ + అపి=నీవు కూడ; లోకపాలః=లోకపాలుడవు.

వ్యాఖ్య : ఉత్తమగుణ గరిష్ఠులతో సమీకరించి వర్ణించినచో నిదియొక తుల్యయోగిత యగును. ఇది లక్షణము. ఇచ్చటకూడ ప్రసిద్ధులగు వారితో సమయోగిత్వము కలుగుటచేత తుల్యయోగిత సార్థకమగుచున్నది.

యముడు లోకపాలుడు, వరుణుడు లోకపాలుడు, కుబేరుడు లోకపాలుడు, ఇంద్రుడు లోకపాలుడు, నీవును లోకపాలుడవు- అన్నది లక్ష్యము. నిజమునకు మూలమునందు "లోకపాల" శబ్ద మొక్కమారు మాత్రమే వాడబడినది. అయినను ఏకవచన సారస్యముచేత 'యమో లోకపాలః, వరుణో లోకపాలః' మున్నగు విధముగా నన్నియెడల నన్వయించుకొనవలయును. ఇంతకును యమ వరుణ కుబేరాదులు లోకపాలురుగా సుప్రసిద్ధులు. ఒక కవి రాజు నభినందించుచు లోకపాలుడవని చెప్పుటయేకాక, తత్ప్రసిద్ధులతో సమీకరించుచున్నాడు. ఈ సమీకరణము, అనగా సమానముగా చేయుట వలన తత్ప్రసిద్ధుల గుణగరిష్ఠత, ప్రకృత రాజునకును సంక్రమింపజేయుట జరు

గుచున్నది. ఇట్లు గుణగరిష్ఠులతో సమీకరించుటనుబట్టి, యిది తుల్యయో
తకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ప్రాకట గుణాఢ్యుతోడ సమీకరించి
కృతి వచించినఁ దుల్యయోగిత యఁటంద్రు;
లోకపాలురు వజ్రి, కాలుండు, వరుణుఁ,
డర్థపతి, నీవు నన్నట్లు నలికనేత్ర !

విమర్శ: లక్షణమునందు "ప్రాకట గుణాఢ్యుతోడ" నని యేకవచన
ప్రయుక్తమైనది. బహువచనముండుట సరసము; లక్ష్యమునుబట్టికూడ అదియే
సమంజస మనిపించుచున్నది. కావున 'మించు గుణగరిష్ఠులతో సమీకరించి'
యని మొదటిపాదమును సరుదుబాటు చేసికొనుట యొప్పును. లక్ష్యమునంద
"లోకపాలః" అని మూలములో నున్నట్లుగా ఏకవచనమునుగాక "లోకపాలుడు"
అని బహువచనమే యుండుటచేత వాక్యము మొత్తముమీద దీని నొక్క
మారు గ్రహించిన సరిపోవును. ఇది సందర్భ సముచితముగా నున్నది.

## 15. దీపకాలఙ్కారః

43. వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః,
మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః॥

టీక: వర్ణ్య + అవర్ణ్యానామ్ = ప్రకృతములయొక్క అప్రకృతముల
యొక్క; ధర్మ + ఐక్యమ్ = ఏకధర్మత్వము; దీపకమ్ (ఇతి) = దీపకాలంకార
మని; బుధాః=పండితులు; వదన్తి=చెప్పుదురు॥ మదేన=మదజలముచేత; కల
భః = ఏనుగు గున్నయు; ప్రతాపేన = శౌర్యముచేత; మహీపతిః=భూపాలు
డును; భాతి=ప్రకాశించును.

వ్యాఖ్య: ప్రకృతాప్రకృతములకు ధర్మైక్యమును చెప్పినయెడల దీపక
మగును. ఇది లక్షణము. ధర్మైక్యమును ఒక్కమారే, ఒక్కపదముచేతనే ప్రతి
పాదింపవలయును. కేవల ప్రకృతములకుగాని, కేవలాప్రకృతములకు గాని
ధర్మైక్యము చెప్పుట తుల్యయోగిత యందు చూచితిమి. ఇచ్చట ప్రకృతాప్ర
కృతములకు ధర్మైక్యము చెప్పుట విశేషము. వర్ణ్యముయొక్క ధర్మమును

దెల్పుటకు కుపయోగించిన పదముచేతనే అవర్ణ్య ధర్మమునకుసైతము దీపనము కలుగును. దీపనము అనగా ప్రకాశమని యర్థము. గడపమీద పెట్టిన దీపము ఇంటిలోపల, వెలుపల కూడ వెలుతురును వ్యాపింపజేయును. అట్లే యిచ్చటను జరుగుచున్నది. కావున దీపకాలంకారము అనుపేరు సార్థకమగుచున్నది.

మదముచేత నేనుగు, ప్రతాపముచేత రాజు ప్రకాశించును— అన్నది లక్ష్యము. ప్రకాశించుట యను ధర్మమునుబట్టి ఏనుగునకును రాజునకును సామ్యము సాధింపబడినది. ఇచ్చట వర్ణ్యము రాజు; అవర్ణ్యము ఏనుగు. ఇట్లు వర్ణ్యావర్ణ్యములకు ధర్మైక్యమును గలిగించుటచేత, ఇది దీపకాలంకార మగుచున్నది.

పైది ఒక చాటుకారుడు రాజప్రశంసకై పలికిన వాక్యము. అట్టిసందర్భమునం దున్నప్పుడే అది దీపకము కాగలదు. ఇంకొక సన్నివేశను నూహింతము. విజయోత్సవ సమయమున రాజు పట్టపుటేనుగు నెక్కి యూరేగుచుండె ననుకొందము. అట్టియెడల ప్రేక్షకులలో నెవరైన నీ వాక్యము నన వచ్చును. అప్పుడు గజము వర్ణ్యమే; రాజుకూడ వర్ణ్యమే. కేవల వర్ణ్యములకు ధర్మైక్యము కలిగి, అది తుల్యయోగితయే యగును. ఇంకొక సన్నివేశము నూహింతము. ఒక సూక్తిచతురుడు దేనికి దేనివలన సౌందర్యము కలుగునో ఒక క్రమమున చెప్పుచున్నా డనుకొందము. అప్పుడు నిజమున కచ్చటి వస్తువులన్నియు నవర్ణ్యములే. కావున ఆ సందర్భమునందు చెప్పినట్లుగా పై వాక్యమును గ్రహించినయెడల, అవర్ణ్యములకు ఏకధర్మాన్వయము చెప్పినట్లగును. అప్పుడుకూడ అది తుల్యయోగితయే యగును. కావున, సన్నివేశమునుబట్టి యీ వాక్యమునందలి రెండు వస్తువులలో ఒకటి వర్ణ్యమని, ఒకటి అవర్ణ్యమని నిర్ణయించినప్పుడు మాత్రమే దీపకాలంకారమునకు లక్ష్యము కాగలదు.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరారుఁ గృతుల దీపక
మన వర్ణ్యావర్ణ్య ధర్మ మైక్యమయిన; నా
మునఁ బేర్చుఁ గరి ప్రతాపం
బునఁ బేర్చు నృపాలుఁ డనఁగ భుజగవిభూషా!

విమర్శ : ఈ పద్యమునందు 'పేర్చు' నను క్రియాపదము రెండుసారు లుపాత్తమైనది. ఇది దీపక లక్షణమునకు విరుద్ధము. ఈ తరువాత వచ్చు 'ఆవృత్తిదీపము' నకు పైది లక్ష్యము కాగలదు. కాని, గ్రంథకర్త దీనిని దీపకము నకే లక్ష్యముగా నుద్దేశించెను. అది యట్లు కావలయుననిన, ఇందు చిన్న మార్పులను జేయుట యవసరము. 'పేర్చు' నన్న క్రియాపదము రెండుసారు లుండరాదు; కావున, మూడవ పంక్తియందున్న 'పేర్చు' ను తొలగింపవల యును. అప్పుడు ఛందస్సు సరిపెట్టుకొనుటకై తరువాతి 'కరి' యన్నపద మును గూడ తొలగించి రెండింటికి బదులుగా 'వారణము' అని వాడవచ్చును. నాల్గవ పాదమున కర్తృ పదమునకు పూర్వమే క్రియాపదము వచ్చుచున్నది. కర్తృ పదమును ముందుగా వాడి, తరువాత క్రియాపదమును వాడిన నన్వ యము సుకరముగా నుండును. 'పేర్చు నృపాలుఁ డనఁగ' నని యనుటకు బదులుగా 'భూపుఁడు పేర్చు ననగ' నని యన్నచో సర్వము సంగత మగును. అప్పుడు 'అమున వారణము ప్రతాపంబున భూపుఁడు పేర్చు ననఁగ భుజగ విభూషా' అన్నది లక్ష్యభాగమగును.

## 16. ఆవృత్తిదీపకాలఙ్కారః (తద్భేదాః)

44. త్రివిధం దీపకావృత్తౌ భవే దావృత్తిదీపకమ్,
వర్షత్యమ్బుద మాలేయం వర్షత్యేషా చ శర్వరీ॥

టీక : దీపక + ఆవృత్తౌ (సత్యాం) = దీపకస్థానీయ మగు పదము యొక్కయు నర్థముయొక్కయు నావృత్తి కలుగగా; ఆవృత్తిదీపకమ్=ఆవృత్తి దీపకమన్న యలంకారము; త్రివిధమ్=మూడు విధములుగా; భవేత్=అగును॥ ఇయం + అమ్బుదమాలా=ఈ మేఘసముదాయము; వర్షతి=వర్షించుచున్నది; ఏషా + శర్వరీ + చ=ఈరాత్రి కూడ; వర్షతి=వర్ష ఇవాచరతి=సంవత్సరమువలె నగుచున్నది.

వ్యాఖ్య : వర్ణ్యావర్ణ్యముల ధర్మమును దీపింపజేయు పదము కాని, అర్థము కాని, పదార్థోభయము కాని ఆవృత్తి నొందినయెడల ఆవృత్తిదీపక మగును. ఆవృత్తి యగుట యనగా "తిరిగి ప్రయోగింపబడుట" యని యర్థము. పదము మాత్రమే యావృత్తి నొందినయెడల పదావృత్తిదీపక మగును. పదము నర్థమును గూడ ఆవృత్తి నొందినయెడల ఉభయావృత్తి దీపక మగును. ఈ శ్లోక మున నుత్తరార్థమునందు పదావృత్తి దీపకమునకు లక్ష్యము చూపబడినది.

ఈ మేఘమాల వర్షమగుచున్నది; ఈరాత్రియు వర్ష మగుచున్నది- ఇది విప్రలబ్ధయగు నొక నాయిక తన చెలికత్తెతో పలికిన వాక్యము. "వర్షతి" యను పదము పునరావృత్తమైనది. మేఘమాల విషయమున 'వర్షతి' యని యన్నప్పుడు 'వర్షించుచున్నది' అని యర్థము. రాత్రివిషయమున 'వర్షతి' యన్న పదమునకు సంవత్సరమువలె సుదీర్ఘ మగుచున్నదని యర్థము. పదము రెండుచోట్ల నొక్కటే యున్నప్పటికి అర్థమునందు మిక్కిలి భేదము కలదు. కావుననే యిది పదావృత్తి దీపకమునకు లక్ష్యమగుచున్నది.

ఇంకొక్క విషయము. దీపకమునందు వర్ణ్యావర్ణ్యములకు ధర్మైక్యమును చెప్పవలయునని గుర్తించితిమి. కాని, యిచ్చట ఆ లక్షణము పట్టదు. దీపకము ఆవృత్తి చెందినంతటిలోనే ఆవృత్తి దీపక మేర్పడును. పై యుదాహరణమునందు "ఈ మేఘమాల" యని చెప్పుటచేత అత్యంత సామీప్యము సూచితమగుచున్నది. కావున మేఘమాల వర్ణ్యము. అట్లే "ఈ రాత్రి" యని యనుటచేత అదికూడ వర్ణ్య మగుచున్నది. మేఘమాల వర్షమును కురియుచున్నది; కావుననే రాత్రి దుస్సహమై సంవత్సరమంత సాగినది. ఈ రెండు వర్ణ్యములకు ధర్మైక్యము "వర్షతి" అన్న పదముచేత సాధింపబడుచున్నది. ఇట్లే ఆవృత్తి దీపకమునందలి మిగిలిన రెండు భేదములందును కేవల వర్ణ్యములకు గాని, కేవలావర్ణ్యములకు గాని ధర్మైక్యము సాధింపబడును. అయినప్పటికిని, అచ్చటనున్న యావృత్తిచేతనే అవి యావృత్తిదీపకము లగుచున్నవి.

సూరకవి గ్రంథమున దీని కనువాదములేదు. కావున నిది గ్రహింపవచ్చును.

గీ. దీపక పదార్థపునరుక్తి ప్రాపునొంది
త్రివిధమై యొప్పు నావృత్తి దీపకంబు;
వారిధరవితానంబుచే వర్షమయ్యె
వారిజేక్షణ కారాత్రి వర్షమయ్యె.

45. ఉన్మీలన్తి కదమ్బాని స్ఫుటన్తి కుటజోద్గమాః
మాద్యన్తి చాతకా స్తృప్తా మాద్యన్తి చ శిఖావళాః॥

టీక : కదమ్బాని=కడిమి పూలు; ఉన్మీలన్తి=వికసించుచున్నవి; కుటజోద్గమాః=కొండమల్లిపూలు: స్ఫుటన్తి= వికసించుచున్నవి॥ తృప్తాః=తృప్తిపొం

దిన; చాతకాః=చాతక పక్షులు; మాద్యన్తి=మదించుచున్నవి; శిఖావళాః+చ=నెమళ్ళును; మాద్యన్తి=మదించుచున్నవి.

వ్యాఖ్య : ఇందు పూర్వార్ధము అర్థావృత్తి దీపకమునకు లక్ష్యము. కడిమి పూలు వికసించుచున్నవి, కొండమల్లి పూలు విచ్చుకొనుచున్నవి- ఇచ్చట "ఉన్మీలన్తి" అనునొక క్రియాపదమును "స్ఫుటన్తి" అనునొక క్రియాపదమును ప్రయుక్తము లైనవి, రెండింటికిని నర్థమొక్కటే. ఇచ్చట వర్ణ్యము లైన కదంబ కుటజోద్గమములకు 'వికసించుట' యన్నది సామాన్య ధర్మము. 'వికసించుట' యన్న దీపకమైన యర్థము ఆవృత్తమగుటచేత, ఇది అర్థావృత్తి దీపకమున కుదాహరణముగా సరిపడియున్నది.

ఉత్తరార్ధము ఉభయావృత్తి దీపకమునకు లక్ష్యము. ఇచ్చట 'మాద్యన్తి' అన్నది దీపకమైన పదము. ఇది రెండు పర్యాయములు ప్రయుక్తమైనది. తృప్తి చెందిన చాతకములు మదించుచున్నవి, నెమళ్ళును మదించుచున్నవి- అన్న చోట 'మదించుచున్నవి' అన్న పదము రూపమునందును, అర్థమునందునుగూడ ఒక్కమాదిరిగానే యున్నది. అనగా ఒకేపదము, ఒకే యర్థముతో నావృత్తమైనది. కావుననే, ఇది ఉభయావృత్తి దీపకమున కుదాహరణముగా సరిపోయినది. సూరకవి యీ శ్లోకము ననువదింపలేదు. దీని నిట్లు గ్రహియింపవచ్చును.

గీ. కడిమి పువ్వులు మిగుల వికాసమొందు
కొండ మల్లె పువ్వులు విచ్చుకొనును మిగుల;
చాతకంబులు మదియించుఁ జాలఁదృప్తిఁ
గలికి నెమళులు మదియించుఁ గాంక్షతీఱ.

## 17. ప్రతివస్తూపమాలఙ్కారః

46. వాక్యయో రేక సామాన్యే ప్రతివస్తూపమా మతా,
తాపేన భ్రాజతే సూరః శూర శ్చాపేన రాజతే॥

టీక : వాక్యయోః=రెండు వాక్యములకు; ఏక సామాన్యే (సతి)=ఒకే సామాన్యధర్మముతో నన్వయముండగా; ప్రతివస్తూపమా= ప్రతివస్తూపమ యన్న యలంకారము ; (సూరిభిః=పండితులచేత); మతా=అంగీకృతమగును॥ సూరః=సూర్యుడు; తాపేన=ఎండచేత; భ్రాజతే=ప్రకాశించును; శూరః= శౌర్యవంతుడు; చాపేన=ధనస్సుచేత; రాజతే=ప్రకాశించును.

వ్యాఖ్య: రెండు వాక్యముల కొక సామాన్యధర్మముతో నన్వయ మున్నయెడల ప్రతివస్తూపమాలంకార మగును. ఇది లక్షణము. ఇచ్చట రెండు వాక్యములుండుట యవశ్యలక్షణము. రెండు వాక్యములందు నున్న సామాన్యధర్మము ఏకార్థకములైన రెండు భిన్నపదములచేత ప్రతిపాదింప బడును. పేరునుబట్టి చూచినప్పుడు వస్తువొకటి, ప్రతి వస్తువొకటి యిచ్చట నుండుట యవసరము. వస్తువనగా వర్ణ్యాంశమును గల వాక్యము. ప్రతివస్తు వనగా అవర్ణ్యాంశమును గల వాక్యము. ప్రతివస్తువుతోడి ఉపమ వలన నిది ప్రతివస్తూపమ యనుపేర సార్థకమగుచున్నది.

సూర్యుడు తాపముచేత భ్రాజిల్లును; శూరుడు చాపముచేత రాజిల్లును- ఇది లక్ష్యము. 'శూరుడు చాపముచేత రాజిల్లుట' యన్నది వర్ణ్యము. 'సూర్యుడు తాపముచేత రాజిల్లుట' యన్నది ప్రతివస్తువు. భ్రాజిల్లుట, రాజిల్లుట యన్న రెండు పదములు 'ప్రకాశించుట' యన్న యొకే యర్థమును దెల్పు చున్నవి. 'ప్రకాశించుట' యన్నదియే సమానధర్మము. ఇది పృథక్పదోపాత్త మైనది.

ఇచ్చట నీయుదాహరణము "అర్థావృత్తి దీపకాలంకారము" కావచ్చు నని యనిపించును. కాని, అచ్చట ప్రసక్తములైన రెండు విషయములును వర్ణ్యములో, అవర్ణ్యములో యైయుండును. ఇచ్చట వర్ణ్యమునకు నవర్ణ్యము నకు పోలిక చెప్పబడుట గమనార్హము. ఈ భేదమును బట్టియే యిది ప్రతివస్తూ పమ యగుచున్నది. ఇంకొకవిషయము. వర్ణ్యమునకు నవర్ణ్యమునకు పోలిక చెప్పుట దీపకాలంకారము నందు కలదు. కాని వర్ణ్యమునందలి ధర్మము నొక పదము, అవర్ణ్యమునందలి ధర్మమును మరొకపదము ప్రతిపాదించుట ప్రతి వస్తూపమయందు కలదు. దీపకమునందు ధర్మైక్యము ఒకేపదముతో, ఒకే మారు ప్రతిపాదింపబడును. దీనినిబట్టి ప్రతివస్తూపమ యొక్క విశిష్టలక్షణము గోచరము కాగలదు.

ఆంధ్రచంద్రాలోకము

క. ఏపారుఁ గృతులఁ బ్రతివ
స్తూపమ వాక్యములు రెంటి కొక సమత తగన్;
దాపమున నలరు సూరుఁడు
చాపంబున శూరుఁ డొనరు జగతి ననుక్రియన్.

## 18. దృష్టాన్తాలఙ్కారః

47. చేద్బిమ్బ ప్రతిబిమ్బత్వం దృష్టాన్తస్త దలఙ్కృతిః,
త్వమేవ కీర్తిమాన్రాజన్ ! విధురేవహి కాన్తిమాన్॥

టీక : (వాక్యయోః=రెండు వాక్యములకు); బిమ్బ ప్రతిబిమ్బత్వమ్= బింబ ప్రతిబింబ ధర్మము; చేత్=ఉన్నయెడల; తద్ + అలఙ్కృతిః=ఆ యలం కారము; దృష్టాన్తః=దృష్టాంతము; (భవతి=అగును)॥ రాజన్=ఓ రాజా; త్వమ్ + ఏవ=నీవే; కీర్తిమాన్= కీర్తిమంతుడవు; విధుః + ఏవ + హి=చం ద్రుడే; కాన్తిమాన్=కాంతిమంతుడు.

వ్యాఖ్య : రెండు వాక్యములకు బింబ ప్రతిబింబత్వ మున్నయెడల దృష్టాంతాలంకార మగును- ఇది లక్షణము. రెండు ధర్మములు పరస్పరము భిన్నము లైనను సాదృశ్యమువలన రెండు భిన్నవాక్యములకు సమానధర్మ ముగా వ్యవహరించుట బింబ ప్రతిబింబ భావము. పూర్వము చెప్పుకొన్న వస్తు ప్రతివస్తు భావమునందు ధర్మము సమానమై యుండును; అనగా ఒకే ధర్మ ముండును. బింబ ప్రతిబింబ భావమునందు ధర్మము సదృశముగా నుం డునే కాని సమానముగా నుండదు; అనగా ధర్మములు భిన్నముగానుండును. ధర్మములు భిన్నములై యున్నను సదృశములై యుండుటచేత రెండు భిన్న వాక్యములకు సదృశత్వమును సంపాదించిపెట్టును. అప్పు డది దృష్టాంతాలం కారమగును.

ఓరాజా ! నీవే కీర్తిమంతుడవు; చంద్రుడే కాంతిమంతుడు- అన్నది లక్ష్యము. ఇచ్చట రాజు వర్ణ్యము; చంద్రుడు అవర్ణ్యము. వర్ణ్యధర్మము కీర్తి మత్త్వము: అవర్ణ్య ధర్మము కాంతి మత్త్వము. ధర్మములు భిన్నములు. అయి నను పోలికనుబట్టి రెండు వాక్యములకును సామ్యమును సాధించుట జరుగు చున్నది. ఇందు మొదటి వాక్యము ఉపమేయము; రెండవ వాక్యము ఉప మానము. ఈ రెండింటికిని బింబ ప్రతిబింబ భావముచేత సాదృశ్యము సాధింప బడుచున్నది. కాంతివిషయమున చంద్రు డెంతటివాడో కీర్తి విషయమున నీ వంతటి వాడవు- అన్నది తాత్పర్యము. కావుననే యిది దృష్టాంతాలంకార మునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. కృతి బింబ ప్రతిబింబా
కృతిఁ దగ దృష్టాంత మగును; నృప ! నీవ సము
న్నతిఁ గీర్తి సమన్వితుఁడవు
సితకిరణుఁడు కాంతియుతుఁడు క్షితి ననుపోల్కన్.

## 19. నిదర్శనాలఙ్కారః (తద్భేదాః)

48. వాక్యార్థయో స్సదృశయో రైక్యారోపో నిదర్శనా,
యద్దాతు స్సౌమ్యతా సేయం పూర్ణేందో రకలఙ్కతా॥

టీక : సదృశయోః=సదృశములయిన; వాక్యార్థయోః=రెండు వాక్యార్థములకు; ఐక్య + ఆరోపః=అభేదము నారోపించుట; నిదర్శనా= నిదర్శన యన్న యలంకారము; (స్యాత్=అగును)॥ యత్=ఏది; దాతుః=దాతయొక్క; సౌమ్యతా = సౌకుమార్యమో; సా=అది; పూర్ణ + ఇందోః=పూర్ణచంద్రుని యొక్క; ఇయమ్ + అకలఙ్కతా=ఈ స్వచ్ఛత్వము.

వ్యాఖ్య : నిర్శనాలంకారము వాక్యార్థవృత్తి నిదర్శన, పదార్థవృత్తి నిదర్శన, సదసదర్థబోధన రూప నిదర్శన-యని మూఁడు భేదములను కలిగి యుండును.

ఈ శ్లోకము మొదటి భేదమైన వాక్యార్థవృత్తి నిదర్శనకు లక్షణలక్ష్యములను నిరూపించుచున్నది. సదృశములయిన వాక్యార్థములకు రెండింటికి ఏకత్వము నారోపించినయెడల వాక్యార్థ వృత్తి నిదర్శన యగును. ఇది లక్షణము. ఏకత్వము అని యనగా అభేదము. సదృశత్వము మాత్రమే యీ వాక్యార్థములకు నున్నది; సమానత్వము లేదు. అనగా ఈ వాక్యార్థములకు పోలిక మాత్రమే యున్నది; అనగా అవి యభిన్నములు కావు. సదృశత్వము కలిగి భిన్నములయిన రెండు వాక్యార్థములకు అభేదము నారోపించుట యిచ్చట జరుగుచున్నది. వాక్యార్థముల వ్యాపారమునుబట్టి దీనికి వాక్యార్థ వృత్తినిదర్శన యనుపేరు అన్వర్థ మగుచున్నది.

దాతయొక్క సౌమ్యతయే పూర్ణచంద్రుని యకళంకత- ఇది లక్ష్యము. దాతయొక్క సౌమ్యత యొక వాక్యము; పూర్ణచంద్రుని యకళంకత మరొక

వాక్యము. ఈ రెండింటియందు కర్తలనుబట్టి కాని ధర్మమునుబట్టి కాని యేకత్వము లేదు. మొదటి వాక్యము వర్ణ్యము; రెండవ వాక్యము అవర్ణ్యము. తాత్పర్యార్థమునుబట్టి చూడగా చంద్రునికి నిర్మలత్వము ఎంత అసంభావ్యమో దాతకు అపరుషత్వముకూడ అంత అసంభావ్యమే. ఇట్లు వాక్యార్థములనుబట్టి ఏకత్వ మారోపితమగుటచేత, ఇది వాక్యార్థవృత్తి నిదర్శనకు లక్ష్యమగుచున్నది.

ఇంకొక్కవిషయము. దృష్టాంతమునందు రెండు వాక్యములకు బింబప్రతిబింబ భావముచేత సామ్యము సాధింపబడుచున్నది. నిదర్శన యందు వాక్యార్థములయొక్క సాదృశ్యమునుబట్టి ఏకత్వమే సాధింపబడుచున్నది. దృష్టాంతమునందు ఉపమా లక్షణము ప్రవర్తించుచుండగా, నిదర్శనయందు రూపకలక్షణము ప్రవర్తించుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అగు నిదర్శన సదృశ వాక్యార్థములకు
నేకతారోపణ మొనర్చిరేని; దాత
కెద్ది సౌమ్యత యదియు పూర్ణేందునకును
నిష్కళంకత యన్నట్లు నిఖిలకృతుల.

రెండవ భేదము

49. పదార్థవృత్తి మప్యేకే వదన్త్యన్యాం నిదర్శనామ్,
త్వన్నేత్ర యుగళం ధత్తే లీలాం నీలామ్బు జన్మనోః॥

టీక : పదార్థవృత్తిమ్=పదార్థవృత్తి యని; అన్యామ్ + నిదర్శనామ్=మరియొక నిదర్శనను; ఏకే=కొందరు; వదన్తి=చెప్పుచున్నారు॥ త్వత్ + నేత్రయుగళమ్=నీయొక్క కనుదోయి; నీలామ్బుజన్మనోః=(రెండు) నల్ల కలువలయొక్క; లీలామ్=విలాసమును ధత్తే=ధరించుచున్నది.

వ్యాఖ్య : పదార్థవృత్తి నిదర్శన యని మరొక నిదర్శనాభేదము కలదని మాత్రమే చెప్పబడినది. అన్యపదార్థమునందు తదన్యధర్మమును వర్తింపజేసిన యెడల పదార్థవృత్తినిదర్శన యగునని లక్షణము చెప్పుకొనవచ్చును. ఇచ్చటకూడ ఆరోపమే ప్రధానము,

నల్లకలువల శోభను నీ కనుదోయి ధరించుచున్నది. ఇది లక్ష్యము. నల్లకలువలు అవర్ణ్యము; కనుదోయి వర్ణ్యము. నల్లకలువల యందున్న శోభా పదార్థమును కనుదోయియం దారోపించుట జరుగుచున్నది. ఆ శోభనే కనులు ధరించుచున్న వనుటచేత అభేదము ప్రతిపాదింపబడుచున్నది. పదార్థము నాశ్రయించి, యీ యేకతా నిరూపణము జరుగుచున్నది. కావుననే యిది పదార్థవృత్తి నిదర్శనకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఒక్కటి పదార్థవృత్తి సంయుక్తిఁ దనరు
వేఱొక నిదర్శన యనంగ వినుతి కెక్కు;
దాలిచెడి నల్లగలువల లీల నీదు
కన్నుదోయి యనంగ లక్ష్యము మహేశ!

**మూడవ భేదము**

50. అపరాం బోధనం ప్రాహుః క్రియయాఽసత్స దర్థయోః,
నశ్యే ద్రాజవిరోధీతి క్షీణం చంద్రోదయే తమః॥

టీక : క్రియయా=చేష్టారూపముచేత: అసత్ + సత్ + అర్థయోః=చెడ్డ యర్థమునకు మంచి యర్థమునకు; బోధనమ్=జ్ఞాపనము; (కృతం చేత్=చేయ బడినట్లయిన); అపరాం (నిదర్శనామ్)=మరియొక నిదర్శన మని ; ప్రాహుః= చెప్పుదురు॥ చంద్ర + ఉదయే=చంద్రోదయ సమయమునందు; రాజ విరోధీ= రాజుయొక్క శత్రువు; నశ్యేత్ + ఇతి=చచ్చు నని (బోధించుచు): తమః= చీకటి; క్షీణమ్ (అభూత్)=నాశనమయ్యెను.

వ్యాఖ్య : క్రియారూపముచేత హితమును కాని, అహితమును గాని బోధించుట జరిగెనేని సదసదర్థబోధనరూప నిదర్శన యగునని లక్షణము. ఆత్మాచరణముచేతనే వర్ణ్యము అసదర్థమునుగాని సదర్థమునుగాని దృష్టాంత మున బోధించుట జరుగును. అసదర్థము బోధింపబడిన యెడల అసదర్థ బోధనరూప నిదర్శన యగును. సదర్థము బోధింపబడినయెడల సదర్థ బోధన రూప నిదర్శన యగును. ఉత్తరార్థమున నిందలి మొదటి భేదమున కుదాహర ణము ప్రదర్శింపబడినది.

చంద్రోదయ సమయమున రాజ విరోధి నశించునని తమస్సు నశించు చున్నది- ఇది లక్ష్యము. రాజ విరోధి యన్నప్పుడు చంద్ర విరోధి యన్న యర్థముకూడ చెప్పవలయును. చంద్రు డుదయించినప్పుడు చంద్రునకు విరోధి యైన తమస్సు తాను నశించుచున్నది; తన నాశనమునే దృష్టాంతముగా చెప్పుచు రాజ విరోధి యనగా రాజునకు విరోధియైనవాడు రాజుయొక్క యభ్యుదయ సమయమునందు నశించు నన్న విషయమును బోధించుచున్నది. ఈ బోధ తన నాశనక్రియయే దృష్టాంతముగా జరుగుచున్నది కాని వాక్కుల చేత కాదు. నాశన మన్నది హితముకాదు; అనగా అసదర్థము. అందువలన నిది అసదర్థబోధనరూప నిదర్శనకు లక్ష్యమగుచున్నది.

సూరకవి గ్రంథమునం దీ శ్లోకమున కనువాదము కానరాదు. కావున నీ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. సదసదర్థబోధము క్రియాచరణకలనఁ
దనరునేని మఱొక్క నిదర్శన యగుఁ;
జంద్రుఁ డుదయింపఁ దమము నాశమ్ము నొందె
రాజ శత్రువు తప్పక క్రమందు ననఁగ.

51. ఉదయన్నేవ సవితా పద్మేష్వర్పయతి శ్రియమ్;
విభావయన్త్సమృద్ధీనాం ఫలం సుహృదనుగ్రహమ్॥

టీక : ఉదయన్ + ఏవ=ఉదయించుచునే; సవితా=సూర్యుడు; సమృద్ధీనామ్=సంపదలయొక్క; ఫలమ్=ప్రయోజనము; సుహృద్ + అనుగ్రహమ్=మిత్రుల ననుగ్రహించుట; (ఇతి=అని); విభావయన్ + (సన్) = బోధించువాడై; పద్మేషు=పద్మములయందు; శ్రియమ్ = శ్రీని; అర్పయతి = అర్పించుచున్నాడు.

వ్యాఖ్య : సదర్థబోధనరూప నిదర్శనకు లక్ష్య మిందు చూపబడినది. సూర్యు డుదయించుచునే యైశ్వర్యమునకు ఫలము మిత్రుల ననుగ్రహించుటయే యని బోధించుచు పద్మములకు శ్రీని సమర్పించుచున్నాడు- ఇది లక్ష్యము. సూర్యు డుదయకాలము నుండియే పద్మములకు శోభను గలిగించుచున్నాడు. ఉదయము అని యనగా అభ్యుదయ కాలము, సమృద్ధికరమైన కాలము అని భావము. అందువలన, తాను చేసిన 'సుహృదనుగ్రహము' అను

పనిని దృష్టాంతముగా చూపి, తద్ద్వారమున ఐశ్వర్యవంతులు మిత్రులకు ఐశ్వర్యము నొసగ వలయునని బోధించుచున్నాడు. పద్మముల విషయమున 'శ్రీ' యనగా 'శోభ' యని యర్థము. మిత్రుల విషయమున 'శ్రీ' యనగా 'సంపద' యని యర్థము. ఇచ్చట సుహృదనుగ్రహము అను క్రియచేతనే సుహృదనుగ్రహ మన్న సదర్థము బోధింపబడుచున్నది. కావుననే, యిది సదర్థబోధన రూప నిదర్శనకు లక్ష్యముగా సరిపోయినది. అంధ్రచంద్రాలోక కర్త యీ శ్లోకము ననువదింపలేదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. శ్రీ సమృద్ధికి మిత్రపరిగ్రహంబె
ఫలమని ప్రబోధ మొనరింపఁ దలఁచినట్లు
సవిత యుదయించినంతనే సరసిజముల
కర్పణముసేయు శ్రీవిలాసాతిశయము.

## 20. వ్యతిరేకాలఙ్కారః

52. వ్యతిరేకో విశేషశ్చేదుపమేయోపమానయోః,
శైలా ఇవోన్నతాః సన్తః కింతు ప్రకృతికోమలాః॥

టీక : ఉపమేయ + ఉపమానయోః = ఉపమేయోపమానములకు; విశేషః=భేదమును గలిగించు లక్షణము; (వర్ణితః +) చేత్=వర్ణింపబడినయెడల; వ్యతిరేకః=వ్యతిరేక మన్న యలంకారము; (స్యాత్ = అగును)॥ సన్తః = సజ్జనులు; శైలాః + ఇవ=కొండల వలె; ఉన్నతాః=ఔన్నత్యము గలవారు; కింతు =కాని; ప్రకృతి కోమలాః=స్వభావముచేత సౌకుమార్యము గలవారు.

వ్యాఖ్య : ఉపమేయోపమానములకు పోలికతోపాటు, భేదమునగూడ చెప్పినయెడల వ్యతిరేకాలంకార మగును. ఇది లక్షణము. ఉపమాద్యలంకారములలో ధర్మ సాదృశ్యము మాత్రమే చెప్పబడును. ఇచ్చటకూడ సదృశ ధర్మ ముండి తీరును; లేనియెడల ఉపమేయోపమాన భావమే పొసగదు. సదృశ ధర్మముతో పాటుగా, వ్యతిరేక ధర్మముకూడ నిచ్చట వర్ణితము కావలయును. ఈ విలక్షణత్వమును బట్టియే దీనికి వ్యతిరేకాలంకార మన్న పేరు సార్థక మగుచున్నది.

సజ్జనులు కొండల వలె నున్నతులు; కాని ప్రకృతి కోమలులు- ఇది లక్ష్యము. ఇచ్చట సజ్జనులు ఉపమేయము; కొండలు ఉపమానము; సదృశ ధర్మము ఔన్నత్యము; వలె ఉపమా వాచకము. ఇంతవరకు నిది యుపమాలంకారమునకు సామగ్రి. పూర్ణోపమ యని నిర్ణయింపవచ్చును. వర్ణ్యమునకు ప్రకృతికోమలత్వము అనునది మరియొక ధర్మము. ఉపమానమున కీ ధర్మము లేదు. దీనికి విరుద్ధమైన ప్రకృతి కఠినత్వము గలదు. కావున, ఈ ధర్మము నందు ఉపమేయోపమానములకు వ్యతిరేకత కలదు. కావుననే, యిది వ్యతిరేకాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఈ వ్యతిరేక ధర్మ మిచ్చట వర్ణ్యమున కాధిక్యమును గూర్చుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. మానుగ విషయ విషయులలోన నొక్కఁ
డధికముగఁ జెప్ప వ్యతిరేక మనఁగఁ బరఁగు;
నగముల విధంబునను సమున్నతులు గాని
ప్రకృతి కోమలు లార్యులన్నగిది శర్వ!

## 21. సహోక్త్యలఙ్కారః

53. సహోక్తి స్సహభావశ్చేద్భాసతే జనరఞ్జనః
దిగన్త మగమ త్తస్య కీర్తిః ప్రత్యర్థిభిస్సహ॥

టీక : జనరఞ్జనః=సహృదయుల కానందమును గలిగించు; సహభావః =సహితత్వము; భాసతే + చేత్=ప్రకాశించినయెడల; సహోక్తిః= సహోక్తి యన్న యలంకారము: (స్యాత్ = అగును)॥ తస్య = ఆ రాజుయొక్క; కీర్తిః= యశస్సు; ప్రత్యర్థిభిః + సహ=శత్రువులతోపాటుగా; దిక్ + అన్తమ్=దిక్కుల కొనవరకు; అగమత్=వెళ్ళెను.

వ్యాఖ్య : సహృదయ హృదయరంజకముగా సహభావము చెప్పబడిన యెడల, అది సహోక్తియగును. ఇది లక్షణము. ప్రధానముగా నొక విషయము క్రియాన్వయమును పొందుచుండగా, సహశబ్దోపాదానము చేత అప్రధానమగు నింకొక విషయమునకు కూడ క్రియాన్వయమును గలిగించుట యిచ్చట జరుగును. ఇది జనరంజకముగా కూడ నుండవలయును. ఏ యలంకారమైనను అలంకార మగుటకు జనరంజకత్వము అవశ్యలక్షణము. లక్ష

ణమునందు చెప్పినను, చెప్పకున్నను దానిని చెప్పినట్లే పరిగణించుట యవసరము.

అతని శత్రువులతోపాటుగా నతని కీర్తి దిగంతములకు వెళ్ళెను– ఇది లక్ష్యము. ఇచ్చట కీర్తి ప్రధానవిషయము. అది 'వెళ్ళెను' అను క్రియతో అన్వయమును గలిగియున్నది. 'తో పాటు' అని సహార్థకము నుపాదానము చేయుటచేత అప్రధానమగు 'శత్రువులు' కూడ క్రియాన్వయమును పొందుచున్నది. 'శత్రు పలాయనము' నిజమునకు కారణము కాగా, తత్ఫలముగా యశోవ్యాపనము జరుగుచున్నది. కారణకార్యములు రెండును సమకాలమున జరుగుచున్నవనుటచేత అక్రమాతిశయోక్తి యగునని యనిపించును. అతిశయోక్తియందు సహార్థక శబ్దోపాదానము జరుగదు. సహార్థక శబ్దోపాదానము చేతనే, ప్రకృత లక్ష్యము సహోక్తికి సరిపడుచున్నది. ఇచ్చటి అప్రధాన విషయము ప్రధానవిషయమున కుత్కర్షను చేకూర్చుటచేత, జనరంజన సామర్థ్యము స్పష్టము.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరును సహోక్త్యలంకృతి
జనరంజన మగుచుఁ దనర సహభావం బా
తని కీర్తి యాక్రమించెను
ఘన శాత్రవకోటితోడఁ గకుబంతములన్.

విమర్శ: లక్ష్యమునందు 'ఆక్రమించెను' అన్న పదము 'కీర్తి' తో అన్వయించునప్పుడు తగియుండును కాని, "శాత్రవకోటి" తో అన్వయించునప్పుడు తగదు. "ఆక్రమించుట" అన్నది రూఢిచేబట్టి పరాక్రమమును స్ఫురింపజేయును. కీర్తికి పరాక్రమస్ఫూర్తి యుచితమే; ఓడిన శత్రువులకు పరాక్రమస్ఫూర్తి యుచితము కాదుగదా! కావున వ్యాపనను స్ఫురింపజేయునట్లుగా 'ఆవరించెను' అన్న క్రియను వాడుకొన్నయెడల ప్రధానాప్రధానవిషయములకు రెండింటికి నన్వయించును.

## 22. వినోక్త్యలఙ్కారః (తద్భేదౌ)

54. వినోక్తిశ్చేద్వినా కిఞ్చిత్ప్రస్తుతం హీన ముచ్యతే,
విద్యా హృద్యాపి సావద్యా వినా వినయసమ్పదమ్॥

టీక : కించిత్ + వినా=ఒకానొక గుణము లేకపోవుటచేత; ప్రస్తుతమ్= వర్ణ్యము; హీనమ్=తక్కువదిగా; ఉచ్యతే + చేత్=చెప్పబడినయెడల; వినోక్తిః= వినోక్తియన్న యలంకారము: (స్యాత్=అగును)॥ విద్యా=విద్య; హృద్యా + అపి=మనోహరమైన దైనప్పటికి; వినయసమ్పదం + వినా=వినయసంపద లేని యెడల; సా=ఆ విద్య; అవద్యా=శ్లాఘనీయము కాదు.

వ్యాఖ్య : వినోక్తి రెండు విధములుగా నుండును. ఒకటి హేయస్వ రూప వినోక్తి; రెండవది రమ్యస్వరూప వినోక్తి. ఇచ్చట మొదటిదైన హేయ స్వరూప వినోక్తికి లక్షణ లక్ష్యములు నిరూపింపబడినవి. శ్లోకమునందు పూర్వార్ధము లక్షణము; ఉత్తరార్ధము లక్ష్యము.

ఒకానొక గుణము లేకపోవుటవత వర్ణ్యమునకు హైన్యమును చెప్పిన యెడల, అది వినోక్తియగును. ఇది లక్షణము. ఇది సహోక్తికి సరిగా విరుద్ధము. ఇచ్చటకూడ వినార్థకశబ్దము నుపాదానము చేసినప్పుడే యీ యలం కారము సిద్ధించును.

మనోహరమైనను వినయసంపద లేని విద్య శ్లాఘనీయము కాదు- ఇది లక్ష్యము. ఇచ్చట విద్య వర్ణ్యము. వినయసంపద యన్న గుణము లేకపోవుట చేత, దీనికి హీనత్వము చెప్పబడుచున్నది. కావుననే యిది లక్షణమునకు సరిపడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఇంచు కగు వస్తువును బాసి హీనముగను
ప్రస్తుతము పల్కఁ బడెనేని రహి వినోక్తి
ప్రణుతికెక్కును; వినయసంపదను బాసి
హృద్యయయ్యును విద్య యవద్య గాదె!

విమర్శ : మూలమునందలి 'కించిత్' అను శబ్దమున కల్పార్థ మిచ్చట గ్రహింపబడినది. "ఇంచు కగు వస్తువు" అన యనగా అల్పమైన వస్తువని యర్థము. కాని దీని నీ యర్థమున గ్రహించుట సరికాదు. సంస్కృతము నం దలి 'కించిత్' అను శబ్దమునకు 'కొంచెము' అన్న అర్థమేకాక, 'ఒకానొక' యన్న యర్థము సైతము కలదు. పుంలింగ విశేషణముగా కశ్చిత్, స్త్రీలింగ విశేషణముగా కాచిత్, నపుంసకలింగ విశేషణముగా కించిత్- అన్నవి వాడుక

నొందును. ఇచ్చట 'వస్తు' అన్నది అధ్యాహృతము. దానికి విశేషణముగా 'కించిత్' అన్నది యుపయుక్తము- కావున, "ఒకానొక వస్తువు" అన్న యర్థమును చెప్పుటయే సమంజసము. అధికము, అల్పము- అనువానితో నిచ్చట సంబంధము చెప్పరాదు. ఇచ్చటి యుదాహరణమునుబట్టి యైనచో విద్యయొక్క శ్లాఘనీయతకు అత్యంత ప్రధానమైనది వినయసంపద యని తెలుచున్నది. అట్టియెడల దాని నల్పముగా గ్రహించుట యుచిత మనిపించుకొనను.

రెండవ భేదము

> ౫౫. తచ్చేత్ కిఞ్చిద్వినా రమ్యం వినోక్తి స్సాపి కథ్యతే,
> వినా ఖలై ర్విభా త్యేషా రాజేన్ద్ర! భవతస్సభా॥

టీక : కిఞ్చిత్ + వినా = ఒకానొక వస్తువు లేకుండుటచేత; తత్ = వర్ణ్యము; రమ్యమ్ + చేత్ = మనోహరమైనయెడల; సా + అపి = అది కూడ; వినోక్తిః = వినోక్తి యన్న యలంకార మనియే; (సూరిభిః = పండితులచేత); కథ్యతే = చెప్పబడుచున్నది॥ రాజేన్ద్ర = ఓ మహారాజా; భవతః + సభా = నీయొక్క కొలువుకూటము; ఖలైః + వినా = దుర్జనులు లేకుండుటచేత; విభాతి = ప్రకాశించుచున్నది.

వ్యాఖ్య : ఇందు రమ్యస్వరూప వినోక్తికి లక్షణలక్ష్యములు నిరూపింపబడినవి. శ్లోకమునందలి పూర్వార్ధము లక్షణము; ఉత్తరార్ధము లక్ష్యము.

ఒకానొక గుణమునుగాని వస్తువునుగాని విడుచుటచేత, వర్ణ్యమునకు రమ్యత్వము చెప్పబడినయెడల, అది వినోక్తియగును. ఇది లక్షణము. వినార్థకత్వమే ఇచ్చటకూడ ముఖ్యము. వెనుకటి భేదమునందు ప్రకృతము హీనముగా వర్ణింపబడినది. ఈ భేదమునందు ప్రకృతము రమ్యముగా వర్ణింపబడినది. రమ్యత్వవర్ణనమునుబట్టియే ఇది రమ్యస్వరూప వినోక్తి యన్న యన్వర్థనామము నొందుచున్నది.

ఓ మహారాజా! దుష్టులు లేక నీ యీ కొలువుకూటము వెలుగొందుచున్నది- ఇది లక్ష్యము. కొలువుకూటము వర్ణ్యము. దుష్టులు లేకపోవుటవలన వర్ణ్యమునకు రమ్యత్వము గలుగుచున్నది. కావుననే ఇది రమ్యస్వరూప వినోక్తికి ఉదాహరణముగా సరిపడియున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అల్పవస్తువుఁ బాసి రమ్యమగునేని
నదియును వినోక్తి యనఁగఁ బ్రఖ్యాతికెక్కు;
ఖలజనంబులతోఁ బాసి యలరె మిగుల
నీ భవత్సభ ధరణీతలేంద్ర వంద్య!

విమర్శ: ఇచ్చట సైతము కించిదర్థమున నల్పవస్తు వనియే వాడబడి నది. వెనుక చెప్పినట్లు ఒకానొక వస్తువని యుండుటయే సమంజసము. అల్ప త్వాధికత్వములతో దీనికి ముడిపెట్టవలసిన యవసరము కానరాదు.

## 23. సమాసోక్త్యలఙ్కారః

56. సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్,
అయ మైన్ద్రీముఖం పశ్య రక్తశ్చుమ్బతి చన్ద్రమాః॥

టీక: ప్రస్తుతే=వర్ణ్యమునందు; అప్రస్తుతస్య=అవర్ణ్యముయొక్క; పరి స్ఫూర్తిః + చేత్= పరిస్ఫురణ మున్నయెడల; సమాసోక్తిః = సమాసోక్తియన్న యలంకారము; (స్యాత్=అగును)॥ పశ్య=చూడు; అయమ్ + చన్ద్రమాః= ఈ చంద్రుడు; రక్తః=అనురాగముగలవాడై, ఎఱ్ఱదనముగలవాడై; ఐన్ద్రీ=ఇంద్రు నకు సంబంధించిన స్త్రీయొక్క, తూర్పుదెసయొక్క; ముఖమ్ = ముఖమును; చుమ్బతి=ముద్దుగొనుచున్నాడు, స్పృశించుచున్నాడు.

వ్యాఖ్య: ప్రస్తుతమును వర్ణించుచుండగా అప్రస్తుతమునకు స్ఫురణము కలిగినయెడల, అది సమాసోక్తి యన్న యలంకార మగును. ఇది లక్షణము. సమాసము అని యనగా సంగ్రహము అని యర్థము. ప్రస్తుతమును, అప్రస్తుత మును సంగ్రహముగా వర్ణించుటచేత దీనికి సమాసోక్తి యన్న పేరు సార్థక మగుచున్నది.

చూడు! ఈ చంద్రుడు రక్తుడై ఐంద్రీముఖమును చుంబించుచున్నాడు. ఇది లక్ష్యము. చంద్రోదయము ప్రస్తుతవిషయము. చంద్రబింబము ఎఱ్ఱనై తూర్పుదిక్కును స్పృశించుచున్నది. యథార్థమిది. కాని పై వాక్యమునందు విషయాంతర స్ఫురణమునకు దోహదము లభించుచున్నది. 'చన్ద్రమాః' అన్న పుంలింగ సారస్యముచేత 'నాయకుడు' స్ఫురించుచున్నాడు. 'రక్తః' అని

యనుటచేత శోణవర్ణము కలిగియుండుట యన్న యర్థమే కాక అనురాగము కలిగియుండుట యన్న యర్థముకూడ శ్లేష సామర్థ్యముచేత లభించుచున్నది. "ఐన్ద్రీముఖమ్" అని వాడుట నాయికాముఖ స్ఫురణము కలిగించుచున్నది. "ఐన్ద్రీ" అని యన్నప్పుడు "తూర్పుదెస" యన్న యర్థమేకాక 'ఇంద్రునకు సంబంధించిన స్త్రీ' యన్న యర్థముకూడ స్ఫురించుచున్నది. 'స్పృశతి' అన్న శబ్దముతో సరిపోయెడిదానికి 'చుమ్బతి' యన్న పదము వాడబడినది. దీని వలన 'చుంబనక్రియ' స్ఫురించుచున్నది. తన్మూలముగా వెనుక చెప్పుకొనిన నాయికానాయక ప్రసంగము ప్రతీత మగుచున్నది. చంద్రుడు నాయకుడు. నాయిక 'చాంద్రి' యైనయెడల ఇది స్వకీయ యయ్యెడిది. ఇది "ఐంద్రి" యగుటచే పరకీయ యగుచున్నది. దీనినిబట్టి మొత్తముమీద 'ఒకనాయకుడనురాగముతో పరాంగనా ముఖమును చుంబించుచున్నాడు" అన్న విషయాంతరము స్ఫురించుచున్నది. ఇట్లు విషయముతోపాటు విషయాంతరము గూడ స్ఫురించునట్లుగా సంక్షేపించి చెప్పుటచేత, ఇది సమాసోక్తికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ప్రస్తుతంబు వచింప నప్రస్తుతంబు
దోఁచునేని సమాసోక్తి యేచుఁగృతుల;
ముద్దుగొనియెడి నీయైంద్రిముఖముఁ జూడు!
రక్తుఁ డగుచు నిశీథినీరమణుఁ డనఁగ.

## 24. పరికరాలఙ్కారః

57. అలఙ్కారః పరికర స్సాభిప్రాయ విశేషణైః,
సుధాంశుకలితోత్తంస స్తాపం హరతు వశ్శివః॥

టీక : సాభిప్రాయ విశేషణైః = అభిప్రాయ గర్భితములైన విశేషణములతో; (యః + యుక్తః = ఏది కూడియున్నదో); (సః = అది); పరికరః + అలఙ్కారః = పరికరమన్న యలంకారము; (స్యాత్ = అగును)॥ సుధాంశు + కలిత + ఉత్తంసః = అమృతకిరణుడైన చంద్రుని శిరోభూషణముగా గల; శివః = ఈశ్వరుడు; వః = మీయొక్క; తాపమ్ = తాపమును; హరతు = హరించునుగాక.

వ్యాఖ్య : సాభిప్రాయ విశేషణములతో కూడియున్న యెడల పరికరాలంకార మగును. ఇది లక్షణము. పరికర మని యనగా సాధనమని యర్థము. ప్రకృతమైన సిద్ధికి సాధనమైన యభిప్రాయము విశేషణము మూలమున వ్యక్తము చేయబడుట యిచ్చట జరుగును. విశేషణము పరికరముగా నుపయోగించుటచేత, దీనికి పరికరాలంకార మన్న పేరు సార్థకముగా నున్నది.

శీతాంశుశేఖరుడైన శివుడు మీ తాపమును హరించును గాక- ఇది లక్ష్యము. తాపహరణము సిద్ధి. ఇది జరుగుటకు సాధనము శీతాంశు కలితత్వము. శివుడు అనేక విశేషణములను కలిగియున్నాడు. పార్వతీపతి, నాగభూషణుడు, వ్యోమకేశుడు, గజచర్మాంబరధారి మొదలయిన విశేషణములు తాపహరణ సామర్థ్యమును ద్యోతనము చేయవు. చంద్రశేఖరుడైన శివుడు తాపమును హరింపగలడు. చంద్రు డనుటకు శీతాంశు డనుట మరింత యుచితమై యున్నది. చల్లని కిరణములు గలిగిన చంద్రుడు తన శిరసున నుండుటచే, తాను చల్లదనమును గూర్పగలడు; తాపమును హరింపగలడు. ఇట్లు శీతాంశు కలితోత్తంసు డన్నది శివునకు విశేషణమై ప్రకృతమున కుపయోగపడు నభిప్రాయమును వ్యక్తము చేయుటచేత, ఇది పరికరాలంకారమునకు లక్ష్యముగా సరిపడియున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. సాభిప్రాయవిశేషణ
మై భాసిల్లినను బరికరాలంకృతి నా
శోభిల్లు; మాకు హిమధా
మాభరణుండు శివుండు తాప మడంచు నను్రకియన్.

## 25. పరికరాఙ్కురాలఙ్కారః

58. సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాఙ్కురః,
చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః॥

టీక : విశేష్యే + తు=విశేష్యము; సాభిప్రాయే (సతి)=సాభిప్రాయ మగుచుండగా; పరికరాఙ్కురః=పరికరాంకుర మన్న యలంకారము; భవేత్=అగును॥ చతుర్ణామ్=నాలుగ; పురుషార్థానామ్=పురుషార్థములకు; దాతా=దాత; దేవః=దేవుడగు; చతుర్భుజః=చతుర్భుజుడు.

వ్యాఖ్య : సాభిప్రాయమైన విశేష్యముతో కూడియున్న యెడల, అది పరికరాంకుర మన్న యలంకార మగును. ఇది లక్షణము. పరికరమునందు విశేషణము సాభిప్రాయముగా నుపయోగపడును. పరికరాంకురము నందు విశేష్యము సాభిప్రాయముగా నుపయోగపడును. అనగా ప్రకృతమైన సిద్ధికి సాధనమైన యభిప్రాయము విశేష్యము మూలమున వ్యక్తము చేయుబడును. పరికరము యొక్క యంకురము అనగా పరికరాలంకారము నుండి చిన్నమార్పు చేత పుట్టిన యలంకార మగుటచే, దీనికి పరికరాంకుర మన్న పేరు అన్వర్థ మగును.

నాలుగు పురుషార్థములకు దాత దేవు డగు చతుర్భుజుడు- ఇది లక్ష్యము. ఇచ్చట 'చతుర్భుజుడు' అన్నది విష్ణువునకు గల యనేక నామములలో నొకటి. అమరకోశమునందు 'ఉపేన్ద్ర ఇన్ద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః' మొదలయిన విధముగా చతుర్భుజ శబ్దము విష్ణునామావళియందు పేర్కొనబడినది. కావున 'చతుర్భుజుడు' విశేష్యము: దేవుడు విశేషణము. ఇచ్చట ప్రకృతమైన సిద్ధి చతుర్విధ పురుషార్థ దానము. ధర్మము, అర్థము, కామము, మోక్షము- అన్నవి పురుషార్థములు. ఈ నాలుగింటి నొసంగుటకు నాలుగు చేతులుగల దేవుడు సమర్థు డగును. అట్టి సమర్థుడు చతుర్భుజుడు. చతుర్భుజత్వముచేత చతుర్విధ దాన సామర్థ్యము ద్యోతన మగుచున్నది. విశేష్యము నందు గర్భితమైయున్న యభిప్రాయము ప్రకృతకార్యమునకు సాధన మగుచుండుట చేత, ఇది పరికరాంకురమునకు లక్ష్యమగుచున్నది.

దీని నిట్లు గాక, "నాలుగు పురుషార్థములకు దాత చతుర్భుజు డగు దేవుడు" అన్నట్లు అన్వయించినయెడల 'దేవుడు' విశేష్యమై "చతుర్భుజుడు" విశేషణమై పోవును. అప్పుడు సాభిప్రాయ విశేషణ సామర్థ్యమునుబట్టి, యిది పరికరాలంకార మైపోవును, కావున అన్వయమునందు జాగరూకత వహించుట యవసరము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అది యభిప్రాయ యుత విశేష్యముగఁ జెప్పఁ
బరికరాంకుర మనఁగను బ్రణుతి కెక్కు;

భువిఁ జతుర్విధపురుషార్థములకు దాత
దేవుఁడు చతుర్భుజుండను రీవిఁ గృతుల.

## 26. శ్లేషాలఙ్కారః (తద్భేదాః)

59. నానార్థ సంశ్రయః శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః,
సర్వదో మాధవః పాయాత్స యోఽగం గామదీధరత్॥

టీక : వర్ణ్య + అవర్ణ్య + ఉభయ + ఆశ్రితః = ప్రకృతాశ్రితము అప్రకృతాశ్రితము ఉభయాశ్రితము (అని); శ్లేషః = శ్లేషాలంకారము; నానా + అర్థ + సంశ్రయః = అనేకములైన యర్థముల నాశ్రయించుకొని యుండును॥ యః = ఎవరు; అగమ్ = పర్వతమును; గామ్ = భూమిని; అదీధరత్ = ధరించెనో; సః = అతడు; సర్వదః = అన్నింటి నిచ్చునటువంటి; మాధవః = లక్ష్మీపతి యైన విష్ణువు; పాయాత్ = కాపాడును గాక॥ యః = ఎవరు; గఙ్గామ్ = గంగను; అదీధరత్ = ధరించెనో; సః = అతడు; ఉమాధవః = పార్వతీపతియైన శివుడు; సర్వదా = ఎల్లప్పుడు; పాయాత్ = కాపాడును గాక.

వ్యాఖ్య : ఇందు పూర్వార్థమున శ్లేషాలంకార లక్షణమును, శ్లేషభేదములనుగూడ తెలిపెను. అనేకార్థముల నాశ్రయించుకొని యుండినయెడల శ్లేషాలంకార మగును. ఇది శబ్దము నాధారముగాఁ జేసికొని యేర్పడిన యలంకారమగుటచే శబ్దపరివృత్తిని సహింపదు. ఒకమాటకు బదులుగా, అదే యర్థము గల యింకొకమాటను వాడుట కిచ్చుట వీలు కాదు. శ్లేషాలంకారమునకు శబ్దమాధారమైనట్లే అర్థముకూడ ఆధారమైయున్నది. అందువలననే కొందరు శ్లేషము నుభయాలంకారముగా పరిగణించిరి. చంద్రాలోక కర్త 'నానార్థ సంశ్రయః శ్లేషః' అని యనుటచేత 'నానార్థముల నాశ్రయించిన శబ్దములను గలది శ్లేషము' అన్నదే తాత్పర్య మగుచున్నది.

ఇది మూడు విధములుగా నుండును. ప్రకృతము నాశ్రయించుకొన్నది ప్రకృతశ్లేషము. అప్రకృతము నాశ్రయించుకొన్నది అప్రకృతశ్లేషము. ప్రకృతాప్రకృతములను రెంటి నాశ్రయించుకొన్నది ప్రకృతాప్రకృత శ్లేషము.

ఈ శ్లోకమునందలి ద్వితీయార్ధము ప్రకృతశ్లేషమునకు లక్ష్యము. చెప్పబడిన యర్థములు ప్రకృతములకే యుపయుక్తములైన యెడల ప్రకృత

శ్లేష మగును. 'సర్వదో మాధవః పాయాత్స యో గఙ్గా మదీధరత్' అన్నది రెండు విధములుగా విభక్తము కావచ్చును. యః, అగం, గాం, అదీధరత్, సః, సర్వదః, మాధవః, పాయాత్- అన్నది విష్ణు పరముగా నన్వయించును. 'ఎవరు గోవర్ధన పర్వతమును భూమిని ధరించెనో అతడు సర్వదు డగు మాధవుడు రక్షించును గాక" అని యర్థము. శివపరముగా నన్వయించునపుడు యః, గఙ్గాం, అదీధరత్, సః; సర్వదా, ఉమాధవః, పాయాత్- అన్నది విభాగము. కేశవపరమగు నర్థము, శివపరమగు నర్థము భక్తు డగువానికి ప్రకృతములే. అందువలననే యిది ప్రకృతశ్లేషమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అర్థములు రెండు ప్రకృతంబు లయ్యెనేనిఁ
దనరు నది ప్రకృతశ్లేషమనఁగఁ గృతులఁ
బ్రకృతమున నప్రకృతము చూపట్టె నేని
నదియు యప్రకృతశ్లేష మగు మహేశ !

క. ప్రకృతార్థంబును మఱి య
ప్రకృతార్థముఁ దోఁచెనేని భాసిలుఁ బ్రకృతా
ప్రకృతశ్లేష యనంగను
ముకుటీకృత శిశిరకిరణ ! మునినుత చరణా !

గీ. మమ్ముఁ బుష్కర నేత్రుండు మాధవుండు
భువనరక్షణ చతురాత్మ భుజ పటిష్ఠుఁ
డసమ బాణాంతకుఁడు కలాపావతంసుఁ
డవనివాసుఁడు ప్రోవుత ననుదినంబు.

విమర్శ : సంస్కృత మూలమునందు శ్లేషము మూడు విధములుగా నుండునని విభాగించుటయే జరిగెను. కాని వేర్వేఱుగా లక్షణము నిరూపితము కాలేదు. అందువలన ఆంధ్రచంద్రాలోక కర్త పైనున్న మొదటి రెండు పద్యములందును లక్షణ నిరూపణము చేయుచున్నాడు. రెండర్థములును ప్రకృతములైన యెడల ప్రకృతశ్లేషము. ప్రకృతమును చెప్పగా అప్రకృతము స్ఫురించునెడల అప్రకృతశ్లేషము. ప్రకృతాప్రకృతములు రెండును స్ఫురించు

నేని (గ్రాహ్యము లగునేని) ప్రకృతా ప్రకృతశ్లేషము. విభాగములకు లక్షణ వివరణము జరిగెనే కాని, శ్లేషాలంకారమునకు మొత్తముమీద లక్షణమైన 'నానార్థ సంశ్రయత్వము' ఆంధ్రచంద్రాలోకమునందు చెప్పబడలేదు. పైని చూపిన మూడింటి లక్షణముచేత, అది గతార్థ మగునని సూరకవి యభిప్రాయము కావచ్చును.

మూడవ పద్యము ప్రకృతశ్లేషమునకు లక్ష్యము. పుష్కరనేత్రుఁడు భువన రక్షణ చతురాత్మ భుజపతిష్ఠుఁడు అసమ బాణాంతకుఁడు కలాపావతంసుఁడు అవనివాసుఁడు మాధవుఁడు మమ్మనుదినము ప్రోవుత- ఇది శివకేశవుల కిరువురకు నన్వయించును. శివుని పరముగా మొదట చూతము: పుష్కరమన్న సర్పమును వస్త్రముగా కలవాడు, భువనరక్షణచతురమైన యాత్మభుజపతిష్ఠత గలవాడు, అసమ బాణుడైన మన్మథుని నంతమొందించిన వాడు, ('కలానాం పతిః కలాపః' అని యగుటచేత) చంద్రుని శిరోభూషణముగా కలవాడు, అవనియంతట నిండి యుండువాడు నయిన ఉమాధవుడు మమ్ము రక్షించును. విష్ణు పరముగా చెప్పినప్పుడు: పద్మములవంటి కన్నులు గలవాడు, భువన రక్షణకై చతుర్భుజ పతిష్ఠత కలవాడు, అనుపముడైన బాణాసురుని నంతమొందించినవాడు, కలాపమని యనగా నెమలిఫింఛమును శిరోభూషణముగా ధరించినవాడు, (అవనము అని యనగా సుఖ మని యర్థము. కాబట్టి సుఖము గలిది స్వర్గము) స్వర్గమును నివాసస్థలముగా కలవాడు నయిన మాధవుడు మమ్ము రక్షించును- అని యగును. ఇచ్చట శివస్తుతియు కేశవస్తుతియు వర్ణ్యములే యగుటచేత, ఇది ప్రకృతశ్లేషమున కుదాహరణముగా సరిపడియున్నది.

60. అబ్జేన త్వన్ముఖం తుల్యం హరిణాహితసక్తినా,
ఉచ్చరద్భూరికీలాల శ్శుశుభే వాహినీపతిః॥

టీక : హరిణా=సూర్యునితో; ఆహిత=ఉంచబడిన; సక్తినా=ఆసక్తినిగల; అబ్జేన=పద్మముతో॥ హరిణ=లేడిచేత; ఆహితసక్తినా=ఉంచబడిన యాసక్తిగల; అబ్జేన=చంద్రునితో; త్వత్ + ముఖమ్=నీయొక్క ముఖము: తుల్యమ్ = సమానము॥ ఉచ్చరత్=పై కెగయుచున్న; భూరి=విస్తారమైన; కీలాలః=జలములు గలవాడయిన: వాహినీపతిః=నదీనాథుడైన సముద్రుడు॥ కీలాలః=నెత్తురు గలవాడయిన; వాహినీపతిః=సేనా నాయకుడు; శుశుభే=శోభించెను.

వ్యాఖ్య: ఇందు పూర్వార్ధము అప్రకృతశ్లేషమునకు లక్ష్యము; ఉత్తరార్ధము ప్రకృతాప్రకృతశ్లేషమునకు లక్ష్యము.

ప్రకృతమును చెప్పగా అప్రకృతముకూడ స్ఫురించినయెడల అప్రకృత శ్లేష మగునన్నది లక్షణము. 'అబ్జముతో నీముఖము సమానము' అని యన్నప్పుడు అబ్జ శబ్దమునకున్న యర్థద్వయమువలన 'పద్మముతో నీముఖము సమానము' అన్న యర్థమును, 'చంద్రునితో నీముఖము సమానము' అన్న యర్థాంతరమునుగూడ చెప్పవచ్చును. ఇది యింతటితో ఆగలేదు. అబ్జ శబ్దమునకు విశేషణముగా "హరిణాహితసక్తి" అన్నది ప్రయుక్తమైనది. "హరిణా + అహిత సక్తి" యన్నది పద్మపరమైన విభాగము. ఇచ్చట 'హరిణా' అని అన్నప్పుడు 'సూర్యునిచేత' అన్నది యర్థము. ఇది తృతీయాంతము. చంద్ర పరమైన యర్థము నందు 'హరిణ + అహితసక్తి' యన్నది విభాగము. ఇచ్చట 'హరిణ' అన్నప్పుడు "లేడిచేత" నని యర్థము. కాని యిచ్చట ప్రాతిపదికమాత్రమే ప్రయుక్తమైనది. వర్ణ్యము ముఖము. దీని కుపమానముగా పద్మము ప్రయుక్తమైనది. అర్థాంతరముగా చంద్రుడు కూడ స్ఫురించును. ఇట్లు ప్రకృతమైన యర్థముతోపాటు, అప్రకృతమైన యర్థముకూడ స్ఫురించుచుండుటచేత, ఇది యప్రకృతశ్లేష మగును. నిజమున కిచ్చటి అప్రకృతార్థమును గ్రహించుట వలన వర్ణ్యమునకు విశేషప్రయోజన మేమియులేదు.

ప్రకృతాప్రకృతములను రెండింటిని గ్రహించినచో ప్రకృతాప్రకృత శ్లేష మగు నన్నది లక్షణము. ఉచ్చరద్భూరి కీలాలుడైన వాహినీపతి శోభించెను- అన్నది లక్ష్యము. ఇదియొక సేనాధిపతి వర్ణనము. పైకి వెలువడుచున్న యధికరక్తముగల సేనాధిపతి శోభించెను- అన్నది ప్రకృతము. పైకి పొంగుచున్న యధికజలముగల నదీనాథుడగు సముద్రుడు శోభించెను- అన్నది అప్రకృతము. ప్రకృతాప్రకృతముల కిచ్చట ఉపమేయోపమాన భావసంబంధము గోచరించుచున్నది. ప్రకృతార్థముతో పాటుగా అప్రకృతార్థము కూడ నిట్లు గ్రహింపబడుచుండుటచే, ఇది ప్రకృతాప్రకృతశ్లేషమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అబ్జ సుందరముఖ ప్రవాళాధరోష్ఠి
కాంచనాభాంగి యచలోరు కటి యనంగ;

నుచ్చలదుర్వారి కీలాలుఁ డొనరె వాహి
నీశ్వరుం డను భంగిని గృతుల శర్వ !

విమర్శ : ఇందు పూర్వార్ధము అప్రకృతశ్లేష లక్ష్యము. అబ్జ శబ్దము నకు పద్మము, చంద్రుడు- అన్నవి యర్థములు. ప్రవాళము అని యనగా చిగురు, పగడము- అన్నవి యర్థములు. కాంచనము అని యనగా బంగారము, సంపెంగ- యన్నవి యర్థములు. 'అచల' యన్నప్పుడు భూమి యనియు 'అచలము' అని యన్నప్పుడు కొండ యనియు నర్థములు. ఇందు మొదటి యర్థములు ప్రకృతములై ముఖాది వర్ణ్యములకు ఉపమానములుగా వ్యవహరించును. మిగిలినవానిని గూడ ఉపమానములుగా గ్రహింపవచ్చును. కాని క్రొత్త సొగసుమాత్ర మేమియును గలుగదు. అవసరము లేని యప్రకృత స్ఫురణము వలననే, యిది యప్రకృతశ్లేషమునకు లక్ష్య మగుచున్నది.

ఉత్తరార్ధము ప్రకృతాప్రకృతశ్లేషమునకు లక్ష్యము. మూలము నందలి లక్ష్యమే యిచ్చట గ్రహింపబడినది.

## 27. అప్రస్తుతప్రశంసాలఙ్కారః

**61.** అప్రస్తుత ప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా,
ఏకః కృతీ శకున్తేషు యోఽన్యం శక్రాన్న యాచతే॥

టీక : యత్ర = ఎచ్చట; అప్రస్తుత ప్రశంసా = అప్రస్తుతము యొక్క ప్రశంస; ప్రస్తుతాశ్రయా (భూత్వా)= ప్రస్తుతము నాశ్రయించుకొన్నదై; స్యాత్ = జరుగునో; సా= అది; (అప్రస్తుత ప్రశంసా స్యాత్= అప్రస్తుత ప్రశంస యన్న యలంకార మగును)॥ యః= ఏది; శక్రాత్ + అన్యమ్ = ఇంద్రునికంటె నితరుని; న + యాచతే= యాచింపదో; (స +) ఏకః= అదియొక్కటే; శకున్తేషు = పక్షులయందు: కృతీ = ధన్యము.

వ్యాఖ్య : ప్రస్తుతము నాశ్రయించుకొని యప్రస్తుతమును దలచిన యెడల, అది యప్రస్తుతాలంకారమగును. ఇది లక్షణము. ఇది సరిగా సమాసోక్తికి విరుద్ధముగా వర్తించును. సమాసోక్తియందు ప్రస్తుతమును పేర్కొనగా ప్రస్తుతము స్ఫురించును. మొత్తముమీద రెండింటియందును ప్రకృతాప్రకృతములను రెండింటిని సంశ్లేషించుటయే జరుగును. అప్రస్తుతమును ప్రశంస

చేయుట యిందు జరుగును. కావున అప్రస్తుత ప్రశంస యన్నపేరు అన్వర్థ మగుచున్నది.

ఇంద్రుని దప్ప నింకొకని యాచింపని పక్షి యొక్కటియే పక్షులలో ధన్యము- ఇది లక్ష్యము. చాతకము మేఘమునుండి వర్షపు బిందువులను మాత్రమే గ్రహించును. అంతవరకు నది యితరజలమును ముట్టదు. వర్షమును కురియించువాడు ఇంద్రుడు. కావున వానచినుకలకై చాతక మింద్రుని మాత్రమే యాచించును. ఇతరులను యాచింపవలసిన యవసరమే దానికి లేదు. ఇది యంతయు నిజమున కప్రస్తుత విషయము. దీనివలన ప్రస్తుతమొకటి స్ఫురించుచున్నది. రాజాధిరాజయిన వానిని దప్ప నంతకు తక్కువైన వానిని యాచింపని యాచకుడు ప్రస్తుతవిషయము. ప్రకృతమైన యాచక ప్రశంసయే ముఖ్యము; కాని అప్రకృతమైన చాతకప్రశంస చేయుటచేత పర్యవసానముగా యాచక ప్రశంస స్ఫురించుచున్నది. పక్షులలో ఇంద్రుని దప్ప నితరులను యాచింపని పక్షి ధన్యమైనట్లే యాచకులలో రాజాధిరాజును దప్ప నితరులను యాచింపని యాచకుడు ధన్యుడన్నది తాత్పర్యార్థము. అయినను అప్రస్తుతము మాత్రమే ప్రశంసింపబడుటచేత, ఇది అప్రస్తుత ప్రశంసకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఎచటనేఁ బ్రస్తుతాశ్రయ మేని నదియ
జగతి నప్రస్తుత ప్రశంస యనఁ బరఁగు;
ఖగకులము నందు సుకృతి యొక్కటియ యొరుని
వేఁడ దయ్యది దేవతా విభునిఁ దక్క.

విమర్శ : ఇందు లక్షణభాగము మూలమునకు ముక్కకు ముక్క యనువాదముగా నున్నది. భావము సులభగ్రాహ్యముకాదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ప్రస్తుతము నాశ్రయించి యప్రస్తుతమును
దలఁప నగునది యప్రస్తుత ప్రశంస;
ఇంద్రు విడనాడి పరుని యాచింపనట్టి
పక్షి యొకటియే ధన్యంబు పక్షులందు.

## 28. ప్రస్తుతాఙ్కురాలఙ్కారః

62. ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాఙ్కురః
కిం భృఙ్గ! సత్యాం మాలత్యాం కేతక్యా కణ్టకేద్ధయా॥

టీక : ప్రస్తుతేన=ప్రస్తుత వర్ణనముచేత; ప్రస్తుతస్య=ప్రస్తుతమైన మరొక విషయముయొక్క; ద్యోతనే (సతి)=స్ఫురణము కలిగినయెడల; ప్రస్తుతాఙ్కురః=ప్రస్తుతాంకుర మన్న యలంకారము; (స్యాత్=అగును)॥ భృఙ్గ=ఓ మధుపమా; మాలత్యాం సత్యామ్=మాలతీలత యుండగా; కణ్టకేద్ధయా=ముండ్లతో నిండిన; కేతక్యా=మొగలితో; కిమ్=ఏమి ?

వ్యాఖ్య : ప్రస్తుతమును వర్ణింపగా ప్రస్తుతాంతరము స్ఫురించు నెడల, అది ప్రస్తుతాంకురాలంకార మగును. ఇది లక్షణము. ప్రస్తుతమునుండి పుట్టిన మరియొక ప్రస్తుతము విషయ మగుచుండుటచేత ఈ యలంకారమునకు ప్రస్తుతాంకుర మన్నపేరు సార్థకముగా నున్నది.

ఓయి మధుపమా ! మాలతి యుండగా కంటకాశ్రయమైన కేతకితో నీ కేమిపని ? ఇది లక్ష్యము. ఇది యొక నాయిక తన నాథునితో ననుచున్న వాక్యము. ఇచ్చట పరిసరముకూడ ముఖ్యము. ఒక మధుపము మాలతిని విడిచిపెట్టి మొగలిపై వ్రాలుట కెగురుచున్న సమయమున నాయిక యీమాట లనుచున్నది. కావున, ఇది ప్రస్తుతవర్ణనమే యగును. కాని యింతమాత్రమే యామె యభీష్టము కాదు. తన భర్త తన్ను విడిచి, కడగండ్ల కాశ్రయమైన పరస్త్రీ నపేక్షించుచున్నాడు. దానినిగూడ స్ఫురింపజేయవలయును. అదియును ప్రస్తుత విషయమే; అపేక్షితమే. ప్రస్తుతమును వర్ణింపగా, దానికి మూలకమైనట్లు మరొక ప్రస్తుతముకూడ స్ఫురించుచుండుటచేత, ఇది ప్రస్తుతాంకురాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

సమాసోక్తియందు ప్రస్తుతమును వర్ణింపగా అప్రస్తుతము స్ఫురించును. ప్రస్తుతాంకురమునందు ప్రస్తుతమును వర్ణింపగా మరొక ప్రస్తుతము స్ఫురించును. ఇంతకును ఏది ప్రస్తుతము, ఏది యప్రస్తుతము- అన్నవానిని నిర్ణయించుటను బట్టి యీ రెండింటికిని భేదము నిర్ణయింపవచ్చును. ఈ నిర్ణయమునకు సందర్భము సహకరించును.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ప్రస్తుతం బగుదానిచేఁ బ్రస్తుతంబు
తనరెనేఁ బ్రస్తుతాంకుర మనఁగ బరఁగు;
మాలతీలత గలుగంగ మధుప ! నీకుఁ
గంటక నిషేధ కేతకీ కాంక్ష యేల ?

## 29. పర్యాయోక్తాలఙ్కారః (తద్భేదాః)

63. పర్యాయోక్తం తు గమ్యస్య వచో భఙ్గ్యన్తరాశ్రయమ్,
నమ స్తస్మై కృతౌ యేన ముధా రాహు వధూ కుచౌ॥

టీక : గమ్యస్య=గమ్యార్థముయొక్క (ఉద్దేశించిన యర్థముయొక్క); భఙ్గ్యన్తరాశ్రయమ్ = అన్యరూపము నాశ్రయించుకొన్న; వచః = వాక్యము; పర్యాయోక్తం + తు=పర్యాయోక్త మన్న యలంకారము; (స్యాత్=అగును)॥ యేన=ఎవనిచేత; రాహు వధూ కుచౌ=రాహువుయొక్క భార్యయొక్క రెండు స్తనములును; ముధా కృతౌ = వ్యర్థములు చేయబడినవో; తస్మై = వానికి; నమః=నమస్కారము.

వ్యాఖ్య : ఉద్దిష్టమైన యర్థమును భంగ్యంతరముగా వెల్లడించినచో, అది పర్యాయోక్తాలంకార మగును. ఒక విధముగా చెప్పవలసిన వాక్యమును మరొక విధముగా చెప్పుట భంగ్యంతర వచనము. సాధారణమైన పద్ధతిని గాక అన్యపద్ధతి ననుసరించుట యిందు జరుగును. ఒక వచనము నాశ్రయించి ఉక్తము కావలసినది, దానికి పర్యాయమైన వచనము నాశ్రయించి ఉక్త మగుటచేత, దీనికి పర్యాయోక్త మన్న పేరు తగియున్నది.

రాహు వధూ కుచములను నిష్ఫల మొనరించిన వానికి నమస్కారము- ఇది లక్ష్యము. కుచములను నిష్ఫల మొనరించుట యుద్దిష్టార్థము కాదు. స్త్రీకుచములు భర్తృ భోగ్యములు. భోగ్యములు కావలసినవి భోగ్యములు కాకుండుటయే నిష్ఫలత్వము. భోగ్యములు కాకుండుటకు హేతువు నాలోచింపవలయును. విష్ణువు రాహువును ఖండింపగా, శిరస్సు మాత్రమే రాహువునకు మిగిలినది. అతడు శిరోమాత్రావశేషుడై జీవించియున్నాడు. ఆలింగనాది సౌఖ్యసాధనములైన హస్తాదు లాతనికి లేవు. కావుననే రాహు వధూ కుచము

లకు నిష్ఫలత్వము ప్రాప్తించినది. కాఁబట్టి 'రాహువును శిరోమాత్రావశేషుని గావించిన విష్ణువునకు నమస్కారము' అన్నది యుద్దిష్టార్థము. అట్లు చెప్పక దానిని భంగ్యంతరముగా చెప్పుటచేత, ఇది పర్యాయోక్తాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అమర భంగ్యంతరమున గమ్యార్థ సిద్ధి
యది చెలంగుఁ బర్యాయోక్త మనఁగఁ గృతుల;
వందనం బిదె యతని కెవ్వానిచే ము
ధాకృతము లయ్యె రాహువధూ కుచములు.

రెండవ భేదము

64. పర్యాయోక్తం తదప్యాహు ర్యద్వ్యాజే నేష్టసాధనమ్,
యామి చూతలతాం ద్రష్టుం యువాభ్యా మాస్యతా మిహ॥

టీక: వ్యాజేన=మిషచేత; ఇష్ట సాధనమ్=ఇష్టమును సాధించుకొనుట; యత్=ఏదియో; తత్=దానిని; పర్యాయోక్తమ్ (+ఇతి)=పర్యాయోక్తమని; (సూరయః=పండితులు); ప్రాహుః=చెప్పుదురు॥ చూతలతామ్=మామిడి మొలకను; ద్రష్టుమ్=చూచుటకు; యామి=వెళ్ళుచున్నాను; ఇహ=ఇచ్చటనే; యువాభ్యామ్+ఆస్యతామ్=మీరిరువురు నుండుడు.

వ్యాఖ్య: ఏదో యొక మిషచేత ఇష్టసాధనము చేసినట్లు వర్ణించిన యెడల, అది పర్యాయోక్తాలంకార మగును. ఇచ్చటకూడ ఉద్దిష్టఫల మొకటియై యుండగా, మాటలయందు మరొకటి చెప్పుట జరుగుచున్నది. ఒకదానిని చెప్పవలసియుండగా, దానికి పర్యాయమైన మరొకదానిని చెప్పుట యిచ్చట జరుగుచున్నది. కావుననే పర్యాయోక్తము అనుపేరు దీనికిసైతము అన్వర్థ మగుచున్నది.

నేను మామిడి మొలకను చూచుటకు పోవుచున్నాను; మీ రిరువురు నిచ్చటనే యుండుడు- ఇది యొక చెలికత్తె నాయికానాయకుల కేకాంతమును గలిగించుటకై యన్న వాక్యము. తాను సన్నిధానమునందుండగా నాయికానాయకుల యథేచ్ఛ విహారము సాధ్యము కాదు. కావున, తా నచ్చట

నుండి దూరముగా పోవలయును. అట్లు పోవుటకు చూతలతికా దర్శనము ఫలముగా చెప్పుచున్నది. ఇది నెపము మాత్రమే. నిజమున కిచ్చటి ఫలము ఏకాంత సాధనమే. 'మీ కేకాంతమును గల్పించుటకై నేను వెళ్ళుచున్నాను' అని యన్నయెడల యథార్థమగును. అట్లుకాక 'మామిడి మొలకను చూచుటకై వెళ్ళుచున్నాను' అన్న మిషతో ఏకాంతకల్పనము చేయుట జరిగినది. కావున, ఇది పర్యాయోక్తాలంకారమునకు లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. వ్యాజమున నిష్టసాధనం బయ్యెనేని
నదియుఁ బూర్వోదితాలంక్రియయ యఁటందు
రిచట మీ రిర్వు రుండుఁడి యేను మావి
గున్నఁ గనుఁగొని వచ్చెద నన్న మాడ్కి.

## 30. వ్యాజస్తుత్యలఙ్కారః (తద్భేదాః)

68. ఉక్తిర్వ్యాజ స్తుతి ర్నిన్దా స్తుతిభ్యాం స్తుతి నిన్దయోః,
కస్స్వర్ధుని ! వివేకస్తే నయసే పాపినో దివమ్॥

టీక : నిన్దా స్తుతిభ్యామ్ = నిందచేతను స్తుతిచేతను; స్తుతి నిన్దయోః = స్తుతియొక్కయు నిందయొక్కయును; ఉక్తిః = చెప్పుట; వ్యాజస్తుతిః = వ్యాజస్తుతి యలంకారము; (స్యాత్ = అగును)॥ స్వర్ధుని = ఓ గగన గంగా; తే = నీకు; వివేకః = జ్ఞానము; కః = ఏమి; పాపినః = పాపాత్ములను; దివమ్ = స్వర్గమునకు; నయసే = తీసికొని పోవుచున్నావు.

వ్యాఖ్య : నిందాస్తుతులచేత స్తుతి నిందలు చేసినయెడల వ్యాజస్తుతి యగునని లక్షణము. ఇందు రెండంశములు కలిసియున్నవి; వీనినిబట్టి వ్యాజస్తుతి రెండు భేదములను కలిగియుండును. నిందా వ్యాజమున స్తుతిని గావించుట వ్యాజస్తుతి యందలి మొదటి భేదము. స్తుతి వ్యాజమున నిందచేయుట వ్యాజస్తుతి యందలి రెండవ భేదము.

ఓ గంగా ! పాపాత్ములనుగూడ స్వర్గమునకు జేర్చు నీకు వివేకమేమి? - ఇది మొదటి భేదమునకు లక్ష్యము. 'నీకు వివేకము లేదు' అనుటచేత నిందయే యగపడుచున్నది. పుణ్యాత్ములు స్వర్గమునకు పోవలయును; తద్విపరీతముగా

పాపాత్ములను స్వర్గమునకు చేర్చుట వివేక రహితత్వమే యనిపించును. కాని, నిజమదికాదు. పుణ్యాత్ములు తమ పుణ్యప్రభావముచేతనే స్వర్గమునకు పోవుదురు. పాపాత్ములు గంగలో మునిగినంతలో క్షాళితపాపులై స్వర్గమున కేగుదురు. ఇది గంగా ప్రభావమునకు నిదర్శనము. కావున నిందారూపమున గంగా మహత్త్వమును స్తోత్రము చేయుటయే యిచ్చట జరిగినది. కావుననే యిది వ్యాజస్తుతికి లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. నిందచే స్తుతి స్తుతిచేత నింద దోఁప
నదియు వ్యాజస్తుతి యనంగ నలరుచుండు;
గంగ! నీకు వివేకమెక్కడిది? స్వర్గ
మందఁ జేసెదు పాపాత్ములైన జనుల.

రెండవ భేదము

66. సాధు దూతి! పున స్సాధు కర్తవ్యం కిమితః పరమ్
యన్మదర్థం విలూనాసి దన్తైరపి నఖైరపి॥

టీక ; దూతి=ఓ దూతీ; సాధు పునః సాధు=బాగు బాగు; మత్ + అర్థమ్=నాకొరకై; దన్తైః + అపి=దంతములచేతను; నఖైః + అపి=గోళ్ళచేతను; విలూనా + అసి=ఖండింపబడితివో; ఇతః + పరమ్=దీనిఁ మించి; కిమ్ + కర్తవ్యమ్=చేయదగినదేమికలదు.

వ్యాఖ్య : ఇది స్తుతి వ్యాజమున నింద గావించుటచే నగు వ్యాజస్తుత్యలంకారమునకు లక్ష్యము. 'ఓ దూతికా! బాగు బాగు! నాకొఱకై దంతముల చేతను నఖములచేతను గాయముల నొందితివి. ఇంతకంటె నేమి చేయగలవు?' ఇది ఒక నాయిక తన దూతికతో పలికిన వాక్యము. నాయిక నాయకుని గొని తెచ్చుటకై దూతికను నాయకుని సన్నిధికి పంపెను. అచ్చట దూతిక తానే నాయికయై వ్యవహరించి తిరిగి వచ్చెను. దూతిక శరీరముపైని గానవచ్చు నఖక్షత దంతక్షతాదులను గుర్తుపట్టి నాయిక దూతికను దూషించుచున్నది. కాని 'సాధు సాధు' మొదలయిన విధముగా ననుటచే పొగడుచున్నట్లే పైకి యనిపించును. 'నాకొఱకై గాయములను గూడ పొందితివి.

ఇంతకంటె నేమి చేయగలవు?" అని యనుటకూడ సానుభూతి ప్రదర్శకముగా పైకి కానిపించును. నిజమున కిచ్చట సానుభూతి కాని, స్తుతి కాని లేనేలేవు. "దూతికా! నీవు దూతికా ధర్మమును నిర్వర్తింపలేదు. దంతక్షత నఖక్షతాదులచేత నీ ద్రోహము వెల్లడియైనది పో!" అని నిందించుటయే యిచ్చటి యుద్దిష్టాంశము. ఇట్లు స్తుతిరూపమున నింద గావించుటచే, ఇదియు వ్యాజ స్తుతికి లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. మంచిదానవు దూతిక! మంచిదాన
వింతకంటెను గర్తవ్యమేమి కలదు?
అతని శితనఖ దంత లూనాంగి వైతి
వెందువలన మదర్థమునందు నహహ!

## 31. వ్యాజనిన్దాలఙ్కారః

67. నిన్దాయా నిన్దయా వ్యక్తి ర్వ్యాజనిన్దేతి గీయతే,
విధే! స నిన్ద్యో యస్తే ప్రాగేక మేవాహరచ్ఛిరః॥

టీక: నిన్దయా=నిందచేత; నిన్దాయాః=అన్యనిందయొక్క; వ్యక్తిః=ప్రకటనము; వ్యాజనిన్దా + ఇతి=వ్యాజనింద యని; (సూరిభిః=పండితులచేత); గీయతే=పొగడబడుచున్నది॥ విధే=ఓ బ్రహ్మా; యః=ఎవరు; ప్రాక్=పూర్వము; తే=నీయొక్క; ఏకమ్ + శిరః + ఏవ=ఒక్క శిరస్సును మాత్రమే; ఆహరత్=ఖండించెనో; సః=అతడు; నిన్ద్యః=నిందనీయుడు.

వ్యాఖ్య: నిందచేత అన్యనింద వెల్లడియైనయెడల, అది వ్యాజ నిందాలంకారమగును. ఇది లక్షణము. ఒకనిని గూర్చిన నింద స్పష్టముగా నుండును. కాని యిది వ్యాజము మాత్రమే. ఈ నిందను వ్యాజముగా చేసికొని మఱొకనిని నిందించుటయే పరమార్థము. ఇట్లు నింద వ్యాజముగా నిందయే జరుగుచుండుటచేత, ఈ యలంకారమునకు వ్యాజనింద యను పేరు సార్థకముగానున్నది.

ఓ బ్రహ్మా! పూర్వము నీ తలలలో ఒక్కదానిని మాత్రమే ఖండించిన శివుడు నిందనీయుడు- ఇది లక్ష్యము. ఇచ్చట శివుడు నిందనీయుడని బ్రహ్మ

నిందనీయుడు కాడని స్పష్టముగా నున్నది. పూర్వము బ్రహ్మయెడల కోపము వచ్చి శివు డాతని తలను ఖండించివైచెను. అంతకు ముందు అయిదు తలలను గలిగియున్న బ్రహ్మ అప్పటినుండియు చతుర్ముఖుడయ్యెను. ప్రస్తుతవక్త బ్రహ్మ శిరమును ఖండించినందులకు శివుని నిందించుటలేదు; మిగిలిన నాలుగు శిరములను మిగిల్చినందులకై నిందించుచున్నాడు. అప్పుడు శివుడు తక్కిన తలలను ఖండించినయెడల బ్రహ్మయే యుండెడివాడు కాడు. బ్రహ్మయే లేనినాడు నేడున్నట్లు దుఃఖ నికృష్టమైన సృష్టియు నుండెడిది కాదు. కావున శివుని నిందించుచున్నట్లు కనిపించుచున్నను, లోపభూయిష్ఠ మైన సృష్టిచేసి జనుల కింత కష్టము కలిగించుచున్న బ్రహ్మ యెడలనే పారమార్థికముగా నిందాతిశయము గోచరించుచున్నది. కావుననే యిది **వ్యాజ** నిందకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. నిందచే నింద విన్స్ఫూర్తి నెగడెనేని
వ్యాజనింద యనంగఁ బ్రఖ్యాతి కెక్కు;
నేమి యనవలె విధిని మున్నేకశిరము
నలియఁజేసిన హరు నెన్నవలయుఁ గాక!

## 32. ఆక్షేపాలఙ్కారః (తద్భేదాః)

68. ఆక్షేప స్స్వయ ముక్తస్య ప్రతిషేధో విచారణాత్,
చన్ద్ర సన్దర్శయాత్మాన మథవాస్తి ప్రియాముఖమ్॥

టీక : స్వయమ్=స్వయముగా; ఉక్తస్య = చెప్పబడిన వచనమునకు; విచారణాత్=ఆలోచనవలన; ప్రతిషేధః = నిషేధమును జెప్పుట; ఆక్షేపః = ఆక్షేపమన్న యలంకారము॥ చన్ద్ర = ఓ చంద్రుడా; ఆత్మానమ్ = నిన్ను; సన్దర్శయ = చూపుకొనుము; అథవా = మరొకపక్షమున; ప్రియాముఖమ్= ప్రేయసీముఖము; అస్తి=ఉన్నది.

వ్యాఖ్య : ఆక్షేపాలంకారము మూడుభేదములను గలిగి యుండును. అందు మొదటి భేదమునకు లక్షణలక్ష్యము లిచ్చుట ప్రసక్తములు.

స్వయముగా-తాను చెప్పినమాటనే యాలోచనచేసినమీదట నిషేధిం చుట జరిగిన, అది ఆక్షేపాలంకారమగును. ఇది లక్షణము. ఆక్షేపమను

మాటకు 'తిరస్కార' మన్నది యర్థము. ఆక్షేపము నాలంబనముగా చేసి కొనియే యీయలంకారము ప్రవర్తించుచున్నది; కావున దీనికిపేరు సార్థకముగా నున్నది.

చంద్రా! నిన్ను నీవు చూపుకొమ్ము! వద్దులే! ప్రియాముఖమున్నది. ఇదియొక ప్రణయవంతుని వాక్యము. తొలుత చంద్రదర్శనమును తానే యపేక్షించి పలికెను; పిదప తానే వద్దని నిషేధించెను. చంద్రునకు బదులుగా చంద్రసాదృశ్యముగల ప్రియాముఖమునే చూడగోరెను. మొదట స్వయముగా తాను పలికి పిదప నిషేధించుట యిచ్చట జరుగుచున్నది. కావుననే, ఇది ప్రతిషేధరూపమైన ఆక్షేపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఊహసేయుటవలన నిజోక్తి వాఙ్ని
షేధ మాక్షేప మనఁగను జెలఁగుఁ గృతులఁ;
గలువచెలి చూపు నిన్నది గానినాఁడు
నున్నయది ప్రేయసీముఖం బన్నయట్లు.

విమర్శ : పూర్వార్థము లక్షణము; ఉత్తరార్థము లక్ష్యము. 'కలువచెలి' యన్నది సంబోధనాంతము. 'నిన్నుఁ జూపు' అన్నది తెలుగువాడుక కాదు. అట్లే చెప్పవలయునన్న 'నిన్నుఁ జూపుకొనుము' అని కొను ధాతువునైనను చేర్చిచెప్పుట యవసరము. సంస్కృతమునందలి 'అథవా' అనుదానికి వికల్పార్థమును నిషేధార్థమునుగూడ చెప్పవచ్చును. 'కానినాఁడు' అని యనుట వికల్పార్థమునే కాని నిషేధార్థమును స్ఫురింపజేయుటకు సమర్థము కాకున్నది. నిజమునకున్నది యున్నట్లుగా అన్యార్థస్ఫోరకమై తన్మూలముగా మొత్తము లక్ష్య మసంగత మనిపించుచున్నది. కావున, ఈక్రిందిపద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఆత్మవాక్కునే చింతనానంతరము ని
షేధమొనరించునేని నాక్షేప మగును;
నాకు దర్శనంబిమ్ము చంద్ర! అటు వలదు
లెమ్ము! మత్ప్రేయసీవదనమ్ము కలదు.

రెండవ భేదము

69. నిషేధాభాస మాక్షేపం బుధాః కేచన మన్వతే,
నాహం దూతీ తనోస్తాపస్తస్యాః కాలానలోపమః॥

టీక : నిషేధాభాసమ్ = అభాసరూపమైన నిషేధమును; కేచన=కొందఱు; బుధాః=పండితులు; అక్షేపమ్=అక్షేపమని; మన్వతే=తలచుచున్నారు॥ అహం=నేను; న + దూతీ = దూతికనుకాను; తస్యాః = ఆమెయొక్క; తనోః + తాపః = శరీరతాపము; కాలానల + ఉపమః = ప్రళయకాలమునందలి యగ్నితో సమముగా నున్నది.

వ్యాఖ్య : కొందఱు బుధులు నిషేధాభాసమునుగూడ అక్షేపాలంకారముగా తలచుచున్నారు- ఇది లక్షణము. నిషేధాభాసము అనియనగా ఆభాసరూపమైన నిషేధమని యర్థము. ఇచ్చట నిషేధము నిషేధముకాదు; పైకిమాత్రమే నిషేధము కనిపించును. అయినను దీనివలన అర్థాంతరము స్ఫురించి ప్రకృతమునకు ప్రకర్షము కలుగును. మొత్తముమీద ఇచ్చటకూడ నిషేధము నాశ్రయించుకొనియే యలంకారము ప్రవర్తించుచున్నది. ఇది యిందు రెండవభేదమైన నిషేధాభాసరూపమైన యాక్షేపమునకు లక్షణము.

నేను దూతికనుగాను; ఆమె శరీరతాపము ప్రళయకాలాగ్ని సమముగా నున్నది. ఇవి ఒక దూతిక నాయకునితో పలికినపలుకులు. తాను దూతికయై యుండి 'దూతికను కా' ననుట నిషేధము. తాను చేయుచున్నది దూతికాకృత్యమే. అందువలన నిషేధము బాధితమగుచున్నది. కావున నిచ్చట నున్నది నిషేధాభాసము మాత్రమే. దీనికొక ప్రయోజనమున్నది. దూతికలు సాధారణముగా నాయికల కనుకూలమగునట్లుగా నాయకులతో అసత్యకల్పనము చేసి చెప్పుదురు. 'నేను దూతికనుగాను' అనియనుటచేత 'అట్లు అబద్ధములు కల్పించి నిన్ను వంచించుదానను గాను. నేను చెప్పునది యథార్థము' అన్న అర్థాంతరము స్ఫురించుచున్నది. నాయిక విరహజ్వరముతో వేగిపోవుచున్నదన్న ప్రతిపాదితవిషయమునకు ప్రకర్షము సంపాదితమగుచున్నది. ఇట్లు నిషేధాభాసరూపముగా నిది ప్రవర్తించుటచే, అక్షేపాలంకార భేదమునకు లక్ష్యముగా సరిపోయినది.

ఆంధ్రచంద్రాలోకము

> గీ. బుధజనులు నిషేధాభాసమును వచింతు
> రింపుమీఱంగ నాక్షేపమే యఁటంచు;
> దూతికను గాను కాలాగ్నితుల్య మౌను
> దాని తనుతాప మనియెడి దారి శర్వ!

మూడవ భేదము

> 70. ఆక్షేపోఽన్యో విధౌ వ్యక్తే నిషేధే చ తిరోహితే
> గచ్ఛ గచ్ఛసిచేత్కాన్త! తత్రైవ స్యాజ్జని ర్మమ॥

టీక : విధౌ = విధి; వ్యక్తే (సతి) = వ్యక్తముకాగా; నిషేధే= నిషేధము; తిరోహితే + చ = అవ్యక్తముకాగా; అన్యః = ఇంకొకవిధమైన; ఆక్షేపః = ఆక్షేపాలంకారము; (స్యాత్=అగును)॥ కాన్త = ఓనాథా; గచ్ఛ = వెళ్ళుము; గచ్ఛసి + చేత్ = వెళ్ళుదువేని; తత్ర + ఏవ=అచ్చటనే; మమ + జనిః = నా యొక్క జన్మము; స్యాత్=అగును.

వ్యాఖ్య : అనభిమతమైన విధిని వ్యక్తముచేసి, అభిమతమైన నిషేధమును వ్యక్తముగావింపక భంగ్యంతరముగా స్ఫురింపజేయుట జరిగినయెడల ఇది మఱొకవిధమైన యాక్షేపాలంకార మగును. ఇది లక్షణము. ఇచ్చట సైతము నిషేధము వ్యక్తముకాకపోయినను నిజమున కుద్దిష్టము నిషేధమే. కావున, ఇది యాక్షేపాలంకారమునందు మూడవభేద మగుచున్నది.

ఓనాథా! నీవు వెళ్ళుము. వెళ్ళితివేని నేనచ్చటనే జన్మింతును. ఇది లక్ష్యము. ఈమాటలను దేశాంతరము పోవుటకు సిద్ధమైన నాయకునితో నాయిక యనుచున్నది. 'గచ్ఛ' అని యనుటచేత విధియే కలదు. 'వెళ్లవద్దు' అన్నమాట మొత్తము వాక్యములో నెచ్చటను లేదు. నాయకుడు ప్రవాసమునకు వెళ్ళకుండుట నాయిక యభీష్టము; వెళ్లుట యిష్టముకాదు. ఇష్టముకాని 'వెళ్ళుట'ను విధించుచున్నది. ఇష్టమైన 'వెళ్లకుండుట'ను ప్రస్తావింపనేలేదు. కావున, అనిష్టమైన విధిని వ్యక్తముచేయుట, ఇష్టమైన నిషేధమును వ్యక్తముగావింపకుండుట జరిగినది. కాని, యీనిషేధము భఙ్గ్యంతరముగా స్ఫురింపవలయును. 'నే నచ్చటనే జన్మింతును' అని యనుటచేత 'నీవు వెళ్ళినయెడల నేను మరణింతును, కావున వెళ్లకుము' అన్నభావము గూఢముగా నున్నది,

కావున 'వెళ్లుము' అన్న వ్యక్తవిధియందు 'వెళ్లకుము' అని గర్భీకృతమైన నిషేధమున్నది. కావుననే, యిది యాక్షేపాలంకారమునకు లక్ష్యముగా నుదాహరింపబడినది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. తనరుచుండంగ విధి, నిషేధము తిరోహి
తముగ వేఱొక యాక్షేపణమగుఁ గృతులఁ;
జనుము! చనియెదవేని నచ్చటనె నాకు
జనన మయ్యెడుఁ గాంత! యన్ చందముననను.

## 33. విరోధాభాసాలఙ్కారః

71. ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే
వినాపి తన్వి! హారేణ వక్షోజౌ తవ హారిణౌ॥

టీక : విరోధస్య=విరోధమునకు; అభాసత్వే (సతి)=అభాసత్వము కలుగుచుండగా; (సః=అది; సూరిభిః = పండితులచేత); విరోధాభాసః= విరోధాభాస మన్న యలంకారముగా; ఉచ్యతే=చెప్పబడుచున్నది॥ తన్వి= ఓ యువతీ; తవ=నీయొక్క; వక్షోజౌ=స్తనములు రెండును; హారేణ+వినా +అపి=హారము లేకున్నప్పటికిని; హారిణౌ=హారులై యున్నవి, మనోహారులైయున్నవి.

వ్యాఖ్య : విరోధమున కాభాసత్వము కలుగుచుండగా విరోధాభాస మగును. ఇది లక్షణము. విరోధాభాసమని యనగా అభాసరూపమైన విరోధ మని యర్థము. ఇచ్చట విరోధము విరోధము కాదు. పైకి చూచిన వెంటనే విరోధమున్నట్లు గోచరించును; విచారముచేయగా విరోధము తొలగిపోవును. అభాసరూపమైన విరోధము నాశ్రయముగా చేసికొని యీ యలంకారము ప్రవర్తించుటచేత, దీనికి విరోధాభాస మన్నపేరు అన్వర్థ మగుచున్నది.

ఓ యువతీ! హారములేకున్నను నీస్తనములు హారులైయున్నవి- ఇది లక్షణము. నాయకుడు నాయికాప్రశంసన సందర్భమున పలికిన వాక్యమిది. 'హారులు' అని యనగా 'హారసహితములు' అని యర్థము. "హారరహితము లయ్యును హారసహితములు" అని యనుట విరోధము. కాని, ఆలోచింపగా

ఇది యాభాసము మాత్రమే యని తేలును. 'హారులు' అని యన్నప్పుడు 'మనోహారులు' అన్న యర్థము కలదు. ఇప్పుడు విరోధము పరిహరింపబడినది. హారము లేకుండుట మనోహారులై యుండుటకు ప్రతిబంధకము కాజాలదు. కావుననే, యిది విరోధాభాసాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరు విరోధాభాసం
బనఁ గృతుల విరోధమునకు నాభాసత గ
ల్గిన; హారములను బాసియు
నన్మృతోదరి ! నీకుచములు హారులుగావే !

### 34. విభావనాలఙ్కారః (తద్భేదాః)

72. విభావనా వినాపి స్యాత్కారణం కార్యజన్మచేత్,
అప్యలాక్షారసాసిక్తం రక్తం త్వచ్చరణద్వయమ్॥

టీక : కారణమ్ + వినా + అపి=కారణము లేకపోయినప్పటికిని; కార్యజన్మ=కార్యోత్పత్తి; (వర్ణితం) చేత్=వర్ణింపబడినయెడల; విభావనా= విభావన యన్న యలంకారము; స్యాత్=అగును॥ అలాక్షారసాసిక్తమ్ + అపి =లత్తుక పూతలేకపోయినప్పటికిని; త్వత్ + చరణద్వయమ్=నీయొక్క పాదముల జంట; రక్తమ్=ఎఱ్ఱనై యున్నది.

వ్యాఖ్య : కారణము లేకుండగనే కార్యోత్పత్తి జరిగినయెడల విభావనాలంకార మగును. ఇది లక్షణము. కారణమువలన కార్యము జరుగును. కావున కార్యోత్పత్తి యున్నప్పుడు కారణసంబంధముండుట తప్పదు. ఇది లోకధర్మము. కావ్యధర్మము కొన్నియెడల దీనికి విరుద్ధముగా భాసింపవచ్చును. ఈ విరోధము పరిణామరూపముగా చమత్కారదాయకమగును. "విభావ్యతే విచార్యతే కారణమస్యామితి విభావనా" అన్న వ్యుత్పత్తినిబట్టి కారణమునుగూర్చి విశేషముగా భావించుటయే యాశ్రయముగా విభావనాలంకారము ప్రవర్తించును. కావుననే 'విభావన' యన్నది యన్వర్థనామ మగుచున్నది.

విభావన యన్నది యాఱువిధములుగా నుండును. అన్నింటియందును

కారణవిచారమే విషయమై యుండును. మొదటిభేదము కారణములేకుండ గనే కార్యోత్పత్తి జరుగుటచేత నేర్పడును. దానికి లక్ష్యము చూతము.

లత్తుక పూయనప్పటికిని నీపాదము లరుణములై యున్నవి. ఇది ప్రియుడు ప్రేయసీ సౌకుమార్యము నభినందించుచు పలికిన వాక్యము. లత్తుకపూయుట కేకైకఫలము పాదముల కెఱ్ఱదనము గూర్చుట. లత్తుక పూయుట కారణము; పాదములెఱ్ఱబడుట కార్యము. ఇచ్చట పాదములెఱ్ఱ బడుటయున్నది; అనగా కార్యోత్పత్తి జరిగిన దన్నమాట. లత్తుకపూయుట యన్న కారణము మాత్రమే జరుగలేదు. కారణములేకుండగనే కార్యోత్ప త్తిని చెప్పుటచేత ఇది విభావనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇచ్చట ఈ స్త్రీపాదములు నైసర్గికముగానే అరుణములై యున్నవి. అన్యకారణాపేక్ష వీనికి లేదు. అయినను లోకవిరుద్ధమైనట్లు భాసింపజేయుట చేత ఒక చమత్కారము సంపాదింపబడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కారణములేక కార్యంబు గలుగఁజెప్ప
నది విభావన యనఁగఁ బ్రఖ్యాతి గాంచుఁ;
దరుణి ! లాక్షారసానిషిక్తములు గాక
యరుణములు నీదు చరణంబు లన్నయట్లు.

రెండవ భేదము

73. హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తిశ్చ సా మతా,
అస్త్రై రతీక్ష్ణ కఠినై ర్జగ జ్జయతి మన్మథః॥

టీక : హేతూనామ్ = కారణములయొక్క; అసమగ్రత్వే=అసమగ్ర త్వమునందును; కార్యోత్పత్తిః (+చేత్) = కార్యోత్పత్తియైనయెడల; సా= విభావన యన్న యలంకారము; (సూరిభిః = పండితులచేత;) మతా=సమ్మ తింపబడినది॥ మన్మథః=మన్మథుడు; అతీక్ష్ణకఠినైః = తీక్ష్ణత్వ కఠినత్వములు లేని; అస్త్రైః=బాణములతో; జగత్ = ప్రపంచమును; జయతి = జయించు చున్నాడు.

వ్యాఖ్య : కారణములు సమగ్రముగా లేకపోయినప్పటికిని, కార్యము

వ్యాఖ్య : కారణములు సమగ్రముగా లేకపోయినప్పటికిని, కార్యము జరిగినయెడల, ఇదికూడ విభావన యగును. ఇది లక్షణము. కారణము నిండుగా నున్నప్పుడే కాని కార్యము సంభవము కాదు. ఈ విభావనయందు కారణముండుటకు మాత్ర ముండును; కార్యసాధనకు కావలసినంత సమగ్రముగా నుండదు. అయినప్పటికిని కార్యము సంపన్నమైనట్లు వర్ణించుట యిందు జరుగును.

అతీక్ష్ణ కఠినములయిన బాణములతో మన్మథుడు జగత్తును జయించుచున్నాడు- ఇది లక్ష్యము. సామాన్య శత్రువును జయింపవలయు నన్నప్పటికి సాధనము తగినదై యుండవలయును. చిన్నపామునైనను పెద్దకఱ్ఱతో కొట్టవలయును. ప్రపంచము నంతటిని గెలువవలయు నన్న నెంతటి సాధనము కావలయును ? మన్మథుడు పువ్వులను బాణములుగా గ్రహించి లోకమును గెలుచుచున్నాడు. పువ్వులు సాధనములుగా, అనగా కార్య హేతువులుగా నున్నవి. కాని, యివి వాడియైనవి కావు; గట్టివి కావు. ఇట్టివి జగజ్జయమునకు తగిన సాధనములు కాజాలవు. అయినను మన్మథుడు పువ్వులతోనే జగమును గెలుచుచున్నాడు. అసమర్థమైన సాధనముచేత మహత్తరమైన కార్యము సాధింపబడుట యిచ్చట కలదు. కావున, ఇదియు విభావనాలంకారమునకు లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

ఆ. హేతువులకు బలిమి యొనయకుండినఁ గార్య
మొదవఁజెప్ప నదియ యొప్పుఁ గృతులఁ;
గాయజుం డతీక్ష్ణ కఠినాస్త్రములచేత
గెలుచుచున్నవాఁ డఖిల జగములు.

మూఁడవ భేదము

74. కార్యోత్పత్తి స్తృతీయా స్యాత్సత్యపి ప్రతిబన్ధకే,
నరేన్ద్రా న్నేవ తే రాజన్ ! దశత్యసిభుజఙ్గమః॥

టీక : ప్రతిబన్ధకే=అవరోధము; సతి + అపి = ఉన్నప్పటికిని; కార్యోత్పత్తిః ( + చేత్) = కార్యోత్పత్తి యైనయెడల; తృతీయా=విభావనయందలి తృతీయభేదము; స్యాత్ = అగును॥ రాజన్ = ఓ రాజా; తే = నీయొక్క; అసి

భుజఙ్గమః=కత్తియనెడి పాము; నరేన్ద్రాన్ + ఏవ=విషవైద్యులను మాత్రమే, రాజులను మాత్రమే; దశతి=కాటువేయును.

వ్యాఖ్య : ప్రతిబంధక మున్నప్పటికిని కార్యము జరిగినయెడల, మఱి యొక విభావన యగును. ఇది లక్షణము. ఇచ్చట కారణ ముండును; కాని కారణము ప్రవర్తింపకుండ ప్రతిబంధక ముండును. అందువలన కార్యోత్పత్తి యుండరాదు. అయినప్పటికిని కార్యోత్పత్తి యున్నట్లు చెప్పుట యిచ్చట జరుగును.

ఓ రాజా ! నీ ఖడ్గసర్పము నరేంద్రులనే కాటువేయును. ఇది లక్ష్యము. నరేంద్రు లని యనగా విషవైద్యులని యర్థము. విషవైద్యులయొద్ద మణిమంత్రౌషధాదులుండును. కావున సర్పములు వారిని సమీపింపజాలవు. ఇచ్చట అట్టి ప్రతిబంధకములు కలిగినవారిని గూడ కాటువేయుట చెప్పబడినది. ప్రతిబంధకము లున్నప్పటికిని కార్యోత్పత్తి చెప్పబడినది. కావుననే, యిది విభావనకు లక్ష్యమైనది.

'నరేంద్రులు' అని యన్నప్పుడు 'ప్రభువులు' అన్న యర్థమున్నది. ఇచ్చట ప్రతిబంధక మేమాత్రమును లేదు. కావున నిచ్చట కార్యము సంపన్నము కాగలదు. ఇచ్చట ప్రతిబంధకము శ్లేషము నాశ్రయించుకొని యున్నది; కార్యోత్పత్తియు శ్లేష సిద్ధమే.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కార్య మొదవినఁ బ్రతిబంధకంబు గలుగ
నది తృతీయ విభావన యండ్రు కృతుల;
దొరల తల మానికమ ! నరేంద్రులనె కఱచు
చున్నయది యుష్మదీయ ఖడ్గోరగంబు.

నాలుగవ భేదము

75. అకారణా త్కార్యజన్మ చతుర్థీ స్యా ద్విభావనా,
శఙ్ఖా ద్వీణా నినాదోఽ యముదేతి మహాదద్భుతమ్॥

టీక : అకారణాత్=కారణభిన్నమైన దానిచేత; కార్యజన్మ (+చేత్) =కార్యోత్పత్తి యైనయెడల; చతుర్థీ=నాలుగవదైన; విభావనా=విభావనాలంకారము; స్యాత్=అగును॥ శఙ్ఖాత్=శంఖమునుండి; అయం + వీణానినాదః=

ఈ వీణాధ్వని; ఉదేతి = పుట్టుచున్నది; మహత్ + అద్భుతమ్ = మిక్కిలి యాశ్చర్యకరము.

వ్యాఖ్య : కారణము కానిదానిచేత కార్యోత్పత్తి యైనయెడల నాలుగవ విధమైన విభావన యగును. ఇది లక్షణము. ఏ కారణమువలన నేకార్యము కలుగునో, ఆ కారణమువలన నా కార్యమే కలుగుట లోక సహజము. ఒక కార్యమునకు హేతువైనది, అన్యకార్యమునకు హేతువు కాలేదు. కాని హేతువు కానిదానిచేత కార్యోత్పత్తి జరుగుట యిచ్చట చెప్పబడును.

ఇది చాల వింత! శంఖమునుండి యీ వీణాధ్వని వెలువడుచున్నది. ఇది లక్ష్యము. వీణాధ్వని వీణనుండి పుట్టవలయును; శంఖ ధ్వని శంఖము నుండి పుట్టవలయును. కాని యిచ్చట వీణాధ్వని తదాశ్రయముకాని శంఖము నుండి పుట్టుచున్నట్లు చెప్పబడినది. ఇచ్చట కారణము కానిదానిని కారణముగా చెప్పుటచేత, ఇది విభావనకు లక్ష్యమగుచున్నది.

నిజమున కిచ్చటి శంఖము శంఖము కాదు; శంఖ సదృశమైన కంఠము మాత్రమే. అట్లే వీణా ధ్వని వీణా ధ్వని కాదు: వీణా ధ్వని సదృశమైన కంఠ స్వరము మాత్రమే. కోమల కంఠమునుండి కోమలస్వరము వినిపించుచున్న దన్నది తాత్పర్యార్థము. ఇప్పుడిక్కడ విరోధము లేదు.

ఇంకొక విషయము. ఈ లక్ష్యమునందు వర్ణ్యములను మాటుపుచ్చి యుపమానములను మాత్రమే చెప్పుట జరిగినది. కావున, ఇది రూపకాతిశయోక్తికి సైతము లక్ష్యము కావలసియున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కారణము లేక కార్యంబు గలిగెనేని
నాల్గవ విభావన యనం దనర్చుఁ గృతులఁ;
గలిత వీణా రవంబు శంఖంబు వలన
జనన మందెడి నిది వింత యను విధమున.

విమర్శ : మూలమునందలి 'అకారణాత్' అనుదానికి 'కారణములేక' యన్న యనువాదము సరికాదు. పైగా విభావనయందలి మొదటి భేదమునకు నాలుగవభేదమునకును తెలుగున నేమాత్రమును భేదము కానగాదు. అకారణాత్' అని యనగా 'కారణభిన్నాత్' అని యర్థము. దానికి 'కారణ

ము లేక' అన్నది యర్థముకాదు. కావున మొదటిపంక్తిని 'కారణము కాని దానిచేఁ గార్యమొదవ' నని దిద్దికొనిన లక్షణము సుసంగతమగును. తక్కిన పద్యమును యథాస్థితముగా నుపయోగించుకొన వచ్చును.

అయిదవ భేదము

76. విరుద్ధాత్కార్య నిష్పత్తిర్దృష్టా కాచిద్విభావనా,
శీతాంశుకిరణా స్తన్వీం హన్త ! సన్తాపయన్తి తామ్॥

టీక : విరుద్ధాత్=విరుద్ధమైన కారణముచేత; కార్యనిష్పత్తిః=కార్యోత్పత్తి; కాచిత్ + విభావనా=ఒకానొకవిధమైన విభావనాలంకారము; దృష్టా=దృష్టము॥ హన్త=అక్కటా; తామ్ + తన్వీమ్=ఆ యువతిని; శీతాంశుకిరణాః=శీతాంశుడైన చంద్రుని కిరణములు; సన్తాపయన్తి = తపింపజేయుచున్నవి.

వ్యాఖ్య : విరుద్ధమైన కారణముచేత కార్యము జరిగెనేని విభావన యగును. ఇది లక్షణము. కారణమును బట్టి కార్యముండును. ఒకకార్యమున కనుగుణమైన కారణము ప్రవర్తించినపుడే కార్యము సంపన్నమగును. విరుద్ధమైనకారణ మున్నప్పుడు విరుద్ధకార్యము మాత్రమే జరుగును. నీరు సాధనమైనప్పుడు తడుపుట కార్యము; నిప్పు సాధనమైనప్పుడు తగులబెట్టుట కార్యము. ఈ కార్యకారణ సంబంధము నియతము. నీరు తగులబెట్టుటకు కారణము కాదు; నిప్పు తడుపుటకు కారణముకాదు; పైగా ఇవి విరుద్ధ కారణములుకూడ నగును. ఇట్టి విరుద్ధకారణములచే కార్యోత్పత్తి జరిగినట్లు చెప్పిన విభావనాలంకార మగును.

అక్కటా ! శీతాంశుకిరణము లాయువతిని తపింపజేయుచున్నవి-అన్నది లక్ష్యము. శీతాంశుకిరణములవలన చల్లదనము కలుగవలయును. కాని యిచ్చట తాపము కలుగుచున్నది. చండాంశుకిరణములవలన తాపము కలుగుట సహజము. ఇచ్చట 'తాపము' అనుకార్యము 'శీతాంశుకిరణములు' అన్న విరుద్ధకారణమువలన కలుగుచున్నది. కావున, ఇది విభావనాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

విరహిణీ విరహులకు చంద్రాతపము తాపము కలిగించుటన్నది సమయప్రసిద్ధము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అతివిరుద్ధమువలనఁ గార్యంబు గలుగ
నదియు నొక్కవిభావన యనఁగఁ దనరుఁ;
దాప మందఁగఁ జేసెడి తన్వి నహహ !
శీతలాంశుని కరములన్ రీతి శర్వ !

ఆఱవ భేదము

77. కార్యాత్కారణజన్మాపి దృష్టా కాచిద్విభావనా,
యశః పయోరాశి రభూత్ కరకల్పతరో స్తవ॥

టీక : కార్యాత్ = కార్యమువలన; కారణజన్మ + అపి=కారణము జన్మించు నప్పుడును; కాచిత్=ఒకానొక; విభావనా=విభావనాలంకారము; దృష్టా=ప్రసిద్ధము॥ తవ=నీయొక్క; కరకల్పతరోః=చేయి యను కల్పవృక్షమునుండి; యశః + పయోరాశిః=కీర్తియను పాలసముద్రము; అభూత్ = పుట్టెను.

వ్యాఖ్య : కార్యమునుండియే కారణముపుట్టినయెడల, మరొక విధమైన విభావన యగును. ఇది లక్షణము. కారణమువలన కార్యోత్పత్తి జరుగుట లోకసిద్ధము. అది యిచ్చట వ్యత్యస్తముగా వర్ణింపబడును.

ఓరాజా ! నీకరమనెడి కల్పవృక్షమునుండి నీకీర్తియనెడి పాలసముద్రము పుట్టెను. ఇది లక్ష్యము. పాలసముద్రమునుండి కల్పవృక్షము పుట్టుట పురాణప్రసిద్ధవిషయము. అక్కడ పాలసముద్రము కారణము; కల్పవృక్షము కార్యము. కరమనెడి కల్పవృక్షము; కీర్తియనెడి పాలసముద్రము అని అభేదమును సాధించెను. కరమువలన, అనగా దాతృత్వమువలననే కీర్తి కలిగెను. కరము కారణము; కీర్తి కార్యము. ఇంతవరకు వ్యత్యయములేదు. రూపకము చేసి కరకల్పవృక్షమునుండి కీర్తి క్షీరసముద్రము పుట్టెననుటచేత కారణ కార్యములకు వ్యత్యయము కలిగినది. అందువలననే విభావనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కారణము కార్యమువలనఁ గలిగెనేని
వేఱొక విభావన యంటంద్రు విబుధవరులు;

నీకరంబను కల్పకానోకహంబు
వలనఁ బుట్టె మహాకీర్తి వారిరాశి.

## 35. విశేషోక్త్యలఙ్కారః

78. కార్యాజని ర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే,
హృది స్నేహక్షయో నాభూత్ స్మరదీపే జ్వలత్యపి॥

టీక : పుష్కలకారణే + సతి = సమృద్ధమైన కారణమున్నప్పటికిని; కార్య + అజనిః = కార్యము కాకుండుట; విశేషోక్తిః; = విశేషోక్తి యన్న యలంకారము॥ హృది = హృదయమునందు; స్మరదీపే = మన్మథదీపము; జ్వలతి + అపి = వెలుగుచున్నప్పటికిని; స్నేహక్షయః = తైలము తగ్గుట, మైత్రితగ్గుట; న + అభూత్ = కాలేదు.

వ్యాఖ్య : సమృద్ధమైన కారణము కల్గియును కార్యోత్పత్తి జరుగని యెడల విశేషోక్తి యన్న యలంకారమగును. తగినకారణము సమృద్ధముగా నున్నప్పుడు కార్యోత్పత్తి జరుగుట లోకసాధారణము; అట్లు జరుగకుండుట విశేషము. అట్టి విశేషము నాధారముచేసికొని వర్తించుచుండుటచేత, ఈ యలంకారమునకు విశేషోక్తి యన్నపేరు అన్వర్థమైయున్నది.

హృదయమున మన్మథదీపము వెలుగుచున్నప్పటికి స్నేహక్షయము కాలేదు- ఇది లక్ష్యము. దీపము వెలుగుచున్నప్పుడు చమురు తగ్గిపోవుచుండును. ఇది లోకసాధారణము. దీపము వెలుగుట కారణము; చమురు తగ్గుట కార్యము. ఇచ్చట దీపము వెలుగుట యన్న కారణము సమృద్ధముగా నున్నప్పటికిని, చమురు తగ్గుటయన్న కార్యము జరుగలేదు. ఇది విశేషము. కావుననే, ఇది విశేషోక్తికి లక్ష్యమైనది.

నిజమున కిచ్చట నున్నది మన్మథదీపము. స్నేహ మనగా అనురాగము. మన్మథుడే హృదయమున దీపమై జ్వలించుచుండగా అనురాగము వృద్ధిపొందునే కాని క్షీణింపదు. అర్థాంతరముచేత వైరుద్ధ్యము తొలగిపోవును.

ఆంధ్రచంద్రాలోకమునం దీశ్లోకమున కనువాదము సమగ్రముగా లేదు. కావున, ఈక్రిందిపద్యమును గ్రహింపవచ్చును.

గీ. పుష్కలంబుగా హేతువు పొసఁగి యుండి
యొదవదేనిఁ గార్యము విశేషోక్తి యగును;
లీల మదనదీపంబు జ్వలించుచుండ
హృదయమునఁ దరుగదు స్నేహమించుకంత.

## 36. అసంభవాలఙ్కారః

79. అసంభవోఽర్థనిష్పత్తే రసంభావ్యత్వ వర్ణనమ్,
కో వేద గోపశిశుక శ్శైలముత్పాటయే దితి॥

టీక : అర్థనిష్పత్తేః=కార్యోత్పత్తియొక్క; అసంభావ్యత్వ వర్ణనమ్=సంభావన శక్యము కాదని వర్ణించుట; అసంభవః = అసంభవమన్న యలంకారము॥ గోపశిశుకః = గోపాలబాలకుడు; శైలమ్ =(గోవర్ధన) పర్వతమును; ఉత్పాటయేత్ + ఇతి = పెళ్ళగింపగలడని; కః = ఎవడు; వేద=భావించెను.

వ్యాఖ్య : కార్యోత్పత్తియొక్క అసంభావ్యత్వమును వర్ణించుట అసంభవాలంకార మగును. ఇది లక్షణము. అసంభావ్యత్వము అని యనగా సంభవమని భావింపకపోవుట యని యర్థము. అసంభవమైన కార్యము జరిగి, దాని అసంభావ్యత్వముకూడ పేర్కొనబడినయెడల అసంభవాలంకార మగునని తాత్పర్యము.

గోపాలబాలకుడు పర్వతమును పెళ్ళగింపగలడని యెవడు భావించెను? ఇది లక్ష్యము. పర్వతమును పెళ్లగించి పైకెత్తుట లోకదృష్టిలో అసంభవము. కృష్ణుడీ యసంభవమును సంభవముగావించెను. పర్వతమును పైకెత్తుటయన్న కార్యము జరిగినది. ఇది యెవడు భావించెను? అని ప్రశ్నించుటచేత కార్యోత్పత్తియొక్క అసంభావనీయత కూడ పేర్కొనబడినది. కావుననే యిది యసంభవాలంకారమునకు లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అర్థనిష్పత్త్యసంభావ్యతానువర్ణ
నం బసంభవ మనఁగఁ దనర్చుఁ గృతుల;
గోపబాలుఁడు దానిట్లు కొండ యెత్తఁ
గలఁ డనుచు నెవ్వఁడెఱుఁగు నన్కరణి శర్వ!

## 37. అసఙ్గత్యలఙ్కారః (తద్భేదాః)

**80.** విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వో రసఙ్గతిః
విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాఙ్గనాః॥

టీక : కార్యహేత్వోః = కార్యకారణములకు; విరుద్ధమ్=పొందికలేని; భిన్నదేశత్వమ్ = భిన్నస్థలత్వము; (వర్ణితంచేత్ = వర్ణింపబడినయెడల); అసఙ్గతిః=అసంగతి యన్న యలంకారము; (స్యాత్=అగును)॥ జలధరైః= మేఘములచేత; విషమ్=విషము, జలము; పీతమ్=త్రాగబడినది; పథికాఙ్గనాః= ప్రోషితభర్తృకలు; మూర్ఛితాః=మూర్ఛనొందిరి.

వ్యాఖ్య : కార్యకారణములకు విరుద్ధమైన భిన్నదేశత్వమును వర్ణించిన యెడల, అది అసంగత్యలంకార మగును. ఇది లక్షణము. కారణ మొక స్థానమునం దుండగా కార్యము మఱొకస్థానమునందు జరిగినట్లు చెప్పుట యిందుండును. లోకమునందు కారణమున్నస్థానమునందే కార్యముత్పన్న మగుట సహజము. ఏకట్టకు నిప్పున్నదో యాకట్ట కాలును. ఇది లోకధర్మము. ఇచ్చట దానికి విరుద్ధత యేర్పడి భిన్నస్థానముల నాశ్రయించుట జరుగుచున్నది. ఈ అసంగత్వమును బట్టియే దీనికి 'అసంగతి' యన్నపేరు సార్థకమగును. ఇది మూడు భేదములను గలిగియుండును. ఇందు మొదటిభేదము నిరూపితము.

మేఘములు విషముత్రాగినవి, పథికాంగనలు మూర్ఛనొందిరి. ఇది లక్ష్యము. విషము త్రాగినవారు మూర్ఛనొందుట లోకసహజము. విషము త్రాగుట కారణము; మూర్ఛనొందుట కార్యము. కారణము మేఘముల నాశ్రయించుకొని యున్నది. కార్యము పథికాంగనల నాశ్రయము చేసికొని జరిగినది. కార్యకారణము లేకదేశములై యుండవలసియుండగా, తద్విరుద్ధముగా భిన్నదేశత్వము నాశ్రయించియున్నవి. అనగా కార్యకారణములకు అసంగతి యేర్పడినది. అందువలననే యిది అసంగత్యలంకారమునకు లక్ష్య మైనది.

'విషము' అనగా జలమన్నయర్థముకూడ కలదు. మేఘములు జలము త్రాగుట యనగా వర్షాకాల మాసన్నమగుటయని యర్థము. వర్షాకాలము పథికాంగనలకు ప్రాణభయోత్పాదకమని కవి సమయప్రసిద్ధి.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అవు నసంగతి కార్యహేతువుల కతివి
రుద్ధతయు భిన్నదేశత రూఢమైన;
వనధరమ్ములు విషము ద్రావంగ బథిక
కామినులు మూర్ఛ చెంది రన్ కరణి శర్వ!

రెండవ భేదము

81. అన్యత్ర కరణీయస్య తతోఽన్యత్ర కృతిశ్చ సా,
అపారిజాతాం వసుధాం చికీర్షన్ ద్యాం తథాకరోః॥

టీక : అన్యత్ర=ఒకచోట చేయదగినదానికి; తతః + అన్యత్ర = దానికంటెభిన్నమైనచోటు; కృతిః + చ = చేయుటయు; సా = ఆ అసంగతియ॥ వసుధామ్=భూమిని; అప + అరి + జాతమ్=శత్రుసమూహము లేని దానినిగా; న + పారిజాతామ్=పారిజాతములేనిదానినిగా; చికీర్షన్=చేయగోరి; ద్యామ్= స్వర్గమును; తథా = అవిధముగా; అకరోః = చేసితివి.

వ్యాఖ్య : ఒకచోట చేయగోరిన కార్యమును మరొకచోట చేయుట కూడ అసంగత్యలంకారమే యగును. ఇది లక్షణము. ఎచ్చట నేదియవసరమో అచ్చట దానిని చేయవలయును. అది యపేక్ష్యము. అట్లు కాక అవసరమైన చోట చేయవలసిన కార్యమును అవసరములేనిచోట చేయుట అసంగతియే యగును. ఇది రెండవ భేదము.

భూమి నపారిజాతము చేయగోరి స్వర్గము నట్లుచేసితివి–ఇది లక్ష్యము. ఇంద్రుడు కృష్ణుని సంభోదించి యన్న వాక్యమిది. కృష్ణుడు భూలోకము నపారిజాతము చేయగోరెను; కాని స్వర్గలోకము నపారిజాతము చేసెను. అనగా భూలోకమునందు చేయవలసిన కృత్యమును, స్వర్గమునందు చేసెను. కావుననే యిది అసంగతికి లక్ష్యమగుచున్నది.

అపారిజాత మని యనగా భూలోక పరముగా 'అప + అరి + జాతము' అని విభజింపబడి 'శత్రు సమూహములేనిది' అన్న అర్థము కలుగును. స్వర్గలోక పరముగా 'న + పారిజాతము' అని విభజింపబడి 'పారిజాతము లేనిది' అన్నయర్థము కలుగును. అప్పుడర్థము సంగతమగును.

ఆంధ్రచంద్రాలోకము

ఆ. అగు నసంగతి యనునది యొక్కచోఁ జికీ
ర్షితము నితరమునకుఁ జేసెనేని;
క్షితి నపారిజాతఁ జేయంగఁబూని స్వ
ర్గము నపారి జాతము సలిపితి.

మూడవ భేదము

82. అన్యత్కర్తుం ప్రవృత్తస్య తద్విరుద్ధ కృతిశ్చ సా,
గోత్రోద్ధార ప్రవృత్తోఽపి గోత్రోద్భేదం పురా కరోః॥

టీక : అన్యత్=అన్యకార్యమును; కర్తుమ్=చేయుటకు; ప్రవృత్తస్య=సిద్ధపడిన వానియొక్క; తత్+విరుద్ధ+కృతిః+చ= దానికి విరుద్ధమగు కార్యము చేయుటయు; సా=ఆ యసంగతియే॥ గోత్ర+ఉద్ధార+ప్రవృత్తః+అపి=గోత్రము నుద్ధరించుటకై ప్రవర్తించిన వాడవైనను; గోత్ర+ఉద్భేదమ్ =గోత్రము నున్మూలించుట: పురా=పూర్వము; అకరోః=చేసితివి.

వ్యాఖ్య : ఒకపనిని చేయబూని, దానికి సరిగా విరుద్ధమయిన పనిని చేసిన యెడల, అదికూడ అసంగత్యలంకారమే యగును. ఇది లక్షణము. చేయబూనిన పనికిని చేసిన పనికిని సంగతి లేకుండుట యిక్కడ విషయము. కావుననే, యిది అసంగత్యలంకార మగుచున్నది.

గోత్రోద్ధారణము చేయబూనిన నీవు గోత్రోన్మూలనము చేసితివి - ఇది లక్ష్యము. ఇంద్రుడు కృష్ణుని నుల్లసమాడుచు పలికిన వాక్యమిది. చేయదలచుకొన్నది ఉద్ధారణము; చేసినది ఉన్మూలనము. రెండును పరస్పర విరుద్ధములు. రక్షణము చేయుటకై పూనుకొని నాశముచేసె ననుటచేత అసంగతి యగుచున్నది.

గోత్రమునకు భూమి, పర్వతము, వంశము మున్నగు నర్థములు గలవు. భూమి నుద్ధరింపబూని భూమిని పెళ్ళగించితివి-అన్న యర్థము పైవాక్యము విన్నవెంటనే మనకు స్ఫురించును. అందువలననే, అది యసంగతి యగుచున్నది. గోత్రమని యన్నప్పుడు పర్వతమన్న యర్థము చెప్పుకొనవచ్చును. భూమి నుద్ధరింపబూని పర్వతము నున్మూలించితివి - అన్నయర్థము కలుగును. భూమిని రక్షించుటకై గోవర్ధనమును పెల్లగించితి వన్న భావము వెల్లడి

యగును. ఇది సంగతమే యగును. గోత్రమునకు వంశమన్న యర్థమును చెప్పు కొన్నచో వంశమును రక్షించుటకై గోవర్ధనమును పెల్లగించితి వన్న భావము వెల్లడి యగును. ఇదియు సంగతమే యగును. పర్వతముద్ధరించుటకై (పైకెత్తుటకై) పెల్లగించితి వన్నభావము కూడ సంగతమే యగును.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఒకటి సేయంగఁ బూని దానికి విరోధ
కరము నొనరించుటయు నసంగతి యనఁబడు;
నతఁడు గోత్రోద్ధరణము సేయంగఁబూని
సలిపె గోత్రోద్దలన మని పలుకునపుడు.

## 38. విషమాలఙ్కారః (తద్భేదాః)

83, విషమం వర్ణ్యతే యత్ర ఘటనా ననురూపయోః,
క్వేయం శిరీష మృద్వఙ్గీ క్వ తాదృఙ్మదనజ్వరః ?

టీక : అననురూపయోః=అనురూపములు కాని రెండింటికి; యత్ర= ఎక్కడ; ఘటనా=సంబంధము; వర్ణ్యతే = వర్ణింపబడునో; (తత్=అది); విషమమ్=విషమాలంకారము॥ ఇయమ్=ఈ; శిరీషమృదు + అఙ్గీ = దిరిసినపువ్వు వలె మృదువైన శరీరముగల స్త్రీ; క్వ=ఎక్కడ; తాదృక్=అటువంటి దుస్సహమైన; మదనజ్వరః=మన్మథతాపము; క్వ=ఎక్కడ ?

వ్యాఖ్య : ఆనురూప్యము లేని రెండింటికి సంబంధము వర్ణింపబడిన యెడల విషమాలంకార మగును. విషమాలంకారము మూడు భేదములను కలిగి యుండును. అందు మొదటి భేదమునకు లక్షణ మిది. సమము అనగా అనురూప మని యర్థము. దానికి విరుద్ధమైనది విషమము; అననురూప మని యర్థము. అననురూపత్వము నాధారముగా చేసికొనియే విషమాలంకారము ప్రవర్తించును. కావుననే, యీపేరు దీనికి సార్థక మగుచున్నది.

దిరిసెనపువ్వువలె మృదువైన శరీరముగల యీమె యెక్కడ ? అటువంటి మదనజ్వర మెక్కడ ? ఇది లక్ష్యము. విరహిణియగునాయిక నుద్దేశించి తత్పరిచారిక పలికిన వాక్యములివి, ఇందు పూర్వవాక్యమున అతి మృదుత్వము ప్రతిపాదింపబడినది. ఉత్తరవాక్యమున అతి దుర్భరత్వము ప్రతి

పాదింపబడినది. ఈ రెండు నొకదాని కొకటి యనురూపము కాని గుణములు. ఇవి నాయిక యందు ఘటింపబడినవి. కావున నిది విషమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇట్టియెడల వాక్యద్వయముండుటయు, క్వార్థకమైన పదము (ఎక్కడ) రెండుమార్లు ప్రయుక్తమగుటయు సాధారణలక్షణము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. తగని వస్తుద్వయంబు సందర్భ మెచట
నైన వర్ణింపఁబడెనేని నదియ విషమ
మనఁగఁ దగు; నీ శిరీష మృద్వంగి యేడ
నిట్టి చేతో భవజ్వరం బేడ ననఁగ.

రెండవ భేదము

84. విరూప కార్యస్యోత్పత్తి రపరం విషమం మతమ్,
కీర్తిం ప్రసూతే ధవళాం శ్యామా తవ కృపాణికా॥

టీక : విరూప కార్యస్య=కారణమునకు విరుద్ధమైన కార్యముయొక్క: ఉత్పత్తిః=పుట్టుక; అపరం విషమమ్ = మరొకవిధమైన విషమాలంకారముగా; మతమ్=సమ్మతము॥ తవ=నీయొక్క; శ్యామా=నల్లని రంగుగల; కృపాణికా = ఖడ్గము; ధవళామ్=తెల్లని రంగుగల; కీర్తిమ్=యశస్సును; ప్రసూతే=ప్రసవించు చున్నది.

వ్యాఖ్య: కారణమునకు విరుద్ధమైన కార్యముత్పన్నమైనయెడల, మరొక విషమాలంకార మగును. ఇది లక్షణము. కారణమున కనురూపమైన కార్యము జరుగుట లోకధర్మము. అట్లు కాక కారణ ధర్మమునకు విరుద్ధ ధర్మముగల కార్యము జరుగుట యిందుండును. కావుననే యిది విషమాలం కార మన్న పేరును సార్థకము గావించుచున్నది.

ఓ రాజా! నీ నల్లని కత్తి తెల్లని కీర్తిని ప్రసవించుచున్నది- అన్నది లక్ష్యము. ఇది రాజపరాక్రమ వర్ణన సందర్భములోనిది. కీర్తి తెల్లగా నుండు నని కవి సమయము. కత్తి లోహకృత మగుటచేత నల్లగా నుండుట ప్రసిద్ధము. కారణమైన కత్తియొక్క గుణము నల్లదనము. కార్యమైన కీర్తియొక్క గుణము

తెల్లదనము. తజ్జన్యము తత్సదృశగుణమును కలిగియుండవలసి యుండగా తద్విరుద్ధ గుణమును కలిగియుండుటచేత, ఇది విషమాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఈ లక్ష్యము విషయమున ఇంకొక సందేహము రావచ్చును. 'విరుద్ధాత్ కార్యనిష్పత్తిః' అన్న లక్షణమువలన విభావనాలంకారము కావలయును గదా! కారణమునకు కార్యము విరుద్ధమైన, కార్యమునకు కారణము కాకుండదు. అందువలన విరుద్ధ కారణమువలన కార్యోత్పత్తి జరుగుచున్నది. కాబట్టి విభావనకూడ కావచ్చు ననిపించును. ఇక్కడ సూక్ష్మభేదము కలదు. దానిని గర్తించుకొనుట యవసరము. ప్రకృతమునకు విరుద్ధమైన గుణము కారణమునందు వివక్షింపబడినయెడల, అది విభావన యగును. ప్రకృతమునకు విరుద్ధమైన గుణము కార్యమునందే వివక్షింపబడినయెడల, అది విషమ మగును. వక్తృవివక్షనుబట్టి యీ భేదమును గుర్తింపవలసియుండును. ఇంకొక విధముగా చెప్పుకొనవచ్చును. నాశ్య నాశక భావరూపమైన విరుద్ధత్వము విభావనయందుండగా, ప్రకారభేదరూపమైన విరుద్ధత్వము విషమాలంకారము నందుండును; లక్షణమునందలి 'విరూప' పదమువలన 'భిన్నప్రకారమైన రూపము' అన్నదియే వివక్షిత మగుచున్నది. కాబట్టి అత్యంత విరుద్ధత్వము వలన విభావనయు, విరూపత్వమువలన విషమము నగునని నిర్ణయించు కొనవచ్చును.

ఆంధ్రచంద్రాలోకము

గీ: అగు విరూప కార్యోత్పత్తి యయ్యెనేని
నపరవిషమంబు; ధరణీశ్వరావతంస!
ధవళకీర్తిని నీనెడిఁ దావకీన
మేచక కృపాణి యన్నట్లు మృగధరాంక!

మూడవ భేదము

85. అనిష్టస్యా ప్యవాప్తిశ్చ తదిష్టార్థ సముద్యమాత్,
భక్ష్యాశయాహి మఞ్జూషాం దష్ట్వాఖు స్తేన భక్షితః॥

టీక : ఇష్టార్థ సముద్యమాత్ = అభిలషించిన ఫలముకొరకై ప్రయత్నించుటవలన; అనిష్టస్య = హానియొక్క; అవాప్తిః = ప్రాప్తి; తత్ + చ = అదియే

యనగా విషమాలంకారమే॥ భక్ష్య + ఆశయా=భక్ష్యములందలి యాశచేత; అహిః మఞ్జూషామ్=పాము బుట్టను; దష్ట్వా=కొఱికి; తేన=అందలి పాముచేత; ఆఖుః=ఎలుక; భక్షితః=భక్షింపబడెను.

వ్యాఖ్య : ఇష్టమును గోరి ప్రయత్నించినప్పుడు అనిష్టము కలుగుట యింకొక విధమైన విషమాలంకారము. ఇది లక్షణము. అభీష్టప్రాప్తి కొఱకు యత్నముచేయగా అభీష్టప్రాప్తి కాకపోవుటయే కాక, అనిష్టప్రాప్తియు నగుట యిందు గలదు. అభీష్టమునకు ప్రయత్నము; అనిష్టఫలము- ఇవి రెండును విరుద్ధములు. కావుననే విషమాలంకార మన్న పేరు అన్వర్థ మగుచున్నది.

ఎలుక భక్ష్యములయందలి యాశచే పాముబుట్టను కొఱికి, పాముచేత భక్షింపబడినది. ఇది లక్ష్యము. భక్ష్యములయందలి యాశచేత ప్రయత్నము సాగినది. భక్ష్యములు లభింపలేదు. ఇష్ట ప్రాప్తి కాలేదు. పైగా పాము ఎలుకను భక్షించివేసెను. ఇది అనిష్ట ప్రాప్తి. అనిష్టము అని యనగా 'హాని' యని యర్థము. ఇష్టము తీరకపోగా అనిష్టము ప్రాప్తించుటచే, ఇది విషమాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఇష్టసంసిద్ధిఁ గోర ననిష్టసిద్ధి
యయ్యెనే విషమాహ్వాయం బనఁగఁ బరఁగుఁ;
గొక్కు భక్ష్యాశ ఫణిపేటిఁ గొఱికి దాని
చేత భుజియింపఁ బడినట్లు శేషభూష !

## 39. సమాలఙ్కారః (తద్భేదాః)

**86. సమం స్యా ద్వర్ణనం యత్ర ద్వయో రప్యనురూపయోః,**
**స్వానురూపం కృతం సద్మ హారేణ కుచ మణ్డలమ్॥**

టీక ; యత్ర= ఎచ్చట; అనురూపయోః = అనురూపములైన వానికి; ద్వయోః + అపి=రెండింటికి; వర్ణనమ్=వర్ణనము జరుగునో; (తత్=అది); సమమ్=సమాలంకారము; స్యాత్=అగును॥ హారేణ=అహారముచేత; కుచమణ్డలమ్=స్తనమండలము; స్వ + అనురూపమ్=తనకు తగినటువంటి; సద్మ=సదనముగా; కృతమ్=చేయబడినది.

వ్యాఖ్య : అనురూపములైన రెండింటికి సంబంధము వర్ణితమైనయెడల సమాలంకార మగును. ఇది లక్షణము. ఇది విషమాలంకారమునకు విరుద్ధమైనది. విషమాలంకారము వలెనే యిదియు మూఁడు భేదములను కలిగియుండును. ఇచ్చట మొదటి భేదమునకు లక్షణ లక్ష్యములు నిరూపితములైనవి.

హారము స్తనమండలమును తనకు తగిన మందిరముగా చేసికొనెను- అన్నది లక్ష్యము. హారము మనోజ్ఞమైనది; స్తనమండలము సైతము మనోహరమైనది. హారము నిల్చుటకు తగినచోటు స్తనమండలము; స్తనమండలము నలంకరించుటకు తగినభూషణము హారము. ఇట్లు అనురూపములైన హారమునకును, స్తనమండలమునకును ఘటనము వర్ణింపబడినది. కావుననే యిది సమాలంకారమునకు లక్ష్యమైనది.

సమము అనగా అనురూప మని యర్థము. అనురూపములయిన వాని చేత నేర్పడుచున్న యలంకార మగుటచే దీనికి సమాలంకార మన్న పేరు సార్థక మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. పొగడఁబడె నేస్థలంబునఁ దగిన వస్తు
యుగ మది సమం బనంగను నెగడుఁ గృతుల;
నమలహారంబుచేత నాత్మానురూప
మందిరము సేయఁబడెఁ గుచమండలంబు.

రెండవ భేదము

87, సారూప్య మపి కార్యస్య కారణేన సమం విదుః,
నీచ ప్రవణతా లక్ష్మి! జలజాయా స్తవోచితా॥

టీక : కారణేన=కారణముతో; కార్యస్య=కార్యమునకు; సారూప్యమ్ + అపి=అనురూపత్వముకూడ; సమమ్=సమాలంకారముగా; (సూరయః=పండితులు); విదుః=గ్రహింతురు॥ లక్ష్మి=ఓ లక్ష్మీ; జలజాయాః=జలమునందు పుట్టిన; తవ=నీకు; నీచ + ప్రవణతా=నికృష్టులయందు ఆసక్తి, పల్లపుభూముల వైపు సాగుట; ఉచితా=తగియున్నది.

వ్యాఖ్య : కార్యమునకు కారణముతో అనురూపత్వము వర్ణితమైన యెడల సమాలంకారమగును. లక్షణమిది. విషమాలంకారమునందలి రెండవ

భేదమునకు సరిగా విరుద్ధమైనది యీ సమాలంకార భేదము. కారణ ధర్మమే కార్యమునకు సంక్రమించుట సముచితము; స్వాభావికము. అట్లు సంక్రమించి నట్లు చెప్పుట యిచ్చట ఉండును. ఈ అనురూప్యమును బట్టియే సమాలంకార మన్న పేరు సార్థక మగును.

ఓ లక్ష్మి! నీటియందు పుట్టిన నీకు నీచప్రవణత్వము తగినదే- ఇది లక్ష్యము. 'నీరు పల్ల మెఱుగు; నిజము దేవు డెఱుగు' అన్నది లోకప్రసిద్ధము కదా! పల్లమునకు ప్రవహించుట నీటికి సహజ లక్షణము. అదే లక్షణము తజ్జన్యయగు లక్ష్మికి సంక్రమించుట సముచితమే. తల్లిదండ్రుల గుణములు పిల్లలకు వచ్చును గదా! కారణము నీరు; కార్యము లక్ష్మి. కారణ ధర్మమైన నీచ ప్రవణత్వము కార్యమునకు సంక్రమించుచున్నది. ఇట్లు కారణ కార్యముల కనురూపత్వము కల్పితమగుటచేత, ఇది సమాలంకారమునకు లక్ష్యముగా సరిపడుచున్నది.

నీచప్రవణత్వము అని యనగా 'పల్లపుభూముల వైపు ప్రవహించుట' యన్నది జలవిషయమున గ్రహింపవలసిన యర్థము; 'నికృష్టులయందలి యాసక్తి' యని లక్ష్మి విషయమున గ్రహింపవలసిన యర్థము. శ్లేషమూలముగానే యిచ్చట సారూప్యము సిద్ధించుచున్నది. బీదతనముతో వేదన పడుచున్న యొకడు లక్ష్మిని ఉపాలంభనము చేయుచు వచించిన వాక్యము ప్రకృత లక్ష్యము.

ఆంధ్రచంద్రాలోకము

ఆ. కారణంబుతోడఁ గార్యమునకు సరూ
పత లభింపఁ జెప్పఁ బరఁగు సమము;
నీరజాత వగుట నీచప్రవణత నీ
కుచితమాను గద పయోజ సదన!

మూడవ భేదము

88. వినా నిష్టం చ తత్సిద్ధి ర్యదర్థం కర్తు రుద్యమః,
యుక్తో వారణ లాభోఽయం స్యాల! తే వారణార్థినః॥

టీక : యత్ + అర్థమ్ = దేనికొఱకు; కర్తుః = కర్త యొక్క; ఉద్యమః = ప్రయత్నమో; అనిష్టమ్ + వినా = అనిష్టము లేకుండ; తత్ + సిద్ధిః + చ = దాని

యొక్క సిద్ధికూడ; (సమం + స్యాత్ = సమాలంకార మగును)॥ స్యాల = ఓ బావా; వారణ + అర్థినః = వారణార్థియైన; తే = నీకు; అయమ్ = ఈ; వారణ + లాభః = వారణముయొక్క ప్రాప్తి; యుక్తః = తగినదే.

వ్యాఖ్య : దేనికై కర్త ప్రయత్నించునో అది యనిష్టము లేకుండ సిద్ధించినయెడల సమాలంకార మగును. వాంఛితమున కనురూపమైన ఫలము సిద్ధించుట యిందు జరుగును. కావుననే యిదియు సమాలంకార మగుచున్నది. ఇది విషమాలంకారమునందలి మూడవ భేదమునకు సరిగా విరుద్ధమైనది. బావా! వారణార్థివైన నీకు ఈ వారణలాభము యుక్తమే- ఇది లక్ష్యము. ఇచ్చట అపేక్షితము వారణము; ప్రాప్తము వారణము. కోరినదియును, పొందినదియును వారణమే కావున, ఇది సమాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

వారణమునకు 'ఏనుగు' అనియు, "నిరోధము" అనియు రెండర్థములు. ఒకడు ఏనుగును పొందగోరి రాజదర్శనము నభిలషించెను. ద్వారపాలకులు వానిని లోనికి వెళ్లకుండ నిరోధించిరి. ఈ విషయమును విన్న మరియొకడు ఈ వాక్యమును పలికెను. ఈ పలికినవానికి, అప్రయత్నము చేసినవాడు బాంధవ్యమునుబట్టి బావ యగును. కావున పరిహాసస్థానమే. కావునదే వారణ శబ్దమును శ్లేషించి, యిష్టసిద్ధి యైనట్లే తెల్పుట సంభవించుచున్నది.

నిజమున కిచ్చటి యిష్టసిద్ధి కేవలము శబ్దాశ్రయము. కోరినది లభింపని మాట వాస్తవమే: అంతకు మించి చేటు కలుగలేదు. కావున, అనిష్టము కలుగలేదనియే చెప్పవలయును. కావుననే, యిది సమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. సమ విభేదమే యగు ననిష్టంబు లేక
కర్తకు నభీష్ట ఫలసిద్ధి కలిగెనేని;
బావ! వారణార్థికి నీకు బాగు బాగు!
ద్వార దేశమందె లభించె వారణమ్ము.

## 40. చిత్రాలఙ్కారః

89. చిత్రం తత్ర ప్రయత్న శ్చే ద్విపరీత ఫలేప్సయా,
నమన్తి సన్త స్త్రైలోక్యా దపి లబ్ధుం సమున్నతిమ్॥

టీక : విపరీత + ఫల + ఈప్సయా = విరుద్ధమైన ఫలమునందలి కోరిక చేత; ప్రయత్నః + చేత్ = ప్రయత్నము జరిగినయెడల; తత్ర = అక్కడ: చిత్రమ్ = చిత్రాలంకారము; (వర్తతే = ఒప్పును)॥ సన్తః = సజ్జనులు; త్రైలోక్యాత్ + అపి = మూడులోకములకంటెను; సమున్నతిమ్ = ఆధిక్యమును: లబ్ధుమ్ = పొందుటకై; నమన్తి = నమ్రులై యుందురు.

వ్యాఖ్య : విపరీతమైన ఫలమునందలి కోరికచేత ప్రయత్నము జరిగిన యెడల అది చిత్రాలంకార మగును. ఇది లక్షణము. అపేక్షితమైన ఫలమునకు విపరీతమైన ప్రయత్నము చేయుట యనిరే భావార్థము. కొందరు దీనిని విచిత్రాలంకారమను పేరున వ్యవహరించుటయు నున్నది. అప్పుడు "విచిత్రం తత్ప్రయత్న శ్చేద్విపరీత ఫలేప్సయా" అన్న రీతిగా శ్లోకపూర్వార్ధ ముండును. కొన్ని ప్రతులందు పాఠమిట్లే యున్నది. అప్పుడు తత్ = ఆ యలంకారము; విచిత్రమ్ = విచిత్రము- అని యర్థము చెప్పుకొనవలయును. తక్కిన దంతయు సమానమే. కోరిన ఫలమున కనుగుణముగా ప్రయత్నము చేయవలయును. చేసిన ప్రయత్నమున కనుగుణముగా ఫలము కలుగును. ఇది స్వాభావికము. అట్లు కాక ఒకప్రయత్నము తద్విపరీత ఫలాపేక్షచేత ఇచ్చట జరుగుచున్నది. ఇది ఆశ్చర్యకరము. దీని నాశ్రయముగా చేసికొని వర్తించుటచేతనే, దీనికి చిత్రాలంకారము అన్న పేరు తగియున్నది.

మూడు లోకములకంటె నున్నతిని పొందుటకై సజ్జనులు నమ్రులై యుందురు- ఇది లక్ష్యము. 'ఉన్నతి' యనగా ఉత్కర్ష యనియు ఔన్నత్యము అనియు నర్థములు చెప్పవచ్చును. 'నమ్రులు' అనగా 'వంగి యున్నవారు' అనియు 'వినయవంతులు' అనియు నర్థములుగలవు. వంగియుండుటవలన ఔన్నత్యము తగ్గును. వంగియుండుట ప్రయత్నము; ఔన్నత్యము తగ్గుట ఫలము, కాని యిచ్చట జరుగుచున్న ప్రయత్నము ఔన్నత్యము హెచ్చుటకే కాని, తగ్గుటకు కాదు. ప్రయత్నమువలన కలుగవలసిన ఫలమును గాక, తద్విరుద్ధ ఫలమును అపేక్షించుటచేత ఇది చిత్రమే యగుచున్నది. ఉన్నతిని గోరువారు

ఉన్నతిని పెంచుకొనక నతులగుటచేత, ఇది చిత్రాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సజ్జనులు మూడు లోకములకంటె నాధిక్యమును గోరి వినయవంతులై యుందురన్నది పై వాక్యమునకు తాత్పర్యార్థము. ఇక్కడ కొందరు 'నమన్తి' యనగా "ప్రణమిల్లు చున్నారు" అన్న యర్థము చెప్పుదురు. అప్పుడది సకర్మకము. 'భగవంతునకు నమస్కరించుటచేత, తత్ప్రభావమున త్రిలోకాతిశాయి యైన యున్నతిని పొందుదు" రన్నది భావము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. క్షితిని విపరీత ఫలవాంఛచేతఁ దత్ప్ర
యత్న మగునేని నది చిత్ర మనఁగఁ బరఁగు,
నమ్రులై యుండెదరు సజ్జనంబు లెల్ల
ముజ్జగంబులకంటె సమున్నతిఁ గన.

## 41. అధికాలఙ్కారః

90 అధికం పృథు లాధారా దాధే యాధిక్య వర్ణనమ్,
బ్రహ్మాణ్డాని జలే యత్ర తత్ర మాన్తి న తే గుణాః॥

టీక ; పృథుల + ఆధారాత్=విశాలమైన యాధారముకంటె; ఆధేయ + ఆధిక్యవర్ణనమ్=ఆధేయమున కాధిక్యమును వర్ణించుట; అధికమ్ = అధికాలంకారము॥ యత్ర=ఏ; జలే=జలమునందు; బ్రహ్మాణ్డాని=బ్రహ్మాండములు; (మాన్తి=మునుగుచున్నవో) తత్ర=అచ్చట; తే=నీయొక్క; గుణాః=గుణములు; న + మాన్తి=మునుగుటలేదు.

వ్యాఖ్య : విశాలమైన యాధారముకంటె ఆధేయమున కాధిక్యమును వర్ణించినయెడల, అది యధికాలంకార మగును. ఇది లక్షణము. సాధారణముగా ఆధారము పెద్దదిగా, ఆధేయము చిన్నదిగా నుండును. ఆధార మనగా ఆశ్రయ మని యర్థము. ఆధేయ మనగా ఆశ్రిత మని యర్థము. ఇచ్చట ఆశ్రితమైన ఆధేయమున కాధిక్యము చెప్పుట జరుగుచున్నది, ఈ అధికత్వ వర్ణనమునుబట్టియే దీనికి అధికాలంకార మన్నపేరు అన్వర్థ మగుచున్నది. అధికాలంకారము రెండు భేదములను కలిగియున్నది. అందు మొదటి భేదమునకు లక్షణమిది.

ఏ జలమునందు బ్రహ్మాండములు మునుగుచున్నవో, అచట నీ గుణములు మునుగకున్నవి- ఇది లక్ష్యము. ఇది దేవదేవుని స్తుతి సందర్భముగా వచించిన వాక్యము. భగవంతుని యనంత కళ్యాణ గుణముల యాధిక్యమును వచించుట ప్రకృత ప్రసంగము.

ఇచట ఆధారము జలము; ఆధేయము గుణములు. బ్రహ్మాండములు మునుగుచున్నవనుటచే జలము యొక్క ఆధిక్యము వెల్లడి యగుచున్నది. అంతటి యాధిక్యమును కలిగియున్నప్పటికిని జలమునందు 'నీగుణములు మునుగకున్న' వని యనుటచేత గుణములు అంతకంటె మిక్కిలి యాధిక్యముగలవని స్పష్టమగుచున్నది. అధికమైన యాధారముకంటె ఆధేయమున కాధిక్యము చెప్పుట యిచ్చట జరిగినది. కావుననే, అధికాలంకారమున కిది లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. తోరమైన యాధార వస్తువులకంటె
ఘనత యాధేయమునకుఁ గూర్చిన నధికము;
నలువ మెయ్యెడనో నీట మునుఁగు నచట
మునుఁగఁ బడవు భవద్గుణంబులను కరణి.

విమర్శ : నలువ నీట మునిగి యుండుట యన్నది ప్రసిద్ధము కాదు. మూలవిధేయము కాదు. కావున లక్ష్యమును సవరించుకొనుట యవసరము. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. అధికమైన యాధారంబుకంటె నధిక
మైన నాధేయ మయ్యది యధిక మౌను;
అణఁగి యుండు నే నీట బ్రహ్మాండ సమితి
అచట భవదీయ గుణచయం బణఁగకుండు.

రెండవ భేదము

91. పృథ్వాధేయా ద్యదాధా రాధిక్యం తదపి తన్మతమ్,
కియ ద్వాగ్బ్రహ్మ యత్రైతే విశ్రామ్యన్తి గుణాస్తవ॥

పృథు + ఆధేయాత్ = పెద్దదైన యాధేయముకంటె; ఆధార +

ఆధిక్యమ్=ఆధారము యొక్క యాధిక్యము; యత్(+వర్ణితమ్)=ఏది వర్ణింప బడినదో; తత్+అపి=అదికూడ; తత్=అధికము=; మతమ్=అభిప్రాయము॥ యత్ర=ఎచ్చట; తవ+ఏతే+గుణాః=నీయొక్క యీ గుణములు; విశ్రామ్యన్తి=విశ్రమించుచున్నవో (తత్=అ); వాక్+బ్రహ్మ=వాగ్రూపమైన బ్రహ్మము; కియత్=ఎంత పరిమాణముగలది.

వ్యాఖ్య: అధికమైన యాధేయముకంటె ఆధార మధికతరముగా వర్ణితమైనయెడల, అది యధికాలంకార మగును. ఇది లక్షణము. ఇచ్చట కూడ అధికత్వము నాశ్రయించియే యలంకారము ప్రవర్తించుచున్నది. కావుననే అధికాలంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది.

నీ గుణములు విశ్రమించుచున్న వాగ్బ్రహ్మ మెంత?- ఇది లక్ష్యము. ఇదికూడ భగవత్స్తుతి సందర్భమున వచించిన వాక్యమే. ఇంతకుముందు చెప్పినట్లు భగవంతుని గుణము లపరిమేయములు; బ్రహ్మాండ సమితిని లో నిమిడించుకొన్న జలమే భగవద్గుణముల నిమిడించుకొనలేక పోయినది. గుణముల యధికత్వ మిందువలన వ్యక్తమగుచున్నది. భక్తుల స్తుతులరూపమున వాగ్బ్రహ్మము ఆ గుణములను తనలో నిమిడించుకొన గలిగినది. మరి, వాగ్బ్రహ్మ మెంతో పెద్దదై యుండవలయును. ఇచ్చట గుణము లాధేయము; వాగ్బ్రహ్మ మాధారము. ఆధారముయొక్క విపులత్వము వెల్లడి యయినది. కావుననే యిది యధికాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. అధికమైన యాధేయంబుకంటె నధిక
మన్న నాధార మద్దియు నధికమౌను;
నీ గుణంబులఁ దనలోన నింపుకొనగ
నెంత గొప్పదో వాగ్బ్రహ్మ మెంచి చూడ!

## 42. అల్పాలఙ్కారః

92. అల్పంతు సూక్ష్మాదాధేయా ద్యదాధారస్య సూక్ష్మతా,
మణిమాలోర్మికా తేఽద్య కరే జపవటీ యతే॥

టీక : సూక్ష్మాత్=సూక్ష్మమైన; ఆధేయాత్=ఆధేయముకంటె; ఆధారస్య=ఆధారముయొక్క; సూక్ష్మతా=సూక్ష్మత్వము; యత్=ఏదియో; తత్=అది; అల్పమ్+తు=అల్పాలంకారము॥ తే=నీయొక్క; మణిమాలోర్మికా=మణిమయాంగుళీయకము; అద్య=నేడు; కరే=చేతియందు; జపవటాయతే=జపమాల యగుచున్నది.

వ్యాఖ్య : అల్పమైన యాధేయముకంటె ఆధార మల్పతరమైనట్లు చెప్పినయెడల, అల్పాలంకార మగును. ఇది లక్షణము. ఇది అధికాలంకారముయొక్క రెండవ భేదమునకు సరిగా విరుద్ధమైనది. అచ్చట అధికత్వము విషయము. ఇచ్చట అల్పత్వము విషయము. కావుననే దీనికి అల్పాలంకార మన్న పేరు సార్థక మగుచున్నది.

నీ యుంగరము నేడు నీ చేతికి జపమాలయైనది- ఇది లక్ష్యము. విరహముతో కృశించిపోయిన నాయికతో తన చెలికత్తె యనుచున్న వాక్యమిది. ఉంగరము చిన్న వస్తువు. ఇది ఆధేయము. దీని కాధారము వ్రేలు కావలయును. కాని యిచ్చట చేయియే యాధారమైనది. వ్రేలికి మాత్రమే సరిపడవలసిన యుంగరము చేతికి సరిపోయినది. దీనివలన చేయి వ్రేలుయొక్క పరిమాణమును గలిగియున్నదని చెప్పినట్లయినది. దీనివలన అధారముయొక్క సూక్ష్మత తెలియును. కాని, యిది యింతటితో ఆగలేదు. ఆ యుంగరము చేతికి జపమాలవలె నైనది. దీనినిబట్టి ఆధారమునకు మరింతగా సూక్ష్మత యాపాదిత మగుచున్నది. ఇట్లు సూక్ష్మమైన ఆధేయముకంటె ఆధారమును సూక్ష్మతరముగా వర్ణించుటచేతనే, యిది అల్పాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అలఁతి యాధేయమునకంటె నల్పభావ
మధిక మాధారమున కది యల్ప మగును;
ఇపుడు నీకేల నూర్మిక జపవటాయ
మానమగుచున్న యది యనుమాడ్కి శర్వ !

### 43. అన్యోన్యాలఙ్కారః

93. అన్యోన్యం నామ యత్ర స్యా దుపకారః పరస్పరమ్,
త్రియామా శశినా భాతి శశీ భాతి త్రియామయా॥

టీక : యత్ర=ఎచ్చట; పరస్పరమ్=ఒకరి కొకరి కన్యోన్యముగా; ఉప కారః=ఉపకారము; స్యాత్=అగునో; (తత్ర=అక్కడ); అన్యోన్యం + నామ= అన్యోన్య మన్నయలంకారము, (స్యాత్=అగును)॥ శశినా=చంద్రునిచేత; త్రి యామా=రాత్రి; భాతి=ప్రకాశించును; త్రియామయా=రాత్రిచేత; శశీ = చం ద్రుడు; భాతి=ప్రకాశించును.

వ్యాఖ్య : ఒకరివలన నొకరు పరస్పరము లాభము పొందినట్లు వర్ణిం చినయెడల అది అన్యోన్యాలంకార మగును. ఇది లక్షణము. అన్యోన్యత్వము నాధారము చేసికొని యలంకారము ప్రవర్తించును. కావుననే, యిది యన్యో న్యాలంకార మన్న పేరునకు తగియున్నది.

రాత్రి చంద్రునిచేత భాసించును; చంద్రుడు రాత్రిచేత భాసించును- ఇది లక్ష్యము. రాత్రి భాసించుటకు హేతువై చంద్రుడు సహకరించుచున్నాడు. చంద్రుడు భాసించుటకు హేతువై రాత్రి సహకరించుచున్నది. ఇరువురు నొకరు భాసించుటకు మరొకరు కారణ మగుచున్నారు. పరస్పరము ప్రయో జనకరముగా వ్యవహరించుట యిచ్చట కలదు, కావుననే, యిది అన్యోన్యా లంకారమున కుదాహరణ మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. భ్రాజిలుఁ బరస్పరోపకారముగఁ జెప్ప
నది కృతులయందు నన్యోన్య మనెడుపేర;
రాత్రి శశిచేఁ బ్రకాశించు రాత్రిచేత
శశి ప్రకాశించు నన్నట్టి చందమునను.

## 44. విశేషాలఙ్కారః (తద్భేదాః)

94. విశేషః ఖ్యాత మాధారం వినాప్యాధేయ వర్ణనమ్,
గతేఽపి సూర్యే దీపస్థా స్తమశ్ఛిన్దన్తి తత్కరాః॥

టీక : ఖ్యాతమ్=ప్రసిద్ధమైన; ఆధారమ్=ఆశ్రయము; వినా + అపి=లేక పోయినప్పటికి; ఆధేయ వర్ణనమ్=ఆశ్రితముయొక్క వర్ణనము; విశేషః=విశేషా లంకారము॥ సూర్యే=సూర్యుడు; గతే + అపి=గతించినప్పటికిని; దీపస్థాః= దీపము నాశ్రయించుకొనియున్న; తత్ + కరాః=సూర్యకిరణములు; తమః= చీకటిని; ఛిన్దన్తి=ఛేధించుచున్నవి.

**వ్యాఖ్య :** ప్రసిద్ధమైన యాధారము లేకుండగనే యాధేయముయొక్క స్థితిని వర్ణించినయెడల, అది విశేషాలంకార మగును. ఇది లక్షణము. అధారము లేకుండగనే, తదాధేయముండుట విశేషము. ఆధారము నాశ్రయించుకొనియే యాధేయముండును; ఆధేయమున కాశ్రయమై యాధేయముండును. అట్లు కాకుండగనే యాధేయస్థితిని చెప్పుటచేత, విశేషాలంకార మన్నపేరు దీనికి సార్థక మగుచున్నది.

విశేషాలంకారము మూడు భేదములను కలిగియుండును. అందు మొదటి భేదమునకు లక్షణ మిచ్చుట ప్రసక్తము.

సూర్య దస్తమించినప్పటికి దీపస్థములైన తత్కిరణములు చీకటిని భేదించుచున్నవి- ఇది లక్ష్యము. సూర్యుడు ఆధారము; సూర్య కిరణములు ఆధేయము. సూర్యకిరణములు సూర్యుని నాశ్రయించుకొనియుండును. సూర్యకిరణములు తమోనాశకము లగుట ప్రసిద్ధము. ఇచ్చట ఆధారమైన సూర్యుడు లేడు. ఆధేయమైన సూర్యకిరణములు ప్రసిద్ధమైన యాధారము లేకుండగనే వర్తించుచున్నవి. ప్రస్తుతము సూర్యకిరణముల కాధారము దీపము. ఇది ప్రసిద్ధము కాదు. ఏ యాధారము ప్రసిద్ధమో ఆ యాధారమును విడిచి యాధేయము వర్తించుట యిందు కలదు. ఈ విశేష వృత్తినిబట్టియే యిది విశేషాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

'సూర్యతేజః సాయ మగ్నౌ ప్రవిశతి' అన్నది ఆగమవాక్యము. సూర్యతేజము సాయంకాలమునం దగ్నియందు ప్రవేశించును. శ్రుతివాక్య ప్రామాణ్యమునుబట్టియే వైకల్పనము సాగినది. కావుననే దీపమునుండి వెలువడినవి కూడ సూర్యకిరణములుగానే గ్రహింపబడుట జరిగినది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. తనరును విశేష మాధారమునను బాసి
నపుడు నాధేయ వర్ణన మయ్యెనేని;
నర్కుఁ డరుగ దీపస్థములగుచుఁ దత్క
రము లిరులఁ దున్మెడి ననంగ రాజమకుట!

రెండవ భేదము

95. విశేషస్సోఽపి యద్యేకం వస్త్వనేకత్ర వర్ణ్యతే,
అన్త ర్బహిః పురః పశ్చాత్ సర్వ దిక్ష్వపి సైవమే॥

టీక : ఏకం + వస్తు=ఒక వస్తువు; అనేకత్ర = అనేక ప్రదేశములందు; యది + వర్ణ్యతే=వర్ణింపబడునెడల; సః + అపి=అదికూడ; విశేషః=విశేషాలంకారమే॥ మే=నాయొక్క; అన్తః=లోపలను; బహిః=బయటను; పురః=ముందటను; పశ్చాత్=వెనుకను; సర్వదిక్షు + అపి= అన్నిదిక్కులయందును గూడ; సా + ఏవ=ఆమెయే.

వ్యాఖ్య : ఒకేవస్తు వనేక స్థలములం దున్నట్లు వర్ణితమైనయెడల, అది విశేషాలంకార మగును. ఇది లక్షణము. ఒకే యాధేయ మొకే యాధారము నాశ్రయించుకొని యుండుట సాధారణము. అట్లు కాక, ఒకే యాధేయ మొకే సమయమున ననేకములైన యాధారములను గలిగియుండుట విశేషము. ఈ విశేష స్థితినిబట్టియే దీనికి విశేషాలంకార మన్నపేరు అన్వర్థ మగుచున్నది. లోపలను, బయటను, ముందటను, వెనుకను, సర్వదిక్కులందు నామెయే కనబడుచున్నది- ఇది లక్ష్యము. విరహ కాతరుడగు నాయకుడు పలికిన వాక్యమిది. తనకు మనోలోకమునందును బహిర్లోకమునందును ప్రియురాలే సాక్షాత్కరించుచున్నదట! ఇట ప్రియురాలు ఆధేయము. లోపల, బయట మున్నగునవి యాధారములు. ప్రియురా లొకే సమయమున వేర్వేరు చోట్ల నున్నట్లు వర్ణిత మగుటచేతనే, ఇది విశేషాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అదియును విశేష మగుఁ బెక్కులైనయట్టి
యెడల నొక వస్తు వర్ణింపఁబడిన యేని;
వెలుపటను లోన ముందర వెనుక నన్ని
దెసలఁ గానంబడియె నన్న తెఱఁగున శివ!

విమర్శ : లక్ష్యమునందు ఆధేయము వాచ్యముగా లేదు; అయినను సందర్భమునుబట్టి అభ్యూహించుకొనవచ్చును. వాచ్యముగా నుండుటయే బాగుండునని యనుకొన్నయెడల కడపటి పంక్తిని 'దెసలఁ జెలి కనంబడునన్న తెఱఁగున శివ!' యని సవరణము చేసికొనిన సరిపోవును.

మూడవ భేదము

96. కిఞ్చ దారమ్భతో౾కశ్య వస్త్వన్తర కృతిశ్చ సః,
త్వాం పశ్యతా మయా లబ్ధం కల్పవృక్ష నిరీక్షణమ్॥

టీక : కిఞ్చిత్ + ఆరమ్భతః = అల్పమైన కార్యమువలన; అశక్య + వస్త్వన్తరకృతిః + చ = అసాధ్యమైన మరొక కార్యము నొనరించుటయు; (వర్ణితంచేత్ = వర్ణింపబడినయెడల); సః = విశేషాలంకారమే; (స్యాత్ = అగును)॥ త్వామ్ = నిన్ను; పశ్యతా = చూచుచున్న; మయా = నాచేత; కల్పవృక్షనిరీక్షణమ్ = కల్పవృక్షమును దర్శించుట; లబ్ధమ్ = పొందబడినది.

వ్యాఖ్య : అల్పమైన కార్యమువలన అసాధ్యమైన మరొక కార్యము కూడ సిద్ధించినట్లు వర్ణించినయెడల, అదియు విశేషాలంకారమే యగును. ఇది లక్షణము. ఒక కార్యమునందు ప్రవర్తించువాడు తత్కార్యసిద్ధిని పొందవచ్చును. అంతేకాని, అన్యకార్యసిద్ధిని పొందుట అనుభవదూరము. ఎంత యత్నించినను లభ్యముకాని దాని నలభ్య మని యందురు. సులభమైన యొక పని చేయగా అలభ్యమగు పని సైతము సిద్ధించిన దనుట విశేషము. ఈ విశేష వృత్తిని బట్టియే దీనికి విశేషాలంకార మన్న పేరు అన్వర్థమగుచున్నది.

నిన్ను దర్శించుచున్న నాకు కల్పవృక్షదర్శనము ప్రాప్తించినది- ఇది లక్ష్యము. ఒక రాజును శ్లాఘించుచు నొక యాచకుడు వచించిన వాక్యమిది. రాజును దర్శించుట శక్యమగు కార్యమే. కల్పవృక్షము దేవలోకముననుండునది. కాబట్టి మానవులకు కల్పవృక్ష దర్శనము అశక్యమగు కార్యము. శక్యకార్యమగు రాజదర్శనము వలననే అశక్యకార్యమగు కల్పవృక్షదర్శనముకూడ నైన దనుటచేత, ఇది విశేషాలంకారమునకు లక్ష్య మగుచున్నది. ఇచ్చట కూడ ఒక ప్రయత్నమువలన శక్యకార్యము, దానితో పాటుగా అశక్యకార్యము. రెండు కార్యములు సిద్ధించుట జరుగుచున్నది.

కల్పవృక్షదర్శనమువలన సర్వార్థసిద్ధి యైనట్లే రాజదర్శనము వలననే సర్వార్థసిద్ధి యగునని తాత్పర్యము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అల్పయత్నముచేత శక్యంబు గాని
యన్యవస్తువు సమకూర్ప నదియె యగును;
నిన్నుఁ గనుఁగొను నాచేత నేఁడు లబ్ధ
మయ్యెఁ గల్పద్రుమేక్షణం బన్న యట్లు.

## 45. వ్యాఘాతాలఙ్కారః (తద్భేదాః)

97. స్యా ద్వ్యాఘాతో ఽన్యథాకారి తథాకారి క్రియేత చేత్
యై ర్జగత్ప్రీయతే హన్తి తైరేవ కుసుమాయుధః॥

టీక : తథాకారి=ఒక కార్యమున కుపకరించునది; అన్యథాకారి=ఇతర కార్యమున కుపకరించునదిగా; క్రియేత + చేత్=చేయబడినయెడల; వ్యాఘాతః=వ్యాఘాతాలంకారము; స్యాత్=అగును॥ యైః=దేనిచేత; జగత్=లోకము; ప్రీయతే=ఇష్టపడుచున్నదో; తైః + ఏవ=వానిచేతనే; కుసుమాయుధః=మన్మథుడు; హన్తి=బాధించుచున్నాడు.

వ్యాఖ్య : ఒక కార్యమునకు సాధనమైన దానిని విరుద్ధ కార్యమునకు సాధనముగా చేసినట్లు వర్ణించిన వ్యాఘాతాలంకార మగును. విశేషమైన యాఘాతము వ్యాఘాతము. ఒక కార్యమునకు సాధనమైనది. తత్కార్య నిర్వాహకము కాకుండుటయే అఘాతము. పైగా, తద్విరుద్ధ కార్యనిర్వాహకమగుటయే జరిగిన విశేషమైన ఆ ఘాతము కలుగును. ఇచ్చట ఆ లక్షణమునుబట్టి వ్యాఘాత మన్న పేరు దీనికి సార్థక మగుచున్నది.

వేనిచేత లోకము సంతోషించుచున్నదో వానిచేతనే మన్మథుడు లోకమును బాధించుచున్నాడు– ఇది లక్ష్యము. లోకసంతోష సాధనములు పువ్వులు. మన్మథుడు కుసుమ శరుడు. పువ్వులనే బాణములుగా చేసికొని లోకమును బాధించును. మన్మథునివలన పువ్వులు లోకసంతాప సాధనము లగును. సహజముగా సంతోష సాధనములైన పువ్వులు సంతాప సాధనములుగా వర్ణింపబడినవి. అనగా అన్యథాకారిత్వము కల్పింపబడినది. సంతోషమునకు సంతాపము పూర్తిగా విరుద్ధము. ఇట్లు విరుద్ధకారిత్వము కల్పింపబడుటచేతనే, ఇది వ్యాఘాతాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

మన్మథునకు పంచబాణు డను ప్రసిద్ధి కలదు; కుసుమ బాణుడనియు నందురు. ఐదు విధములయిన పువ్వులే యతని బాణములు. 'అశోక మరవిన్దం చ చూతం చ నవమల్లికా శిరీషకుసుమం చైతే పఞ్చ బాణస్య సాయకాః' అని యందురు. అశోకము, అరవిందము, చూతము, నవమల్లిక, శిరీషము– అనునైదు రకముల పుష్పములను మన్మథుని బాణము లని ప్రసిద్ధి. ఇచ్చట ఆంధ్రచంద్రాలోకమున సూరకవి పద్యము కానరాదు. కావున దీనిని గ్రహింపవచ్చును.

గీ. ఒక పనికి యోగ్యమగు దాని వేఱొక్క పనికి
యోగ్యముగఁ జేయ వ్యాఘాత మొప్పుఁ గృతుల;
జగము వేనిచే మిక్కిలి సొగసు గనునొ
దానిచేతనే బాధించు నూనశరుఁడు.

విమర్శ : పై లక్ష్యమునందు ఇష్టసాధన మైనది అనిష్టసాధన మైనట్లు వర్ణించుట జరిగినది. అనిష్ట సాధనమైనది యిష్ట సాధనమైనట్లు వర్ణించుట జరుగవచ్చును. అప్పుడుకూడ ఇది వ్యాఘాతాలంకారమే యగును. పై లక్షణమునే "అన్యథాకారి తథాకారి క్రియేత చేత్" అని యథాస్థితముగా గ్రహించినయెడల దీనికి సాధక మగును. లక్ష్యమును గ్రంథకర్త యిట్లు నిర్దేశించుచున్నాడు.

98. దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః,
విరూపాక్షస్య జయినీః స్తాః స్తువే వామలోచనాః॥

టీక : దృశా=చూపుచేత; దగ్ధమ్=దహింపబడిన; మనసిజమ్=మన్మథుని; యాః=ఎవరు; దృశా + ఏవ=చూపుచేతనే; జీవయన్తి=బ్రతికించుచున్నారో; తాః= వారిని; విరూపాక్షస్య జయినీః=విరూపాక్షుని జయించిన వారిని; వామలోచనాః=మనోహర నేత్రలను; స్తువే=స్తవము చేయుదును.

వ్యాఖ్య : చూపుచేత దహింపబడిన మన్మథుని చూపుచేతనే బ్రతికించుచున్న వామలోచనలను ప్రశంసింతును- అన్నది భావము. ఇచ్చట చూపు మొదటి సంహార సాధనము; తరువాత జీవన సాధనము. మొదటిది అనిష్టము; తరువాతిది యిష్టము. అనిష్ట సాధన మిష్ట సాధన మగుటచేత ఇది కూడ వ్యాఘాతమే యగుచున్నది.

మన్మథుడు యీశ్వరుని కంటిమంటలో భస్మమయ్యెను. అతడు మరల స్త్రీల చూపుచేత జీవించుచున్నాడు. అందువలననే స్త్రీలు విరూపాక్షుని సైతము జయించినవా రగుచున్నారు.

ఈ పద్య మాంధ్రచంద్రాలోకమునందు కానరాదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. చూపుచే దగ్ధమైనట్టి చూతశరుని
వెలయు చూపులచేత జీవింపఁజేసి
తద్విరూపాక్షు జేత్రులై తనరునట్టి
చారునేత్రల నేను సంస్తవ మొనర్తు.

రెండవ భేదము

99. సౌకర్యేణ నిబద్ధాపి క్రియా కార్యవిరోధినీ,
దయా చేద్బాల ఇతి మయ్యపరిత్యాజ్య ఏవ తే॥

టీక ; సౌకర్యేణ=కార్య సౌకర్యమునందలి యపేక్షాబుద్ధితో; క్రియా =ఒకపని; నిబద్ధా + అపి=చేయబడినప్పటికిని; (సా + ఏవ=ఆ పనియే); కార్య విరోధినీ + చేత్=కార్యమునకు విఘాతము కలిగించినయెడల; (వ్యాఘాతః= వ్యాఘాతాలంకారము)॥ మయి = నాయందు; బాలః + ఇతి = పసివాడని; దయా + చేత్ = దయ యున్నట్లయిన; తే = నీకు; (అహమ్ = నేను); అపరి త్యాజ్య + ఏవ=విడువరాని వాడనే.

వ్యాఖ్య : కార్యసౌకర్యమునందలి అపేక్షాబుద్ధితో ఒక పని చేయగా, ఆపనియే ప్రకృతకార్యమునకు విఘాతము కలిగించినయెడల, అది విఘాతా లంకార మగును. ఇది లక్షణము. ఇందును కార్యసౌకర్యము నపేక్షించి చేసిన పని కార్యవిఘాతమును గలిగించుచున్నట్లు వర్ణించుట యిందు కలదు. కావున, ఇదియు విశేషమైన వ్యాఘాతమును గల్గించు లక్షణమునుబట్టి వ్యా ఘాత మన్నపేరును సార్థకము గావించుకొనుచున్నది.

పసివాడ నని నాయందు జాలి యున్నచో నన్ను విడనాడకుము- ఇది లక్ష్యము. ఇది యొక యువరాజు రాజుతో వచించిన వాక్యము. దీని వెనుక నొక కథ యున్నది. ఒక రాజు యుద్ధమునకు వెళ్లుచు తన కుమారుని నగరము నందే నిలుపుటకు నిశ్చయించుకొనెను. అందువలన 'నీవు పసివాడవు; ఇచ్చ టనే యుండుము" అని చెప్పెను. అందువలన, తనకు సౌకర్యము కలుగునని యాతని యభిప్రాయము. యువరాజు ఈ మాటనే పట్టుకొని 'నేను పసివా డను కదా! పసివాని నెవరైన విడిచిపెట్టి పోవుదురా ?' అని యడుగుచు న్నాడు. విడిచిపెట్టుటకై సౌకర్యమును కలిగించుకొనగోరి యుపయోగించిన మాటను, తద్విరుద్ధముగా, తప్పక తీసికొని వెళ్ళవలయుననుటకై యువరాజు

వాడుకొనుట జరిగినది. ఇక్కడ కార్య సౌకర్యమునకు చెప్పినమాట కార్య విఘాతమును కలిగించినది. కావుననే, యిది వ్యాఘాతాలంకారమునకు లక్షణమగుచున్నది. ఇచ్చట ఆంధ్రచంద్రాలోకమునందు సూరకవి పద్యము కానరాదు. కావున, దీనిని గ్రహింపవచ్చును.

గీ. స్వీయ సౌకర్యమును గోరి చెప్పుమాట
ప్రకృత కార్యవిఘాతమై పరఁగ నదియ;
బాలుఁడ నఁటంచు నాయందు జాలి కలిగె
నేని విడనాడి చనరాదు నీవు నన్ను.

## 46. కారణమాలాలఙ్కారః

100. గుమ్ఫః కారణమాలా స్యాద్యథా ప్రాక్ప్రాన్త కారణైః
నయేన శ్రీః శ్రియా త్యాగ స్త్యాగేన విపులం యశః॥

టీక : యథాప్రాక్ప్రాన్త + కారణైః = పూర్వోత్తర స్థానముల నతిక్రమించిన కారణములతోడ; గుమ్ఫః = రచించుట; కారణమాలా = కారణమాల యన్న యలంకారము : స్యాత్ = అగును॥ నయేన = నీతిచేత; శ్రీః = సంపద; శ్రియా = సంపదచేత; త్యాగః = దాతృత్వము; త్యాగేన = దాతృత్వముచేత; విపులమ్ + యశః = విస్తారమైన కీర్తి; (విద్యతే = కలుగును).

వ్యాఖ్య : పూర్వోత్తర స్థానముల నతిక్రమించిన కారణములతోడి రచనము కారణమాలాలంకార మగును. ఇది లక్షణము. పూర్వమునందున్న కారణము తన ప్రాంతమునందున్న కార్యమును ప్రభవింపజేయును. ఆ కార్యము తిరిగి కారణముగా మారి తన చెంతనున్న కార్యమును ప్రభవింపజేయును. అది మరల తనచెంతనున్న కార్యమునకు కారణముగా వ్యవహరించును. ఇట్లు ఉత్తరోత్తరములకు కారణభూతములయిన పూర్వవస్తువులను వరుసగా గ్రథనము చేయగా కారణమాల యగును. ఇది యొక భేదము. ఇట్లే పూర్వపూర్వములకు కారణభూతములయిన యుత్తరవస్తువులను వరుసగా గ్రథనము చేయుటవలన రెండవ భేదము కలుగును. నిజమున కిచ్చట కారణములను కార్యములను వరుసగా చెప్పుట జరుగుచున్నది. అయినను కారణగుణవర్ణనమే వక్తృ వివక్షిత మగుటచేత కారణములకే ప్రాధాన్యము నొసగుట జరుగుచున్నది. 'వివక్షా

పూర్వికా 'హి శబ్దార్థ ప్రతిపత్తిః' అన్నది ప్రసిద్ధమే కదా! ఆ న్యాయమును పురస్కరించుకొనియే దీనిని కారణమాల యని పిలుచుట సంగత మగుచున్నది.

లక్షణమునందు 'యథా ప్రాక్ప్రాప్త కారణైః' అని యనుటకు బదులుగా కొన్నిచోట్ల 'యథా ప్రక్రాన్త కారణైః' అన్న పాఠము కనవచ్చుచున్నది. ఇచ్చట 'ప్రక్రాంత' శబ్దమునుబట్టి పూర్వోక్తకారణముల నుల్లంఘింపని కారణములచేత కూర్చిన కూర్పును 'కారణమాల' యని యందురన్న తాత్పర్యము కలుగును. ఇచ్చట ద్వైవిధ్యము సూచితము కాదు. కావున ప్రాక్ప్రాప్త కారణైః' అన్న పాఠమే సమంజస మనిపించును.

నీతిచేత సంపద, సంపదచేత త్యాగము, త్యాగముచేత విపులకీర్తి కలుగును— ఇది ప్రథమ భేదమునకు లక్ష్యము. నీతి యను కారణముచేత సంపద యన్న కార్యము కలుగును; సంపద యను కారణముచేత త్యాగ మన్న కార్యము కలుగును; త్యాగ మను కారణముచేత విపులకీర్తి యన్న కార్యము కలుగును. ఇచ్చట మొదటి కారణమైన నీతి కారణముగానే మిగిలి పోయినది; చివరి కార్యమైన విపులకీర్తి తిరిగి కారణముగా వ్యవహరింపలేదు. నడుమనున్న సంపద, త్యాగము అన్నవి కార్యములుగాను కారణములుగాను వ్యవహరించినవి. మొత్తముమీద పూర్వమున్నది పరమందున్న కార్యమునకు కారణమైనది. ఆ కార్యము తత్పర మందున్న దానికి కారణమైనది. ఇట్లు పూర్వపూర్వము లుత్తరోత్తరములకు కారణములగుచు యిందు కలదు. ఇది వరుసలో కూర్పు నొందినవి. కావుననే యిది కారణమాలాలంకారమునకు లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. వరుస తప్పని కారణావళులతోడఁ
గీలు కొల్పిన కారణమాల యగును;
నీతిచే సిరి సిరిచేత దాతృతయును
దాతృతను భూరి యశ మన్నరీతి శర్వ!

రెండవ భేదము

101. భవన్తి నరకాః పాపా త్పాపం దారిద్ర్య సమ్భవం
దారిద్ర్య మప్రదానేన తస్మా ద్దానపరో భవ॥

టీక : పాపాత్=పాపమువలన; నరకాః= రౌరవాది నరకములు; భవన్తి=కలుగును; పాపమ్=పాపము; దారిద్ర్య సమ్భవమ్=పేదఱికమువలన సంభవించును; అప్రదానేన=దాతృత్వము లేనందువలన; దారిద్ర్యమ్=పేదఱికము; తస్మాత్=అందువలన; దానపరః=దానపరుడవు; భవ=కమ్ము.

వ్యాఖ్య : నరకము పాపమువలన, పాపము పేదఱికమువలన, పేదఱికము దానహీనతవలన కలుగును. కావున దానపరుడవు కమ్ము- ఇది కారణమాలయొక్క ద్వితీయభేదమునకు లక్ష్యము. ఇచ్చట కారణములు పూర్వము ప్రసక్తములై, కార్యములు అనంతరము ప్రసక్తములైనవి. నరకము అను కార్యమునకు పాపము కారణము; తిరిగి పాపము కార్యము కాగా, దానికి దారిద్ర్యము కారణమైనది; దారిద్ర్యము కార్యము కాగా దానికి అప్రదానము కారణమైనది. ఇట్లు పూర్వపూర్వ కార్యములకు ఉత్తరోత్తరములు కారణములుగా వ్యవహృతములైనవి. ఇట్లు కారణము లొక వరుసలో నిబద్ధములగుటచే, ఇదికూడ కారణమాలాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. నరకములు పాపమునఁ జే
కుఱు; బాపము లేమిచే నగును లేమి పరి
స్ఫురణం బీకుండుటచేఁ
బరఁగు నటులు గాన దానపరుఁడవు గమ్మా!

## 47. ఏకావళ్యలఙ్కారః

102. గృహీత ముక్తరీత్యార్థశ్రేణి రేకావళీ మతా,
నేత్రే కర్ణాన్త విశ్రాన్తే కరౌ దోస్స్తమ్భ దోలినౌ॥

103. దోస్స్తమ్భౌ జానుపర్యన్త ప్రలమ్బన మనోహరౌ,
జాను నీ రత్నముకురాకారే తస్య మహీభుజః॥

టీక : గృహీత ముక్తరీత్యా=గ్రహింపబడినదై విడువబడినదై యుండు రీతితోడ; అర్థశ్రేణిః=పదార్థములయొక్క వరుస: ఏకావళీ=ఏకావళి యన్న యలంకారముగా; మతా=సమ్మతము॥ తస్య=ఆ; మహీభుజః=రాజుయొక్క;

నేత్రే=రెండు కన్నులు; కర్ణాన్త విశ్రాన్తే= ఆ కర్ణవిశాలములు; కర్ణౌ = రెండు చెవులు; దోః+స్తమ్భదోలినౌ=స్తంభములవంటి భుజములవఱకు వ్రేలాడు నట్టివి; దోఃస్తమ్భౌ=స్తంభములవంటి భుజములు రెండు; జానుపర్యన్త ప్రలమ్బన మనోహరౌ= మోకాళ్ళవఱకు వ్రేలాడుటచేత మనోజ్ఞములైనవి: జానునీ= రెండు మోకాళ్ళను; రత్నముకురాకారే=రత్నదర్పణములయొక్క యాకారమువంటి యాకారము గలవి.

వ్యాఖ్య: ఇచ్చట మొదటి శ్లోకమునందలి పూర్వార్థము లక్షణము ఇందలి యుత్తరార్ధమును రెండవ శ్లోకము సమగ్రముగను కలిసి లక్ష్యము. ఇచ్చట రెండు శ్లోకముల కేకాన్వయము కలదు. ఇట్లు ఏకాన్వయముగల రెండు శ్లోకములను సామూహికముగా 'సందానితకము' అని కాని 'యుగ్మకము' అని కాని వ్యవహరింతురు.

గృహీత ముక్తరీతి తోడి అర్థశ్రేణి ఏకావళి యగును- ఇది లక్షణము. గృహీతము అనగా గ్రహింపబడినది; ముక్తము అనగా విడువబడినది. గ్రహించినదానిని విడిచి, క్రొత్తదానిని గ్రహించి మరల దానిని విడిచి, తిరిగి క్రొత్తదానిని గ్రహించి మరల దానిని విడిచి, ఇచ్చట శబ్దార్థములు ప్రసరించును. ఇది క్రిమిచలనము రీతిగా నుండునన్న మాట! నిజమున కీ రీతి యింతకు ముందు చెప్పకొన్న కారణమాలాలంకారమునందు సైతము కలదు. మాలా భేదమే ఏకావళి. కావున, దానితోడి సాదృశ్యము దీనికుండుట సహజమే. దీనిని భిన్నమగు అలంకారముగా పరిగణించుటకు తద్భిన్నత్వము కారణము. ఆ కారణము నిట్లు గ్రహింపవచ్చును. కారణమాలయందు పూర్వోత్తరములకు కారణ కార్య సంబంధము కలదు. ఇచ్చటవిశేష్య విశేషణ సంబంధము కలదు. అనగా, ఇచ్చట పూర్వపదము విశేష్యమైయుండును; ఉత్తర పదము దానికి విశేషణమై యుండును; ఆ విశేషణమునందలి యేకదేశము విశేష్యముగా గ్రహించబడును; దాని విశేషణము దాని ననుసరించును- ఇట్లు విశేష్య విశేషణ సంబంధముగల అర్థములు గృహీతములైముక్తములై పునర్గృహీత ముక్తములై వరుసగా నుండుట యిందు గలదు. వరుసగా నుండుట యన్న ధర్మమునుబట్టి 'ఏకావళి' యన్న పేరు సార్థకమగుచున్నది.

ఆ రాజునకు నేత్రములు కర్ణాంత విశ్రాంతములు; కర్ణములు బాహు పర్యంత లంబమానములు; బాహువులు జాను పర్యంత లంబమానములు; జాను

వులు రత్న ముకురాకారములు. ఇది లక్ష్యము. ఇచ్చట నేత్రములు విశేష్యము. కర్ణాంత విశ్రాంతములు అన్న ఉత్తరపదము విశేషణము. ఇందలి ఏకదేశమైన 'కర్ణ' శబ్దార్థము గృహీతమైనది; ఇది యిప్పుడు విశేష్యము. దీని ననుసరించినది విశేషణము. అందలి ఏకదేశము 'బాహు' శబ్దార్థము తిరిగి విశేష్యము కాగా తదనుసార సమావేశము విశేషణమైనది. ఇట్లు గృహీతములగుట ముక్తములగుట యొక వరుసలో జరుగుట, గృహీత ముక్తములకు విశేష్య విశేషణ సంబంధముండుట యిచ్చట కనిపించును. ఈ లక్షణములను బట్టియే, ఇది ఏకావళ్యలంకారమునకు లక్ష్యమగుచున్నవి.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అలరును గృహీత ముక్త రీత్యర్థపంక్తి
యగుచు నేకావళి యనంగ నఖిల కృతుల;
దీనికి వచింతు లక్ష్యంబు దెలియ వినుము
శైలజానాథ! ప్రమథ సంచయ సనాథ!

గీ. కన్ను లాశ్రవణాంత దీర్ఘములు శ్రవణ
ములు భుజ నికాయ భావితంబులు భుజములు
జాను లంబముల్ జానువు ల్చారు ముకుర
సదృశములు చోళ వసుమతీశ్వరున కనంగ.

## 48. మాలాదీపకాలఙ్కారః

104. దీపకైకావళీ యోగాన్మాలాదీపక ముచ్యతే,
స్మరేణ హృదయే తస్యాస్తేన త్వయి కృతాస్థితిః॥

టీక : దీపక + ఏకావళీ యోగాత్ = దీపకము యొక్కయు ఏకావళి యొక్కయు సంయోగమువలన; మాలాదీపకమ్ = మాలాదీపక మన్న యలంకారము; ఉచ్యతే = చెప్పబడును॥ స్మరేణ = మన్మథునిచేత; తస్యాః = ఆమె యొక్క; హృదయే = మనస్సునందు; తేన = మనస్సుచేత; త్వయి = నీయందును; కృతాస్థితిః = నెలకొనబడెను.

వ్యాఖ్య : దీపకైకావళుల సంయోగమువలన మాలాదీపక మగును. ఇది లక్షణము. దీపకాలంకార లక్షణము, ఏకావళ్యలంకారము నొక్కచోటనే

యున్నయెడల, అది మాలాదీపకాలంకార మగునని తాత్పర్యము. వర్ణ్యావర్ణ్యములకు ధర్మైక్యము చెప్పబడినయెడల దీపక మగునని చెప్పుకొంటిమి. ఇచ్చట ధర్మైక్య సాధకముగా ఒకేపద ముపాత్త మగునని ఆ పదమునకే "దీపకము" అన్న పేరు చెల్లునని సైతము చెప్పుకొంటిమి. గృహీత ముక్తరీతితోడి అర్థశ్రేణి ఏకావళి యగునని వెనుకనే చూచితిమి. మాలాదీపకమునందు గృహీత ముక్త రీతితోడి అర్థశ్రేణి యుండి, ధర్మైక్య సాధకమైన దీపక ముండును. ఈ రెండును గలియుటచేతనే దీనికి మాలాదీపక మన్న పేరు సార్థక మగుచున్నది.

మన్మథుడు ప్రియురాలి మనమునందు, తన్మనము నీయందు నెలకొనెను. ఇది లక్ష్యము. ఇది నాయకునితో దూతిక పలుకుచున్న వాక్యము. కృతాస్థితిః (నెలకొనెను) అన్నది 'స్మరేణ' అను కర్తతో నన్వయించుచున్నట్లు తేన (హృదయేన) అను కర్తతోకూడ అన్వయించుచున్నది. ఇచ్చట మన్మథుని ధర్మమునకు హృదయ ధర్మమునకును "కృతాస్థితిః" అనుటచేతనే ఏకత్వము సిద్ధించుచున్నది. ఇది దీపకము. "హృదయే" యని హృదయ శబ్దము గ్రహింపబడినది. "తేన" అని యనుటచేత హృదయ శబ్దార్థము గ్రహింపబడినది. మొదట హృదయశబ్దము అధికరణ కారకముగా గ్రహింపబడినది. తరువాత కరణ కారకముగా ముక్తము చేయబడినది. ఇట్లు గృహీత ముక్తరీతి యుండుట ఏకావళీ లక్షణము. ఏకావళియొక్కయు, దీపకముయొక్కయు లక్షణము లిందుండుటచేతనే, యిది మాలాదీపకాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. దీపకైకావళీ సంగతిం దనర్చి
ఖ్యాతి కెక్కు మాలాదీపకం బనంగ;
స్మరుఁడు వసియించెఁ దన్మానసమున దాని
మనసు నీయందు వర్తించె ననువిధమున.

విమర్శ : ఈ లక్ష్యమునందు దీపకలక్షణము సక్రమముగా లేదు. ఉన్నది యున్నట్లుగా అర్థావృత్తిదీపక మగునే కాని దీపకము కాదు. వసియించె, వర్తించె- అన్న క్రియాపదములు రెండు వాడబడినవి. రెండింటి స్థానమున నొక్కటియే యున్నప్పుడు దీపక మగును. కావున దీనికి సవరణ

మహనరము. లక్షణము స్రక్రమముగానే యున్నది. ఉత్తరార్ధము నందలి రెండి పంక్తులకు బదులుగా, ఈక్రింది రెండు పంక్తులను గ్రహించినయెడల లక్ష్యమ లక్షణానుకూలమై యుండును. ఇట్లు గ్రహింపవచ్చును.

గీ. కుసుమబాణుడు దాని మానసమునందు
నదియు నీయందుఁ జేకొనె నాశ్రయంబు.

## 49. సారాలఙ్కారః

105. ఉత్తరోత్తర ముత్కర్ష స్సార ఇత్యభిధీయతే,
మధురం మధు పీయూషం తస్మాత్త స్మాత్కవేర్వచః॥

టీక : ఉత్తరోత్తరమ్=ఉత్తరోత్తరము లగువానికి; ఉత్కర్షః=గొప్పద నము; సారః+ఇతి=సారాలంకార మని; అభిధీయతే=పిలువబడును॥ మధు రమ్=తియ్యనిది; మధు=తేనె; తస్మాత్=దానికంటె (తియ్యనిది); పీయూ షమ్=అమృతము; తస్మాత్=దానికంటె (తియ్యనిది): కవేః+వచః=కవి వాక్యము.

వ్యాఖ్య : పూర్వపూర్వములకంటె ఉత్తరోత్తరములకు ఉత్కర్షను వర్ణిం చినయెడల, అది సారాలంకార మగును. నిజమున కిచ్చట సైతము గృహీత ముక్తరీతి యుండును. కావుననే, యీ క్రమములో నిల్పుట జరిగినది. పూ ర్వము చెప్పిన కార్యకారణ సంబంధము కాని, విశేష్య విశేషణ సంబంధము కాని యిచ్చట లేదు. ఇచ్చట గృహీతములును ముక్తములు నగునవి ధర్మ సామ్యము గలవి. ఇవి ఉత్తరోత్తరోత్కర్షమును పొందును. ఉన్నవస్తువులలో అత్యంత సారవంత మగునదియే యుత్కర్షము నొందును. సారానుగుణముగా ఉత్కర్షము కలుగుట యన్న లక్షణమునుబట్టి దీనికి సారాలంకార మన్నపేరు సార్థక మగుచున్నది.

తేనె మధురము, దానికంటె నమృతము మధురము, దానికంటె కవి వాక్యము మధురము- ఇది లక్ష్యము. ఇచ్చట తేనె, అమృతము, కవివా క్యము అని మూడు వస్తువులు గ్రహింపబడినవి. అన్నింటికిని మధురత్వమే ధర్మము. అయినను పూర్వ పూర్వములకంటె ఉత్తరోత్తరముల కుత్కర్షము తెలుపబడినది. తేనె మధురము, దానికంటె నమృతము మధురతరము; వీని

యన్నింటియందును కవివాక్కు మధురతమము- అన్నది భావము. ఇట్లు తరతమ భావనిరూపణముచేయుట చేతనే, యిది సారాలంకారమునకు లక్ష్యముగా సరిపడియున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. సార మను పేరుగల యలంకార ముత్త
రోత్తరోత్కర్ష గతి నొప్పుచుండుఁ గృతులఁ;
దేనె యమృతంబు మధుర మల్వానికంటెఁ
గవి జనంబుల పలుకు లన్కరణి శర్వ !

## 50. యథాసంఖ్యాలఙ్కారః

106. యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః,
శత్రుం మిత్రం విపత్తిం చ జయ రఞ్జయ భఞ్జయ॥

టీక : క్రమేణ=ఒకదాని తరువాత నొకటిగా వరుసగా; క్రమికాణామ్=సమానసంఖ్యాకము లగువానియొక్క; సమన్వయః=అనుగతి; యథా సంఖ్యమ్=యథా సంఖ్యాలంకారము॥ శత్రుమ్=శత్రువును; మిత్రమ్=మిత్రుని; విపత్తిమ్+చ=అపదను; జయ=జయింపుము; రఞ్జయ=రంజింపుము; భఞ్జయ=భగ్నము చేయుము.

వ్యాఖ్య : ఒకదాని తరువాత నొకటిగా వరుసగా సమాన సంఖ్యాకము లగువానియొక్క సమన్వయము యథాసంఖ్య మగును. ఇది లక్షణము. క్రమముగా నమరింపబడినది క్రమిక. అట్టి క్రమికలు సంఖ్యాక్రమమునుబట్టి యొకదానితో నొకటి చొప్పున వరుసగా నన్వయము నొందుట యిందు గలదు. సంఖ్యాక్రమము నాశ్రయించి వర్తించున దగుటచే దీనికి యథా సంఖ్య మను పేరు అన్వర్థ మగుచున్నది.

శత్రుని మిత్రుని విపత్తిని జయింపుము రంజింపుము భంజింపుము- ఇది లక్ష్యము. ఇచ్చట ద్వితీయాంతములైన పదములు మూడు గలవు. ఇవి యొక క్రమిక. క్రియాపదములు మూడు గలవు. ఇవి రెండవ క్రమిక. మొదటి క్రమికయందలి మొదటి పదముతో రెండవ క్రమికయందలి మొదటి పద మన్వయించును. అప్పుడు 'శత్రుని జయింపుము' అన్నది యేర్పడును. అట్లే రెండవ

పద మన్వయమునొంది 'మిత్రుని రంజింపుము' అని మూడవ పద మన్వయము నొంది 'విపత్తిని భంజింపుము' అని యేర్పడును. ఇట్లు రెండు క్రమికలలోని పదములు సంఖ్యాక్రమమునుబట్టి యన్వయము పొందుటచేతనే, ఇది యథా సంఖ్యాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. వరుసనే క్రమికా సమన్వయము గలుగ
నది యథా సంఖ్య మనఁగ బెంపారుఁ గృతుల;
నహితకోటుల నాప్తుల నాపదలను
గెలుము రంజిల్లఁ జేయుము గెడపు మనఁగ.

## 51. పర్యాయాలఙ్కారః (తద్భేదాః)

107. పర్యాయో యది పర్యాయే ణైక స్యా నేక సంశ్రయః,
పద్మం ముక్త్వా గతా చన్ద్రం కామినీవదనోపమా॥

టీక : ఏకస్య=ఒక్క యాధేయమునకు; పర్యాయేణ=అనుక్రమమున; అనేక సంశ్రయః=అనేకరకములైన యాధారములను గ్రహించుట; యది (+ వర్ణితమ్= వర్ణింపబడినయెడల; పర్యాయః=పర్యాయాలంకారము॥ కామినీ వదనోపమా=స్త్రీ ముఖముతోడి పోలిక; పద్మమ్=పద్మమును; ముక్త్వా=విడిచి; చన్ద్రమ్=చంద్రుని; గతా=పొందెను.

వ్యాఖ్య : ఒకే యాధేయమునకు పర్యాయక్రమమున అధారములు పెక్కులు వర్ణితములయిన పర్యాయాలంకార మగును. ఇది లక్షణము. పర్యాయక్రమమున నని యనుటచేత ఒక యాధారమును విడిచిన పిమ్మట మరియొక యాధారమును గ్రహించుట యన్నది యిచ్చట ముఖ్యవిషయము. విశేషాలంకార భేదము 'ఒకే వస్తువు పెక్కు తావులందు వర్ణింపబడుట' యన్న లక్షణము నాశ్రయించుకొని యున్న దని చూచితిమి. అచ్చట ఆధేయ మొక్కటి; ఆధారములు పెక్కులు. ఇచ్చటకూడ ఆధేయ మొక్కటి! ఆధారములు పెక్కులు. ఇంతవరకు సామ్యమే. ఇంక వైషమ్యము చూతము. విశేషాలంకారమునందు వస్తువు వివిధా ధారముల నేక కాలముననే యాశ్రయించుకొనియుండును. పర్యాయాలంకారమునందు వస్తువు పర్యాయక్రమమున భిన్న

కాలములలో వివిధాధారముల నాశ్రయించుకొని యుండును. అనగా ఒక యాధారమును గ్రహించి, దానిని విడిచి మరొక యాధారమును గ్రహించును. గృహీత ముక్తరీతియే పర్యాయ శబ్దముచే సూచిత మగుచున్నది. ఇచ్చటి గృహీత ముక్తరీతి ఆధారాధేయ సంబంధమును ద్యోతితము చేయును. ఈ పర్యాయక్రమమును బట్టియే దీనికి పర్యాయాలంకార మన్న పేరు అన్వర్థ మగుచున్నది.

కామినీవదనోపమ పద్మమును విడిచి చంద్రుని పొందినది- ఇది లక్ష్యము. ఇచ్చట కామినీవదనోపమము ఆధేయము; పద్మము మొదటి యాధారము; రెండవ యాధారము చంద్రుడు. ఇచ్చటి యాధేయము రెండాశ్రయములను గలిగి యున్నది. మొదట నొక యాధారమును గ్రహించి, దానిని విడిచిన పిమ్మట రెండవ యాధారమును గ్రహించుట యిందున్నది. ఈ పర్యాయక్రమముచేతనే, యిది పర్యాయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

పగటిపూట పద్మములు వికసించియుండును. రాత్రిపూట పద్మములు ముకుళించుకొని పోవును. కావుననే కామినీవదనోపమము పగటిపూట పద్మము నాశ్రయించినది. రాత్రి పద్మము ముకుళించుకొని పోవును గనుక శోభ యుండదు. ఈ సమయమున చంద్రుడు విలసిల్లును. అందుచేత ఆధేయము చంద్రుని నాశ్రయించినది. ఇట్లు భిన్న కాలములందు ఆధారములు భిన్నములుగా నిరూపితములైనవి. కామినీవదనము పద్మ చంద్ర సదృశ మని చెప్పుటయే తాత్పర్య మైనప్పటికిని, పైని చెప్పినట్లు గృహీత ముక్తరీతి ననుసరించుట యిచ్చట కాననగును.

ఆంధ్రచంద్రాలోకము

కే. తనరుఁ బర్యాయ మొకవస్తువున కనేక
సంశ్రయత భాతిచేతను సంభవింపఁ;
దమ్మి విడిచి సుధాకరుఁ దవిలెఁ గామి
నీ ముఖప్రభ యన్నట్లు నీలకంఠ!

రెండవ భేదము

108. ఏకస్మి న్యద్యనేకం వా పర్యాయ స్సోఽపి సమ్మతః,
అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురా జని॥

టీక : ఏకస్మిన్ = ఒకే యాధారమునందు; అనేకమ్ = ఆధేయముల పెక్కులు; వా = క్రమమున; యది ( + వర్ణితమ్) = వర్ణింపబడినయెడల; సః + అపి = అదికూడ: పర్యాయః = పర్యాయాలంకారముగా; సమ్మతః = అంగీకృతము॥ యత్ర = ఎచ్చట; పురా = పూర్వము; స్రోతః = జలప్రవాహము; అజని = పుట్టెనో; తత్ర = అచ్చట: అధునా = ఇప్పుడు; పులినమ్ = ఇసుకతిన్నె; (అజని = పుట్టెను).

వ్యాఖ్య : ఒకే యాధారమును పర్యాయక్రమమున అనేకాధేయము లాశ్రయించు కొన్నట్లు వర్ణించినయెడల, అదికూడ పర్యాయాలంకారమే యగును. ఇది లక్షణము. ఇక్కడకూడ పర్యాయక్రమము ప్రధానము. దానిని బట్టియే పేరు సార్థక మగుచున్నది.

మున్ను జలప్రవాహము పుట్టినచోటనే, యిప్ప డిసుకతిన్నె పుట్టెను- ఇది లక్ష్యము. ఇచ్చట జలప్రవాహము మొదటి యాధేయము; ఇసుకతిన్నె రెండవ యాధేయము. రెండింటికి నాధారమైనది ఒక్కటే ప్రదేశము. మొదట జలప్రవాహ మాశ్రయించుకొనుటయు విడిచిపెట్టుటయు జరిగినవి; పిదప ఇసుకతిన్నె ఆ ప్రదేశము నాశ్రయించుకొన్నది. ఇచ్చట సైతము గృహీత ముక్తరీతి కానవచ్చుచున్నది, దీనినిబట్టియే, యిది పర్యాయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

వర్షాకాలమునందు జలమయమై యున్న స్థలమునందు ప్రవాహము ప్రవహించును. గ్రీష్మకాలము వచ్చుసరికి జలమంతయు నింకిపోయి, యిసుక తిప్ప బయటపడును. స్థలమునందు మార్పు కలుగలేదు. కాలభేదమువలన ఒకే స్థలము ప్రవాహమునకును, పులినమునకును గూడ ఆశ్రయ మగుట యిచ్చట నిరూపితము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఒక్కట ననేక మగునేని నొప్పుచుండు
నదియు వేఱొక పర్యాయ మనఁగ; దొల్లి
యెచట జనియించెను బ్రవాహ మచట నిప్పు
డిసుక తిన్నియు లన్నట్లు హీనభూప !

## 52. పరివృత్త్యలఙ్కారః

109. పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యధికయో ర్మిథః,
జగ్రాహైకం శరం ముక్త్వా కటాక్షాన్స రిపుశ్రియః॥

టీక : న్యూన + అభ్యధికయోః = అల్పమునకును అధికమునకును; మిథః=పరస్పరము; వినిమయః= మార్పిడి; పరివృత్తిః=పరివృత్త్యలంకారము॥ ఏకమ్=ఒక; శరమ్ = బాణమును; ముక్త్వా=విడిచి; సః=ఆరాజు; రిపుశ్రియః= శత్రులక్ష్మియొక్క; కటాక్షాన్=వాలుజూపులను; జగ్రాహ=గ్రహించెను.

వ్యాఖ్య : అల్పమైనదానికి అధికమైనదానికి పరస్పరము వినిమయము వర్ణించిన యెడల అది పరివృత్త్యలంకార మగును. పరివృత్తి యనగా పరివర్తన మని యర్థము; అనగా వినిమయమనియే భావము. పరివృత్తిని ఆశ్రయించుకొని యీ యలంకారము ప్రవర్తించును. కావున దీనికి పేరు సార్థకమై యున్నది.

ఒక్కబాణమును విడిచి ఆరాజు శత్రులక్ష్మికటాక్షములను గ్రహించెను- ఇది లక్ష్యము. బాణము అల్పమూల్యము కలది. శత్రులక్ష్మి అని యనగా శత్రుసంపద యని యర్థము. దీనివలన రథగజతురగ ప్రభృతి సర్వసంపదలును సంగ్రహింపబడును. రాజ్యలక్ష్మియొక్క కటాక్షములను గ్రహించె ననుటచేత రాజ్యలక్ష్మినే గ్రహించెనని యర్థము. అల్పమగు శరమును విడిచి దానికి మారుగా రాజ్యలక్ష్మిని గ్రహించె ననుటచేత ఇది పరివృత్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇంకొకటికూడ చెప్పవచ్చును. ఏకసంఖ్యాకమైన శరమును విడిచి బహుసంఖ్యాకములయిన కటాక్షములను గ్రహించె నన్నప్పుడు ఒక్కదానికి బదులుగా పెక్కింటిని గ్రహించుట యన్న లక్షణమునుబట్టి పరివృత్తియే యగును.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కావ్యములయందు న్యూనాధికముల వినిమ
యంబు పరివృత్త్యలంకృతి యంద్రు బుధులు,
ఏకవిశిఖంబు విడిచి గ్రహించె నాతఁ
డరి నృపాలక లక్ష్మీకటాక్షములను.

## 53. పరిసంఖ్యాలఙ్కారః

110. పరిసంఖ్యా నిషిద్ధ్యైక మేకస్మిన్వస్తు యన్త్రణమ్,
స్నేహక్షయః ప్రదీపేషు న స్వాంతేషు నతభ్రువామ్.

టీక : ఏకమ్ + వస్తు = ఒక వస్తువును; ఏకస్మిన్ = ఒకచోట; నిషిధ్య = నిషేధించి; (అన్యస్మిన్ = మరొకచోట); యన్త్రణమ్ = నియమించుట; పరిసంఖ్యా = పరిసంఖ్యాలంకారము॥ ప్రదీపేషు = ప్రదీపములయందు; స్నేహక్షయః = స్నేహక్షయము; నతభ్రువామ్ = యువతులయొక్క; స్వాంతేషు = హృదయములందు; న (+ స్నేహక్షయః) = స్నేహక్షయము లేదు.

వ్యాఖ్య : ఒక వస్తువున కొకచోట నిషేధము తెల్పి మరొకచోట నియమమును తెలిపినయెడల, అది పరిసంఖ్యాలంకార మగును. ఇది లక్షణము. 'పరిత్యజ్య సంఖ్యానం పరిసంఖ్యా' అన్న వ్యుత్పత్తిని బట్టి విడిచిపెట్టి పరిగణించుట యన్న ధర్మమువలన దీనికి పరిసంఖ్య యన్నపేరు సరిపడుచున్నది.

స్నేహక్షయము దీపములందే కాని చెలువల చిత్తములందు లేదు- ఇది లక్ష్యము. స్నేహక్షయము చెలువల చిత్తములందు నిషేధము పొందుచున్నది; దీపములందు నియమనము పొందుచున్నది. చెలువలచిత్తములందు స్నేహక్షయములేదు; దీపములందు స్నేహక్షయము కలదు. స్నేహక్షయము ప్రకృత విషయము. ఇది యొకచోట నిషిద్ధమై, మరిచోట నియంత్రితమగుట యిందు కలదు. కావుననే యిది పరిసంఖ్యాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

స్నేహక్షయమని యన్నప్పుడు తైలక్షయమనియు, ప్రీతిక్షయమనియు రెండర్థములు. దీపముల విషయమున తైలక్షయ మన్న యర్థమును, చెలువల చిత్తముల విషయమున ప్రీతిక్షయ మన్న యర్థమును గ్రహింపవలయును. నాయకులకొరకు రాత్రియంతయు నిరీక్షించిన నాయికలనుగూర్చి చెప్పిన వాక్యమిది. నాయకనిరీక్షణలో వేగించిన నాయికల చిత్తములందు ప్రీతి యధిక మగునేకాని తగ్గదు. వియోగమువలన ప్రేమకు పుష్టి చేకూరుట స్వాభావికము. వెలిగించిన దీపములలో తైలము తగ్గిపోవును; కాని వారి ప్రేమ తగ్గదు- అన్నది తాత్పర్యము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఒక్కచోట నిషేధించి యొకటవస్తు
యంత్రణముసేయఁ బరిసంఖ్య యనఁగఁ బరఁగు;

లేదు స్నేహక్షయంబు నాళీకముఖుల
డెందములయందు దీపములందుఁ గాని.

## 54. వికల్పాలఙ్కారః

111. విరోధే తుల్యబలయో ర్వికల్పాలంకృతి ర్మతా,
సద్యశ్శిరాంసి చాపాన్వా నమయన్తు మహీభుజః.

టీక ; తుల్యబలయోః = సమప్రాధాన్యముగల రెండింటికి; విరోధే (సతి)=విరోధము కలుగగా; వికల్పాలంకృతిః=వికల్పమన్న యలంకారము; మతా = సమ్మతము। మహీభుజః=భూపాలురు; సద్యః=వెనువెంటనే; శిరాంశి (+ వా)=శిరస్సులనుగాని; చాపాన్ + వా=ధనుస్సులనుగాని; నమయన్తు= వంతురుగాక.

వ్యాఖ్య : తుల్యబలముగల రెండింటికి విరోధము వర్ణితమైనయెడల అది వికల్పాలంకార మగును. ఇది లక్షణము. విరోధమని యనగా బాధ్య బాధకభావమని యర్థము. ఉన్న రెండువస్తువులును సమబలము కలవగుటచేత బాధ్యబాధకభావము కలుగును. రెండింటి నొక్కమాటుగా చేయుట సాధ్యము కాదు. అందుచేత, ఆ రెండింటిలో ఏదో యొక్కదానిని మాత్రమే చేయుటకు వీలగును. దీనిని గాని, దానిని గాని అని రెండింటిలో నేదో యొకదానికి మాత్రమే వీలుండుట యన్న ధర్మమునుబట్టి, అనగా పక్షాంతరబోధకత్వ మును బట్టి, దీనికి వికల్పాలంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది.

భూపాలురు వెనువెంటనే శిరస్సులనుగాని ధనుస్సులనుగాని వంతురు గాక- ఇదిలక్ష్యము. శిరస్సులను వంచుట యనగా ఓటమినంగీకరించి శరణు వేడుట. ధనుస్సులను వంచుట యనగా యుద్ధమునకు సిద్ధపడుట. శిరస్సు లను వంచుట, ధనుస్సులను వంచుట యన్నవి తుల్యబలముగల రెండు విష యములు. ఈ రెండింటి నేకకాలమున గ్రహించుటకు వీలులేదు. ఒకదానిని గ్రహించుట రెండవదానికి బాధకమగును; రెండవది బాధ్యమగును. శిరస్సు లను వంచుట యన్నది ధనుస్సులను వంచుట యన్నదానిని బాధించును. ధనుస్సులను వంచుటయన్నది శిరస్సులను వంచుట యన్నదానిని బాధించును. కావున, ఈ రెండింటిలో నొకదానిని మాత్రమే గ్రహించుటకు వీలుకలదు.

పక్షాంతరబోధకత్వ ముండుటచేత, ఇది వికల్పాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కృతిఁ దగు వికల్పమను నలంకృతి సమాన
బలములకును విరోధంబు గలుగుచుండ;
మస్తకము లొండె విండ్లొండె మనుజనాథు
లపుడు వంతురుగాక యన్నట్టు లీశ!

## 55. సముచ్చయాలఙ్కారః (తద్భేదాః)

112. బహూనాం యుగపద్భావభాజాం గుమ్ఫస్సముచ్చయః
నశ్యన్తి పశ్చాత్పశ్యన్తి భ్రమన్తి చ తవాహితాః.

టీక: యుగపత్ + భావభాజామ్ = యౌగపద్యముగల; బహూనామ్ = అనేకముల యొక్క; గుమ్ఫః=కూర్పు; సముచ్చయః = సముచ్చయ మన్న యలంకారము॥ తవ=నీయొక్క; అహితాః = శత్రువులు; నశ్యన్తి=నశింతురు; పశ్చాత్ + పశ్యన్తి = వెనుదిరిగి చూతురు; భ్రమన్తి + చ=భ్రమ్మరు లగుదురు.

వ్యాఖ్య: యౌగపద్యముగల పెక్కింటి కూర్పు సముచ్చయ మగును. ఇది లక్షణము. యుగపద్భావము యౌగపద్యము. యౌగపద్యార్హ్వములు యుగపద్భావభాజనములు ఒకేకాలమునందు జరుగుట కర్హ్వములైనవని యర్థము. ఏకకాలమునందు జరుగుటకు వీలై అవిరోధములై యుండు ననేకముల నొక్కచోటనే కూర్చినయెడల, అది సముచ్చయాలంకారమగునని భావము. సముచ్చయ మనగా సమూహమని యర్థము. దీనిని బట్టియే, అలంకారమునకు సముచ్చయ మన్నపేరు సార్థకమగుచున్నది.

నీశత్రువులు నశింతురు, వెనుదిరిగి చూతురు, దిమ్మరులగుదురు— ఇది లక్ష్యము. ఒక రాజుయొక్క పరాక్రమము నభినందించుచు పలికిన వాక్యమిది. నశించుట యనగా నష్టపోవుట యని యర్థము. సందర్భమును బట్టి దీనికి పారిపోవుట యన్నయర్థము సముచితముగా నుండును.

పారిపోవుట, వెనుదిరిగిచూచుట, భ్రమ్మరులగుట— యన్నవి వేర్వేరు పనులే. కాని, యేకకాలమునందే జరిగినవి. ఇవన్నియు శత్రువీరుల పౌరుష

హీనత్వ ప్రదర్శనమునందే పర్యవసించుచున్నవి. కావున వీనికి పరస్పరము బాధ్యబాధకభావము లేదు. కావుననే యౌగపద్యభాజనములైనవి. అవిరోధము లైన యనేకము లొక్కచోట కూర్పబడుట యన్న లక్షణమునుబట్టి యిది సముచ్చయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

లక్ష్యమునందు 'భ్రమన్తి' అనుచోట' 'భ్రశ్యన్తి' అనుపాఠము కొన్ని చోట్ల కనబడుచున్నది. భ్రశ్యన్తి అనగా భ్రష్టులగుదురని యర్థము. అనగా భూపతనము చెందుదురని తాత్పర్యము.

ఆంధ్రచంద్రాలోకము

ఆ. యౌగపద్య భాజనావళీ గుంభనం
బైన నది సముచ్చయం బటంద్రు;
సమయుదురు గనుదురు జాఱిపోదురు పాఱు
దు రని నీరిపు లన నురగభూష!

రెండవ భేదము

113. అహం ప్రథమికాభాజా మేకకార్యాన్వయోఽపి సః,
కులం రూపం వయో విద్యాధనం చ మదయన్త్యముమ్.

టీక : అహంప్రథమికా భాజామ్ = అహంకారయుక్తములగు; ఏక కార్య + అన్వయః + అపి = ఏకకార్యమునందు అన్వయముకూడ; సః = సముచ్చయాలంకారము॥ అముమ్ = ఈతనిని; కులమ్=కులము; రూపమ్= సౌందర్యము; వయః=వయస్సు; విద్యా=చదువు; ధనమ్ + చ = ధనమును; మదయన్తి = మదింపజేయుచున్నవి.

వ్యాఖ్య : అహంకారయుక్తములకు పెక్కింటి కేకకార్యాన్వయము వర్ణితమైన యెడల, అది సముచ్చయాలంకార మగును. ఇది లక్షణము. "అహమేవకార్యం కర్తుం శక్నోమి" అను భావమే అహంభావము. 'నేనే యీపనిచేయగలను. నేనే యీపని చేయగలను" అని ముందునకు వచ్చుట అహమహమిక. ఈ అహమహమికతో అనేకవస్తువు లొకేకార్యమునందు వర్తించుట యిందు జరుగును. వస్తుసముదాయముయొక్క ప్రవృత్తినిబట్టి సముచ్చయమన్న పేరు చెల్లుచున్నది.

కులము, రూపము, వయస్సు, విద్య, ధనము నీతనిని మదింపజేయు చున్నవి- ఇది లక్ష్యము. మదమును కలుగజేయుటకు పైనున్నవానిలో నే యొక్కటియైనను చాలును. అట్టి యెడల పెక్కింటిని చేర్చి యొకేకార్యము నందు ప్రవర్తింపజేయుట యిచ్చట జరుగుచున్నది. కావుననే యిది సముచ్చయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఏక మగుకారణముచేత నెనయు కార్య
మునకు బహుకారణము లుంప నొనరు నదియుఁ;
గులము రూపును వయసును గలిమి విద్య
యితని మత్తిల్లఁజేసెడి నెంతయు నన.

## 56. కారకదీపకాలఙ్కారః

114. క్రమికైకగతానాం తు గుమ్ఫః కారకదీపకమ్,
గచ్ఛత్యాగచ్ఛతి పునః పాన్థః పశ్యతి పృచ్ఛతి.

టీక : క్రమికా + ఏకగతానామ్=క్రమప్రాప్తములై యొకే యాశ్రయముతో నన్వయించువానియొక్క; గుమ్ఫః=కూర్పు; కారకదీపకమ్=కారకదీపకమన్న యలంకారము; పాన్థః=బాటసారి; గచ్ఛతి=వెళ్లును; పునః + ఆగచ్ఛతి = తిరిగివచ్చును; పశ్యతి=చూచును; పృచ్ఛతి = ప్రశ్నించును.

క్రమముగా నమరింపబడినది క్రమిక. క్రమికారూపమునొంది, యొకే యన్వయము నొందిన పెక్కింటియొక్క కూర్పు కారకదీపక మగును. ఇది లక్షణము. పెక్కింటియొక్కకూర్పు అనియున్నప్పటికిని క్రియాపదముల యొక్క కూర్పుమాత్రమే యిక్కడ ఉద్దిష్టము. ఈ క్రియాపదములన్నియు ఏకగతములగుట, యనగా పెక్కింటికి దీపనము కలుగజేయునదని చెప్పకొంటిమి. క్రియాన్వయమును కలుగజేయునది కారకము.

ఒకే కారకము క్రమముగా అనేకక్రియలను దీపింపజేయుట యన్న ధర్మమునుబట్టి దీనికి కారకదీపకము అన్నపేరు సార్థకమగుచున్నది.

బాటసారి వచ్చును, తిరిగి వెళ్ళును, చూచును, ప్రశ్నించును- ఇది లక్ష్యము. వచ్చును మున్నగు క్రియలన్నియు బాటసారి యన్న కర్తతో నన్వ

యించుచున్నవి. అనగా ఒకే కర్తృకారకము అనేకక్రియలను దీపింపజేయుట యిందు కలదు. కావుననే యిది కారకదీపకమునకు లక్ష్యమగుచున్నది.

ఇచ్చట నొక విషయమును గమనింపవలయును. పూర్వము చెప్పి కొన్న సముచ్చయాలంకారమునందలి మొదటి భేదమునకును దీనికిని సామ్యము చాల కనిపించును. లక్ష్యమును చూచినవెంటనే సముచ్చయమనియే యనిపించును. ప్రకృతకారకదీప లక్ష్యమును బట్టి సముచ్చయలక్ష్యముగూడ కారకదీపకమనియే యనిపించును. సముచ్చయమునందు యుగపద్భావ భాజకత్వము ముఖ్యము. ఇచ్చట క్రమప్రాప్తి ముఖ్యము. ప్రకృతలక్ష్యమునందు వెళ్ళుట, తిరిగివచ్చుట యన్నవి వరుసగా చెప్పబడినవి. ఇవి యొకదాని కొకటి విరుద్ధము కావున యుగపద్భావ భాజనములు కాజాలవు. అనగా ఏక కాలమునందివి జరుగుట వీలుకాదు. కాబట్టి యీ క్రమప్రాప్తిని పురస్కరించు కొనియే యిది, సముచ్చయాలంకారము కంటె భిన్నముగా ప్రతిష్ఠితమగు చున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరును గారకదీపక
మనఁ గ్రమికైకగత గుంభమైనను గృతులన్;
జనియెడిఁ గ్రమ్మర వచ్చెడిఁ
గనియెడిఁ బాంథజనుఁ డడుగఁ గడఁగెడి ననఁగన్.

## 57. సమాధ్యలఙ్కారః

115. సమాధిః కార్యసౌకర్యం కారణాన్తర సన్నిధేః,
ఉత్కణ్ఠితా చ కులటా జగామాస్తం చ భానుమాన్.

టీక : కారణాంతర సన్నిధేః = మరియొకకారణముయొక్క సాన్నిధ్యమువలన; కార్యసౌకర్యమ్=కార్యమునకు సులభత్వము కలుగుట; సమాధిః =సమాధియన్న యలంకారము॥ కులటా = జారయువతి; ఉత్కణ్ఠితా + చ= ఆసక్తయయ్యెను; భానుమాన్=సూర్యుడు; అస్తం జగామ + చ=అస్తమించెను.

వ్యాఖ్య ; కారణాంతర సన్నిధానము వలన కార్యసౌకర్యము కలిగి నట్లు వర్ణించినచో, అది సమాధ్యలంకారమగును. ఇది లక్షణము. ఒక కార్యము జరుగుట కొకకారణ మవసరము. అది యుండగా, అన్యకారణము

కూడ కాకతాళీయముగా లభించి కార్యమునకు సౌకర్యమును కలిగించిన యెడల సమాధ్యలంకార మగునని భావము. "సమ్యగా ధానం సమాధిః" అన్నది వ్యుత్పత్తి. చక్కగా ఆధానము చేయుట యన్న ధర్మమునుబట్టి దీనికి సమాధి యన్న పేరు సార్థకమగుచున్నది.

జారస్త్రీ యుత్కంఠిత యయ్యెను; సూర్యు డస్తమించెను- ఇది లక్ష్యము. జారస్త్రీకి ఉత్కంఠకలిగెను. అందువలన తాను ప్రియునికొరకై పోవలయును. ఉత్కంఠకారణము; అభిసరణము కార్యము. వెలుతురుండగా అభిసరించుట కష్టసాధ్యము. పరులు చూతురన్న సంశయము. కార్యము సానుకూలము కాదన్న భయము మొదలైనవి యుండును. ఇదే సమయమున సూర్యు డస్త మించెను. ఇప్పుడింక సంశయముకాని భయముకాని యుండవలసిన యవస రము లేదు. కార్యమునకు సౌకర్యమేర్పడినది. ఇట్లు కార్యసౌకర్యమునకు సూర్యాస్తమయమన్న అదనపుహేతువు సహకరించుచున్నది. కావుననే యిది సమాధ్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇచ్చట నింకొక విషయమును చూతము. ఒకకార్యమునందు పెక్కు కారణములు ప్రవర్తించినయెడల సముచ్చయాలంకారమునందలి రెండవ భేద మగునని చెప్పుకొంటిమి. ఇక్కడకూడ కార్యమొక్కటికాగా కారణములు రెండున్నవి. అందువలన, ఇదికూడ అందే చేరవలసియుండు ననిపించును. కాని యట్లుకాదు. సముచ్చయాలంకారము నందలి కారణములన్నియు అహం కారపూరితములు. అందున్న యేకారణమైనను కార్యమును సాధింపగలదు. సమాధియందొక్కటి మాత్రమే కార్యసాధకమగు కారణము. రెండవది సహకారికారణము మాత్రమే. సహకారికారణము కార్యమున సౌకర్యమును కలిగించునే కాని కార్యమును సాధింపజాలదు. సమప్రాధాన్యముగల కారణ ములవలన సముచ్చయాలంకారమే యగును. అట్లు కానినాడు సమాధ్యలం కారమే యగును. ఇది నిష్కర్షము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కార్యసుకరత వేఱొక్క కారణాప్తి
వలనఁగలుగ సమాధినా నలరుఁగృతులఁ;
గులట వాంఛను బొందె నర్కుఁడును గ్రుంగె
ననెడు చందాన శైలకన్యాసహాయ!

## 58. ప్రత్యనీకాలఙ్కారః

**116.** ప్రత్యనీకం బలవతశ్శత్రోః పక్షే పరాక్రమః,
జైత్రనేత్రానుగౌ కర్ణౌ వుత్పలాభ్యా మధఃకృతౌ॥

టీక : బలవతః=బలవంతుడగు; శత్రోః=శత్రువుయొక్క; పక్షే = పక్షమునకు విరుద్ధముగా; పరాక్రమః = శౌర్యము; (వర్ణితంచేత్ = వర్ణింపబడిన యెడల); ప్రత్యనీకమ్=ప్రత్యనీకమన్న యలంకారము॥ ఉత్పలాభ్యామ్=రెండు నల్లగలువలచేత; జైత్రనేత్రానుగౌ= జయశీలముగల నేత్రముల ననుసరించునవైన; కర్ణౌ=రెండు చెవులు; అధఃకృతౌ=క్రిందుచేయబడినవి.

వ్యాఖ్య : బలవంతుడగు శత్రువుయొక్క పక్షముపైని శౌర్యము వర్ణింపబడినయెడల, అది ప్రత్యనీకాలంకార మగును. ఇది లక్షణము. అనీక మనగా సైన్యమని యర్థము. శౌర్య మనియే తాత్పర్యము. ప్రతి యన్న యుపసర్గ విరుద్ధార్థ బోధమున నుపయుక్త మగును. విరుద్ధముగా ప్రయోగింపబడిన పరాక్రమము అన్నది ప్రత్యనీక మన్న శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము.

శత్రువు తనకంటె బలవంతుడైనపుడు శత్రువునేమియు నొనరింపజాలక, తత్పక్షములోనివారిపైని ప్రతాపము చూపుట లోకసామాన్యము. ఇచ్చటకూడ అట్లే జరుగును. ఇట్లు శత్రు పక్షమునకు విరుద్ధముగా ప్రతాపము చూపుట యన్న ధర్మమునుబట్టి ఆలంకారమునకు ప్రత్యనీక మన్నపేరు అన్వర్థమగుచున్నది.

జైత్రనేత్రానుగములైన కర్ణములను నల్లగలువలు క్రిందుచేసినవి- ఇది లక్ష్యము. విశాలములైన నేత్రములని చెప్పుటకు కర్ణాంతాయత నేత్రములని యనుట ప్రసిద్ధము. దీనినిబట్టి నేత్రముల ననుసరించియే కర్ణము లుండునని తెలును. కావున కర్ణములు నేత్రానుగములు. నేత్రములకు నుత్పలములకు సారూప్యము గలదు. కొందరు కవులు నేత్రము లుత్పలములను జయించునని కూడ చెప్పుదురు. కావుననే నేత్రములు జైత్రములగును. అట్లు తమ్ము జయించు నేత్రములను జయింపలేక, నల్ల గలువలు నేత్రములకు సేవకులయిన కర్ణములను క్రిందుచేయుచున్నవి. ఇట్లు పరపక్షముపైని పరాక్రమము చూపుట యన్న లక్షణమువలన, ఇది ప్రత్యనీకాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

అనుగము లని యనగా అనుసరించి యుండున వని యర్థము. అందు వలననే సేవకు లన్న యర్థాంతరముకూడ కలుగును. నల్ల గలువలు కర్ణభూషణములుగా ధరింపబడినపుడు చెవులకు మీది భాగమున నుండును. దానినే చెవులను 'క్రిందుచేయుట' గా చమత్కరించుట జరిగినది. ఆంధ్రచంద్రాలోకమునం దీ శ్లోకమునకు సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. సబలుఁ డగునట్టి శత్రు పక్షంబు పైని
డాక చూపింప నది ప్రత్యనీక మౌను;
చైత్ర నేత్రానుసారులౌ శ్రోత్రములను
నొక్కమెయిఁ గ్రింద గావించె నుత్పలములు.

## 59. కావ్యార్థాపత్త్యలఙ్కారః

117, కైముత్యేనార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే,
స జిత స్త్వన్ముఖే నేన్దుః కా వార్తా సరసీరుహామ్॥

టీక : కైముత్యేన = కైముత్యముచేత; అర్థసంసిద్ధిః = ఇష్టార్థలాభము; కావ్యార్థాపత్తిః= కావ్యార్థాపత్తి యన్న యలంకారముగా; (సూరిభిః= పండితులచేత): ఇష్యతే=కోరబడుచున్నది॥ త్వత్ + ముఖేన= నీయొక్క వదనము చేత; సః=ఆ ప్రసిద్ధుడగు; ఇన్దుః= చంద్రుడు; జితః= జయింపబడెను; సరసీరుహామ్=పద్మములయొక్క; కా + వార్తా=మాట యేమి ?

వ్యాఖ్య : కైముత్యముచేత ఇష్టార్థసిద్ధి వర్ణితమైనయెడల, అది కావ్యార్థాపత్తి యన్న యలంకారమగును. ఇది లక్షణము. 'కిముతః' అని యనగా 'ఇంక నెంత' యని యర్థము. 'కిముతస్య భావః కైముత్యమ్'. కిముత భావను కైముత్యము. దుష్కరవస్తుప్రాప్తిని దెల్పి కైముత్య న్యాయమున సుకర వస్తు లాభమును స్ఫురింపజేయుటయే యిచ్చట కలదు. అభిలషితమైన అర్థమును పొందుట అర్థాపత్తి. నిజమున కిట్లే పిలువవచ్చును. కాని తార్కికులు కూడ అర్థాపత్తిని ఖాదుకొందురు. తార్కికుల అర్థాపత్తికంటె ఇది భిన్నము. అందు వలన, ఇది కావ్యసంబంధమైన యర్థాపత్తి యన్న స్పష్ట నిర్దేశముతో కావ్యార్థాపత్తి యన్న పేరు నన్వర్థము చేసికొనుచున్నది.

నీముఖ మా చంద్రునే జయించెను; ఇంక పద్మముల మాట యేమి? అన్నది లక్ష్యము. ప్రియుడు తన ప్రేయసీ ముఖసౌందర్యమును ప్రశంసించుచు పలికిన వాక్యమిది. 'ఆ చంద్రుడు' అని యనుటచేత ప్రసిద్ధుడగు చంద్రుడని భావము. చంద్రుడు పద్మవైరి; పద్మముల నోడించిన ప్రసిద్ధి యాతనికున్నది. అట్టి చంద్రుని ముఖమిప్పు డోడించినది. మరి చంద్రునిచేతనే యోడిపోయిన పద్మములు చంద్రునే యోడించిన ముఖముచేత నోడిపోవుట తప్పదని చెప్పవలసిన యవసరములేదు. కైముత్య న్యాయముచేతనే యది సిద్ధించును. ఒక బలవత్తరమైన పని చేసినవాడు సామాన్యమైనపని విషయమున సమర్థుడే యగునని చెప్పుట యవసరము. దండాపూప న్యాయము దీనినే వెల్లడించును. ఎలుకల బారి పడకుండ నుండుటకై పిండివంటలను ఒక కఱ్ఱకు కట్టి యెత్తుగా ఉంచగా, ఎలుకలు కఱ్ఱను కొఱికివేసినవి. దానితోపాటుగా భక్ష్యములను తినివేసినవి. ఈ వార్తను చెప్పువాడు 'ఎలుకలు కఱ్ఱను కొఱికివేసినవి' అని యన్నంతలోనే భక్ష్యములనుగూడ తినివేసిన వన్న యర్థము తప్పక స్ఫురించును. ఇచ్చటకూడ అట్లే ముఖము చంద్రజయము సాధించినదని చెప్పుటచేత, పద్మజయముకూడ సాధించినట్లే యగుచున్నది. ఈ విధముగా ఇష్టార్థప్రాప్తి యగుటచేతనే, ఇది కావ్యార్థాపత్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. ఏపారుచుండుఁ గావ్యా
ర్థాపత్తి యనంగఁ గృతులయందును గైము
త్యాపాదితార్థ సిద్ధత
శ్రీ పర్వత దుహితృ రమణ! శేషాభరణా!

గీ. శక్రసీల తిరస్కార చారుచికుర
గెలిచెఁ దనదు ముఖంబుచే జలజరిపునిఁ
బంకజంబులవార్త చెప్పంగ నేల
యనెడు చందాన శైలకన్యాసహాయ!

విమర్శ: కందపద్యమునందు లక్షణము మాత్రమే నిరూపితమైనది. లక్ష్య ప్రదర్శనమునకై తరువాతి గీతపద్యము వ్యవహృతమైనది.

## 60. కావ్యలిఙ్గాలఙ్కారః

118. సమర్థనీయ స్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్,
జితోఽసి మన్ద కన్దర్ప ! మచ్చిత్తేఽస్తి త్రిలోచనః॥

టీ : సమర్థనీయస్య = సమర్థన సాపేక్షమైన; అర్థస్య = అర్థమునకు; సమర్థనమ్=సమర్థనము ; కావ్యలిఙ్గమ్=కావ్యలింగ మన్న యలంకారము॥ మన్ద =జడుడా; కన్దర్ప=మన్మధుడా: జితః + అసి=జయింపబడితివి; మత్ + చిత్తే =నా మనస్సునందు; త్రిలోచనః=ఈశ్వరుడు; అస్తి=ఉన్నాడు.

వ్యాఖ్య : సమర్థనీయమైన యర్థమునకు సమర్థనము కావ్యలింగము. ఇది లక్షణము దుష్కరమైన యర్థమును చెప్పినపుడు, దాని దుష్కరత్వము వలన హేతు పురస్సరముగా సమర్థించుకొనుట యావశ్యకమగును. అట్లు ఆవశ్యకమైనప్పుడు సమర్థించుకొనినట్లు వర్ణించినచో, అది కావ్యాలింగాలంకార మగును.

'లింగము' అని యనగా "రుజువు" అని యర్థము. ఇతర శాస్త్రములందు దీనికి వేర్వేరర్థములు నుపయోగములు నున్నవి. కావుననే కావ్యసంబంధమైన దృష్టాంత ప్రదర్శన మన్న యభిప్రాయముతో కావ్యలింగము అన్న పేరు అలంకారమునకు ఆరూఢమైనది.

జడుడా ! మన్మధుడా ! జయింపబడితివి; నా మనస్సున త్రిలోచను డున్నాడు_ ఇది లక్ష్యము. మన్మధుడు జయింపబడుట యన్నది దుష్కర విషయము. దానిని ప్రతిష్ఠించుకొనవలసిన యావశ్యకమున్నది. అనగా, అది సమర్థనీయ మగుచున్నది. కావున హేతువును చూపి, తానన్న విషయమును సమర్థించుకొనవలయును. అందువలన 'నా మనస్సున త్రిలోచను డున్నాడు' అన్న వాక్యము ప్రవర్తింపవలసి వచ్చినది. తాను శివభక్తుడ ననియు, అందువలన తన మనస్సునందు శివు డున్నాడనియు, శివుడు దర్పకాంతకుడు కావున మన్మధుడు జితు డనియు మీది వాక్యము తాత్పర్యము. దీనివలన "జితోఽసి' అన్నది ప్రతిష్ఠిత మగుచున్నది. ఇట్లు రుజువుచూపి సమర్థనీయమును సమర్థించుట యన్న ధర్మమును బట్టియే ఇది కావ్యలింగాలంకారమునకు లక్ష్యమైనది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. సాధనీయార్థ సిద్ధికి సాధనంబు
కావ్యలింగ మనంగఁ బ్రఖ్యాతి కెక్కు;
మనసిజుఁడు గెల్వఁ బడియెడు మన్మనంబు
లో నిలిచియున్నవాఁడు త్రిలోచనుండు.

విమర్శ : సమర్థనీయము, సమర్థనము- అని యనుటకు బదులుగా లక్షణమునందు సాధనీయము, సాధనము అన్న పదములు ప్రయుక్తములైనవి. సాధనీయము సాధింపదగినది. సాధనమునకు 'పరికరము' అనికాని 'అభ్యాసము' అనికాని యర్థము చెప్పవచ్చును. ఆపదము అచ్చట సంగతములుకావు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. అగును గావ్యలింగంబు సమర్థనీయ
మైన యర్థంబు గాంచ సమర్థనంబు;
జితుఁడవైతివి మదన ! నా చిత్తమందు
వెలసియుండెఁ జుమ్ము లలాటవీక్షణుండు !

## 61. అర్థాన్తరన్యాసాలఙ్కారః (తద్భేదాః)

119. ఉక్తి రర్థాన్తర న్యాస స్స్యా త్సామాన్య విశేషయోః,
హనూమా నబ్ధి మతర ద్దుష్కరం కిం మహాత్మనామ్॥

టీక : సామాన్య + విశేషయోః = సామాన్యార్థముయొక్కయు విశేషార్థముయొక్కయు; ఉక్తిః = చెప్పుట; అర్థాన్తరన్యాసః=అర్థాంతరన్యాస మన్న యలంకారము; స్యాత్=అగును॥ హనూమాన్=హనుమంతుడు; అబ్ధిమ్=సముద్రమును; అతరత్=దాటెను; మహాత్మనామ్=మహాత్ములకు; దుష్కరమ్=దుస్సాధము; కిమ్=ఏమి.

వ్యాఖ్య : సామాన్యవిశేషములను చెప్పుట యర్థాంతరన్యాసాలంకారము. ఇది లక్షణము. విశేషమును చెప్పి, దానిని సమర్థించుటకుగాను సామాన్యమును చెప్పినయెడల అర్థాంతర న్యాసమందలి మొదటి భేదమేర్పడును. సామాన్యమును చెప్పి, దానిని సమర్థించుటకుగాను విశేషమును చెప్పిన

యెడల అది రెండవ భేదమగును. రెండుచోట్ల నున్నది ఒక యర్థమును సమ ర్థించుటకు అర్థాంతరమును న్యాసము చేయుటయే. కావున దీనికి అర్థాంతర న్యాస మన్నపేరు అన్వర్థ మగుచున్నది.

హనుమంతుడు సముద్రమును దాటెను; మహాత్ములకు దుష్కరమేమి? ఇది లక్ష్యము. ఇందు మొదటి భాగము విశేషార్థము. ఒక వ్యక్తికి మాత్రమే సంబంధించిన విషయము. దీనిని సమర్థించుటకై యుత్తరభాగము ప్రవర్తించి నది. ఇది సామాన్యార్థము. విశేషార్థమును చెప్పి, దానిని సామాన్యార్థముచేత సమర్థించుట యిచ్చట జరుగుచున్నది. ఇట్లు అర్థాంతరమును న్యాసము చేయుట జరుగుటచేతనే యిది అర్థాంతరన్యాసమునకు లక్ష్య మగుచున్నది. ఇది మొదటి భేదము.

ఇచ్చట నింకొక విషయమును గమనించుట యవసరము. 'హనుమం తుడు సముద్రమును దాటెను" అన్న విషయము వాస్తవ కథనము. ఇది సమ ర్థన సాపేక్షము కాదు. అయినను సమర్థించుట జరుగుచున్నది. ఈ సమర్థ నము వలన ఉత్తర విషయమునకు కొంత బలము చేకూరుచున్నమాట వాస్త వము. సమర్థనము లేనిమాత్రమున కొరత కానరాదన్న మాట వాస్తవమే. ఇట్లుకాక, సమర్థన సాపేక్షమైన యంశమును సమర్థించుట జరిగినయెడల, అది కావ్యలింగమే యగును. అర్థాంతరన్యాసమునందు సామాన్య విశేషము లొక దానినొకటి సమర్థించుకొనుట యై ప్రదర్శింపబడుటయే ప్రధాన విష యము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. సర్వ సామాన్యమును విశేషంబు నుక్తి
యమర నర్థాంతరన్యాస మనఁగఁ బరఁగు;
నాంజనేయుఁడు లంఘించె నంబురాశి
యహహా! దుస్తరమెద్ది మహాత్ములకును!

రెండవ భేదము

120. గుణవద్వస్తు సంసర్గా ద్యాతి స్వల్పోఽపి గౌరవమ్,
పుష్పమాలానుషఙ్గేణ సూత్రం శిరసి ధార్యతే॥

టీక : గుణవత్ + వస్తు + సంసర్గాత్=గుణముగల వస్తువుయొక్క సాంగత్యము వలన; స్వల్పః + అపి= స్వల్పవస్తువైనను; గౌరవమ్ + యాతి= గౌరమును పొందును; పుష్పమాలా + అనుషఙ్గేణ= పూలచూలతోడి సాంగత్యము వలన; సూత్రమ్=దారము; శిరసి=తలపైని; ధార్యతే=ధరింపబడును.

వ్యాఖ్య : గుణవంతమైన వస్తువుతోడి సాంగత్యమువలన స్వల్పవస్తువు కూడ గౌరవము నొందును; పుష్పమాలా సాంగత్యము వలన దారము తలపైని ధరింపబడుచున్నది. ఇది లక్ష్యము. ఇందు మొదటి భాగము సామాన్యార్థము. దీనిని సమర్థించుటకుగాను తరువాతి భాగము ప్రవర్తించుచున్నది. సామాన్యార్థమును విశేషార్థముచేత సమర్థించుట యిక్కడ విషయము. కావుననే, ఇది అర్థాంతరన్యాసమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. సగుణ వస్తువుతోడి సంసర్గ మెనసి
స్వల్పవస్తువేనియు గౌరవమును బడయు,
కుసుమమాలల తోడుతఁ గూడి కాదె
అల్పసూత్రమ్ము శిరముపై నధివసించు !

## 62. వికస్వరాలఙ్కారః

**121.** యస్మిన్విశేష సామాన్యవిశేషాః స్స వికస్వరః,
స న జిగ్యే మహాన్తో హి దుర్ధర్షా స్సాగరా ఇవ॥

టీక : యస్మిన్= దేనియందు; విశేష + సామాన్య + విశేషాః= విశేషమును, సామాన్యమును, విశేషమును; (వర్తన్తే= ఉండునో); సః= అది; వికస్వరః=వికస్వరాలంకారము॥ సః=అతడు; న + జిగ్యే=ఓడింపబడలేదు; సాగరాః + ఇవ=సముద్రములవలె; మహాన్తః=పెద్దలు; దుర్ధర్షాః + హి= అణపరానివారు కదా.

వ్యాఖ్య ; విశేష సామాన్య విశేషములు దేనియందుండునో అది వికస్వరాలంకారము. ఇది లక్షణము. అర్థాంతరన్యాసమునందువలె విశేషసామాన్యములు మాత్రమే కాక, మరల నొక విశేషముండుట యిచ్చటి విశిష్టత. ఇది

సమర్థ్యసమర్థక భావముతో నుండును. అనగా ఉపమాన ప్రదర్శనముచేత సమర్థించుట జరుగవచ్చును; లేదా ఇంకొక విశేషార్థమును ప్రదర్శించి సమర్థించుట జరుగవచ్చును. ఒక విశేషమును చెప్పి, దానిని సమర్థించుటకై సామాన్యమును చెప్పుట జరుగును. ఈ సమర్థనము శక్తిమంతముగా లేదన్న భావముతో, మరల నింకొక విశేషమును చెప్పుటవలనగాని, యుపమానమును చూపుటవలనగాని సమర్థించుట జరుగును. "వికసన్ సాధు కరోతి వికస్వరః" అన్న వ్యుత్పత్తినిబట్టి దీనికి వికస్వరాలంకారము అన్నపేరు అన్వర్థమగుచున్నది. సమర్థనమును వికసింపజేసి, యనగా మఱింత శక్తిమంతముచేసి సమర్థనీయమును సాధువు గావించుటయే యిచ్చట విషయము.

అతడు జితుడు కాడు. మహాత్ములు సాగరములవలె దుర్ధర్షులు కదా! ఇది లక్ష్యము. ఇది ఒక రాజు పరాక్రమమును గూర్చి పల్కిన వాక్యము. ఆ రాజు అజయ్యుడు. ఇది విశేష విషయము. దీనిని సమర్థించుటకై 'మహాత్ములు దుర్ధర్షులు కదా' అన్న సామాన్యార్థము ప్రసక్తమైనది. మహాత్ములు దుర్ధర్షులన్న విషయము ప్రతిష్ఠింపబడినప్పుడు గాని దీనివలన విశేషమును సమర్థింపగల సామర్థ్యము దీనికి గలుగదు. కావున దీనికొక రుజువు చూపుట యవసరము. అందుకొరకు ఉపమానము నాశ్రయించుట జరుగుచున్నది. 'మహాత్ములు సాగరములవలె దుర్ధర్షులు' అని యన్నప్పుడు సాగరముల యపారత్వమును బట్టి దుర్ధర్షత్వము ప్రసిద్ధమే కనుక మహాత్ముల దుర్ధర్షత్వము కూడ స్థాపింపబడును. అప్పుడిది పూర్వోక్తమైన విశేషార్థమును సమర్థించుటకు సమర్థమగును. ఇట్లు సమర్థమునకు సమగ్రవికాసము కల్పింపబడుటచేతనే యిది వికస్వరాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. చెలగున విశేష సామాన్యములు విశేష
మెచట నచట వికస్వరం బెసక మెసగు;
అతఁ డజయ్యుఁడు దుర్ధర్షు లయ్యెదరు గ
దా మహానుభావులు సముద్రంబు లట్లు!

## 63. ప్రౌఢోక్త్యలఙ్కారః

122. ప్రౌఢోక్తి రుత్కర్షాహేతౌ తద్ధేతుత్వ ప్రకల్పనమ్,
కచాః కళిన్దజా తీర తమాలస్తోమ మేచకాః॥

టీక ; ఉత్కర్ష + అహేతౌ=ఆధిక్యమునకు కారణముకాని దానియందు; తత్ + హేతుత్వ ప్రకల్పనమ్ = ఉత్కర్షకు హేతుత్వమును కల్పించుట; ప్రౌఢోక్తిః=ప్రౌఢోక్తి యన్న యలంకారము॥ కచాః=కురులు; కళిన్దజాతీర= యమునానదియొక్క యొడ్డున నున్న; తమాలస్తోమ= చీకటిచెట్ల సమూహము వలె; మేచకాః=నల్లగా నున్నవి.

వ్యాఖ్య : వస్తూత్కర్షమునకు హేతువుకానిదానిని హేతువుగా చెప్పిన యెడల, అది ప్రౌఢోక్తియన్న యలంకార మగును. ఇది లక్షణము. ఒక కార్యమునకు హేతువు కానిదానిని హేతువుగా నూహించుటచేత ఉత్ప్రేక్షా భేద మగునని పూర్వము చూచితిమి. దీనికిని దానికినిగల భేదమును గమనించుటే యవసరము. ఉత్ప్రేక్షయందు వస్తుసిద్ధికే హేతువును భావించుట జరుగును. ప్రౌఢోక్తియందు వస్తుసిద్ధికి కాక, తదుత్కర్షమునకు హేతువును కల్పించుట జరుగుచున్నది.

ప్రౌఢోక్తి యనగా ప్రౌఢులయొక్క ఉక్తి యర్థము. ఇచ్చట అనల్ప కల్పనసమర్థత ప్రౌఢికి లక్షణమగుచున్నది. ప్రౌఢులచేత, ఉత్కర్షముకొరకై హేతువుకాని దానిని హేతువుగా కల్పించుట యన్న లక్షణముచుబట్టి దీనికి ప్రౌఢోక్త్యలంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది.

కురులు యమునాతీరమున నున్న చీకటిచెట్ల సమూహమువలె నల్లగా నున్నవి– ఇది లక్ష్యము. 'కురులు చీకటిచెట్ల సమూహమువలె నల్లగా నున్నవి' యని యన్నయెడల పూర్ణోపమాలంకారమే యగును. నడుమ 'యమునా తీరమున నున్న' అన్న భాగమువలన హేతుత్వప్రకల్పనము జరుగుచున్నది. యమునానదీ జలములు నల్లనివి. చీకటిచెట్లుగూడ నల్లనివే. యమునానదీ తీరమున నున్న చీకటిచెట్లు కావున ఆశ్రయగుణమునుబట్టి ఆశ్రితములకు మరింత నల్లదనము సంక్రమింపవలయును. అట్లు పొందిన నల్లదనమువంటి నల్లదనము కురులకు కలదనుట యిచ్చటి విషయము,

నిజమునకు స్వాభావికముగనే తమాలవృక్షములు నల్లగానుండును. ఆ నల్లదనమునకు అతిశయమును సంపాదింపగోరి యమునానదీ తీరస్థితిని జోడించుట జరిగెను. ఇందువలన నైల్యము పెరుగదు. అయినను ప్రౌఢసుందరమైన కల్పనము చమత్కృతిని కలిగించుచున్నది. కావున నే ప్రౌఢోక్తి కిది లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఎసఁగుఁ బ్రౌఢోక్తి యుత్కర్ష హేతు వమరు
దాని కతిశయ కారణత్వము నుడివినఁ
దరుణికురులు కళిందజా తట తమాల
సముదయ శ్యామలము లనుచందమునను.

విమర్శ : పై లక్షణము సక్రమముగా లేదు. "ఉత్కర్షహేతు వమరుదాని కతిశయకారణత్వము నుడివిన" అన్నది 'అతిశయాహేతువైన దాని కతిశయకారణత్వము నుడివిన' అని మార్పు చేసికొనిన సరిపోవును. ఉత్కర్షహేతు వమరుదానికి ఉత్కర్ష హేతుత్వమును చెప్పుట యిచ్చట జరుగుట లేదు. కాక, ఉన్నదానిని ఉన్నదని చెప్పుట యావశ్యకమే కాదు. ఇచ్చట అహేతువును హేతువుగా కల్పించుట జరుగుచున్నది కావున పై విధముగా సవరించుకొనుట యావశ్యకము.

## 64. సంభావనాలఙ్కారః

125. సంభావనం యదిత్థం స్యా దిత్యూహోఽన్యస్య సిద్ధయే,
యది శేషో భవేద్వక్తా కథితాస్స్యుర్గుణా స్తవ॥

టీక ; అన్యస్య=వివక్షితార్థము యొక్క; సిద్ధయే= సిద్ధికొరకు; ఇత్థమ్= ఈ విధముగా; యది + స్యాత్=అయినయెడల; ఇతి + ఊహః=అని యూహించుట; సంభావనమ్ = సంభావనాలంకారము॥ శేషః= శేషుడు; వక్తా= వక్త; యది + భవేత్=అయినయెడల; తవ=నీయొక్క; గుణాః=గుణములు; కథితాః =వర్ణితములు; స్యుః=అగును.

వ్యాఖ్య : వివక్షితార్థ సిద్ధికొరకై, యిది యిట్లయినయెడల నని యూహించుట సంభావనాలంకారము. ఇది లక్షణము. యథాస్థితముగా వివక్షితా

ర్థము సిద్ధింపకుండుటచేత ఊహను ఆశ్రయించుట యిచ్చట జరుగుచున్నది. సంభావన మనగా ఊహయని యర్థము. చేదర్థకము నాశ్రయించుకొని యున్న యూహనుబట్టియే దీనికి సంభావన మన్నపేరు సార్థక మగుచున్నది.

శేషుడు వక్తయైన నీ గుణములు వర్ణితములగును- ఇది లక్ష్యము. ఇది రాజును ప్రశంసించుచు వచించిన వాక్యము. ఇచ్చట 'అయినన్' అన్న చేద ర్థకము వాడబడినది. శేషుడు సహస్రముఖుడు అని ప్రసిద్ధి. రాజుయొక్క గుణ ములను వర్ణించుట యొక్కముఖము మాత్రమే కల మానవులకు సాధ్యము కాదు; శేషుడు వక్తయైనయెడల, తన సహస్రముఖములచేత, తాను వర్ణింప గలుగును. ఈ యూహవలన, రాజుయొక్క అనంత గుణత్వము తెలియు చున్నది. ఈ వివక్షితార్థసిద్ధి కొరకే 'శేషుడు వక్తయైన' నన్న యూహ సాగి నది. కావుననే యిది సంభావనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ఎనయు నీకార్య మిది యయ్యెనేని ననెడు
నూహ సంభావన యనంగ నొప్పుఁ గృతుల;
నహికులాధీశ్వరుఁడు వక్త యయ్యెనేని
నెన్నఁ దగు నీదు సుగుణంబు లన్నయట్లు.

## 65. మిథ్యాధ్యవసిత్యలఙ్కారః

124. కిఞ్చి న్మిథ్యాత్వసిద్ధ్యర్థం మిథ్యార్థాన్తర కల్పనమ్,
మిథ్యాధ్యవసితి ర్వేశ్యాం వశయేత్ ఖస్రజం వహన్॥

టీక : కిఞ్చిత్= ఒకానొక; మిథ్యాత్వసిద్ధి + అర్థమ్= మిథ్యాభూతత్వ మును సిద్ధింపజేయుటకై; మిథ్యార్థాన్తర కల్పనమ్=మిథ్యాభూతమైన అప్రకృ తార్థమును కల్పించుట; మిథ్యాధ్యవసితిః= మిథ్యాధ్యవసితి యన్న యలంకా రము॥ ఖస్రజమ్=ఆకాశపుష్పముల మాలను; వహన్=ధరించి; వేశ్యామ్=వెల యాలిని; వశయేత్=వశీకరించునది॥

వ్యాఖ్య : ఒకదానియొక్క మిథ్యాత్వమును సిద్ధింపజేయుటకై, మిథ్యా భూతమయిన మరొకదానిని కల్పించుట మిథ్యాధ్యవసితి యగును. ఇది లక్ష ణము. మిథ్య యనగా అవాస్తవమని యర్థము. అధ్యవసితి యనగా పరిణామ

మని యర్థము. అవాస్తవమైన పరిణామమే యీ యలంకారమునకు ప్రాతిపదికము. కావున దీని కీ పేరు సార్థకమగుచున్నది.

ఆకాశపుష్పములమాలను ధరించి వేశ్యాలిని వశీకరించునది- ఇది లక్ష్యము. ఆకాశపుష్పములు యథార్థములు కావు. ఆకాశపుష్పములే లేని యెడల మాల యెట్లు వచ్చును? కావున ఆకాశపుష్పములమాల కేవలము మిథ్య. ఈ మిథ్యాకల్పనమువలన ప్రకృతమైన వేశ్యావశీకరణము కూడ మిథ్యయే యని నిరూపించుట జరుగుచున్నది. మొత్తముమీద ఒక మిథ్య మరొక విషయముయొక్క మిథ్యాత్వమును నిరూపించుటయందు పరిణమించుచున్నది. కావుననే యిది మిథ్యాధ్యవసిత్యలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అల్పతరమైన యట్టి మిథ్యాత్వసిద్ధి
కన్యమిథ్యార్థ కల్పనం బయ్యేనేని
నగును మిథ్యాధ్యవసితి; యార్యను భజించు
నది నభస్స్రజ మూనుచు నన్న కరణి.

విమర్శ; ఇచ్చట లక్షణమునందు 'కిఞ్చిత్' అనుదాని కనువాదముగా 'అల్పతరమైన' అని ప్రయుక్తమైనది. అది సరికాదు. సందర్భమునుబట్టి అల్పాధిక శబ్దప్రసంగ మిచ్చట కానరాదు. 'ఒక' అనికాని 'ఒకానొక' యనికాని దాని యర్థము. ఇంక లక్ష్యము సవరణము నపేక్షించుచున్నది. 'ఆర్యను భజించునది' అని యన్నప్పుడు మిథ్యాత్వము లేదు. 'ఆర్య' అనగా "పార్వతి' యని యర్థము; 'పూజ్యురాలు' అనియు నర్థము చెప్పవచ్చును. 'భజించుట' యనగా పూజించుట, సేవించుట యని యర్థములు. ఎట్లయినను మిథ్యాత్వమున కిచ్చట తావు కానరాదు. కావున "ఆర్య' యను పదముకాక మూలములో నున్నట్లు 'వేశ్య' యని యుండుటయే తగును. అప్పుడుకూడ 'భజించుట' అన్న క్రియాపదము సందర్భసముచితము కాదు. వేశ్య నారాధించుట మిథ్యకాదు. అట్టివారు పలువురున్నట్లు లీలాశుక ప్రభృతుల కథలు సాక్ష్యమిచ్చుచున్నవి. వేశ్యను వశమందుంచుకొనుట యన్నది మిథ్య. కావున 'వశ' ధాతువు నుపయోగించుటయే యుచితము. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఒకట మిథ్యాత్వసిద్ధి కొండొకటఁ గూడ
నయిన మిథ్యాత్వసృష్టి- మిథ్యాధ్యవసితి;
గగనపుష్పమాలిక దాల్చి గళమునందు
వెలపడంతిసి వశము గావించుకొమ్ము.

## 66. లలితాలఙ్కారః

125. ప్రస్తుతే వర్ణ్యవాక్యార్థ ప్రతిబిమ్బస్య వర్ణనమ్,
లలితం; నిర్గతే నీరే సేతు మేషా చికీర్షతి॥

టీక : ప్రస్తుతే=ప్రస్తుతమునందు; వర్ణ్యవాక్యార్థ=వర్ణింపదగిన వాక్యము యొక్క యర్థమునకు; ప్రతిబిమ్బస్య = ప్రతిబింబమగుదానియొక్క; వర్ణనమ్=వర్ణనము; లలితమ్= లలితాలంకారము॥ నీరే= జలము; నిర్గతే= వెడలి పోగా; ఏషా=ఈమె; సేతుమ్=ఆనకట్టను; చికీర్షతి=కట్టుటకు కోరుచున్నది.

వ్యాఖ్య : ప్రస్తుతమునందు వర్ణ్యవాక్యార్థ ప్రతిబింబ వర్ణనము లలితాలంకారము. ఇది లక్షణము. ప్రకృతాంశమును దెలుపక, ప్రకృతాంశమును వర్ణించు వాక్యార్థమునకు ప్రతిబింబము కాదగిన అప్రస్తుతవర్ణనము చేయుట యిచ్చట జరుగును.

ఈమె నీరు పోయినపిదప సేతువును నిర్మింపదలచుచున్నది- ఇది లక్ష్యము. ఇది యొక నాయికనుద్దేశించి యామె చెలికత్తె యనుకొనుచున్న వాక్యము. నాయకుడు దగ్గర నున్నప్పుడు కోపమును ప్రదర్శించిన నాయిక, నాయకుడు వెళ్ళిపోయిన పిమ్మట, ఆతనిని ప్రసన్నుని జేసికొనుటకై దూతికను పంపుట సందర్భము. ఈ విషయము ప్రకృతము. దీనిని చెప్పక పైవాక్యమును చెప్పుట జరుగుచున్నది. ప్రకృత విషయమునకు ఈ అప్రకృతవిషయము ప్రతిబింబము. అప్రకృతమును చెప్పినంతనే ప్రకృతము భాసించును. నిజమునకు ప్రకృతాప్రకృతములకు ఉపమేయోపమాన భావమే యిచ్చట కలదు. ప్రకృతము ఉక్తముకాక అప్రకృతము మాత్రమే యుక్తమగుటవలన, ఇది రూపకాతిశయోక్తికూడ కావచ్చును.

మొత్తముమీద నీరు తొలగిపోయిన తరువాత సేతువు కట్టనెంచుట యెంత నిష్ఫలమో, భర్త వెళ్ళిపోయిన తరువాత ప్రసన్నతకై యత్నించుట యంత నిష్ఫలమే యన్నది యుద్దిష్టాంశము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ప్రస్తుతం బగుచుండఁగ వర్ణ్యవచన
మవుడు ప్రతిబింబవర్ణనం బయ్యెనేని
లలిత మన నలరుచుండు; జలము దొలఁగఁ
గట్టు గట్టెడి నిది యను కరణి ధరణి.

విమర్శ: ఇచ్చట లక్షణము సక్రమముగా లేదు. వర్ణ్యవచనమునకు ప్రతిబింబమును గాక వర్ణ్యవచనార్థమునకు ప్రతిబింబమును వర్ణింపవలయును. పై లక్షణమునందు ప్రాణభూతమైన 'అర్థ' పదము విడువబడినది. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ, అగును లలితంబు ప్రకృతంబునం దొనర్ప
వర్ణ్యవాక్యార్థ ప్రతిబింబ వర్ణనంబు;
తొలఁగి ప్రవహించి పోయిన సలిలమునకు
సేతు బంధముసేయ నిచ్ఛించు నీమె.

## 67, ప్రహర్షణాలఙ్కారః (తద్భేదాః)

126. ఉత్కణ్ఠితార్థ సంసిద్ధి ర్వినా యత్నం ప్రహర్షణం,
తామేవ ధ్యాయతే తస్మై నిసృష్టా సైవ దూతికా॥

టీక: యత్నం + వినా=ప్రయత్నింపకయే; ఉత్కణ్ఠిత + అర్థసంసిద్ధిః= కోరిన ప్రయోజనము యొక్కసిద్ధి; (యదిస్యాత్=అగునేని); ప్రహర్షణమ్=ప్రహర్షణాలంకారము॥ తామ్ + ఏవ = ఆమెనే; ధ్యాయతే= ధ్యానించుచున్నాడు; తస్మై=ఆతనికొరకు; సా + దూతికా + ఏవ= ఆ దూతికయే; నిసృష్టా = పంపబడెను.

వ్యాఖ్య: ప్రయత్నింపకయే యపేక్షితమైన ప్రయోజనము లభించిన యెడల, అది ప్రహర్షణాలంకార మగును. ఇది లక్షణము. ప్రయత్నముచేతనే కార్యము సఫలమైనయెడల హర్షము కలుగును. అట్టియెడల ప్రయత్నము లేకయే ఇష్టఫలము లభించిన మరింత హర్షము కలుగును. ప్రకృష్టమగు హర్షము కలిగించుటనుబట్టి, యీ యలంకారమునకు ప్రహర్షణాలంకార మన్న పేరు అన్వర్థ మగుచున్నది.

ఆమెనే యతడు ధ్యానించుచుండెను; నాయికచేత దూతికగా నామెయే పంపబడెను. ఇది లక్ష్యము. ఒక నాయకుడు నాయికాపరిచారికయందు లగ్న మనస్కుడు. ఆతడా సమయమున నామెను ధ్యానించుచుండెను. ఆమెయందు ఉత్కంఠ కలిగియుండెనని భావము. కాని, తత్ప్రాప్తికొరకు తానేమియును యత్నింపలేదు. అయినను నాయిక తనపక్షమున నామెనే దూతికగా పంపెను. అందువలన, అప్రయత్నముగానే నాయకునకు అభిలషితార్థము సిద్ధించినది. కావుననే, యిది ప్రహర్షణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అప్రయత్నంబుచే వాంఛితార్థసిద్ధి
యయ్యెనేని బ్రహర్షణం బనఁగఁ బరఁగు;
దానిని మనంబునందునఁ దలఁచుచుండ
నదియె దూతికయై చనె నతనికొఱకు.

రెండవ భేదము

127. వాఞ్ఛితా దధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్,
దీప ముద్ద్యోతయే ద్యావ త్తావ దభ్యుదితో రవిః॥

టీక : వాఞ్ఛితాత్ = కోరినదానికంటె; అధిక + అర్థస్య = అధికమైన ఫలముయొక్క; సంసిద్ధిః + చ = సంసిద్ధికూడ; ప్రహర్షణమ్ = ప్రహర్షణాలంకారము॥ యావత్ = ఎంతలో; దీపమ్ = దీపమును; ఉద్ద్యోతయేత్ = వెలిగింపగోరెనో; తావత్ = అంతలో; రవిః = సూర్యుడు; అభ్యుదితః = ఉదయించెను.

వ్యాఖ్య : వాంఛితముకంటె అధికమైన ప్రయోజనము సిద్ధించిన యెడల, అది ప్రహర్షణ మగును. ఇది లక్షణము. ఇక్కడ వాంఛితము అల్పము; ప్రాప్తము అధికము. అధికప్రాప్తివలన హర్షాధిక్యము కలుగును. దీనినిబట్టియే, యిదికూడ ప్రహర్షణ మగుచున్నది.

దీపమును వెలిగించునంతలో సూర్యుడే యుదయించెను-ఇది లక్ష్యము. దీపకాంతివలన నేరస్తు డెక్కడనున్నది యన్నవిషయ మెరుగవచ్చును. అందు కొరకై దీపమును వెలిగింపవలయును. ఆ ప్రయత్నములో నుండగా సూర్యుడుదయించెను. సూర్యుడు వేవెలుగు కదా! దీపమువలన వెలువడు వెలుగు కంటె సూర్యునివలన వెలువడు వెలుగు పెద్దది అందువలన కించిల్లాభమునకై

యత్నించుచుండగా బృహల్లాభము కలుగుట యిక్కడ కలదు. కావుననే, యిది ప్రహర్షణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ అన్యగతి వాంఛితాభ్యధికార్థసిద్ధి
యును బ్రహర్షణాలంకార మనిరి కృతుల;
నెంతవడి దివ్వె వెలిఁగించె నంతలోన
నర్కుఁ డభ్యుదితుం డయ్యె ననఁగ శర్వ!

మూడవ భేదము

128. యత్నా దుపాయసిద్ధ్యర్థా త్సాక్షాల్లాభః ఫలస్య చ,
నిధ్య ఞ్జనౌషధీమూలం ఖనతా సాధితో నిధిః॥

టీక : ఉపాయసిద్ధి + అర్థాత్ = ఫలసిద్ధికి హేతువైన దానికొరకైన; యత్నాత్ = ప్రయత్నమువలన; సాక్షాత్ + ఫలస్య + లాభః = సరాసరి ఫలలాభము; (యదిస్యాత్ = కలిగినయెడల); ప్రహర్షణమ్ = (ప్రహర్షణాలంకారము)॥ నిధి + అఞ్జన = నిధికొరకైన కాటుకకొరకు; ఓషధీమూలమ్ = ఓషధియొక్క వేరును; ఖనతా = త్రవ్వువానిచేత; నిధిః = నిధియే; సాధితః = సంపాదింపబడెను.

వ్యాఖ్య : ఫలసిద్ధికి హేతువైనదానికొరకు చేసిన యత్నమువలన, ఫలలాభమే కలిగినయెడల, అది ప్రహర్షణాలంకార మగును. ఇచ్చటకూడ కారణమునకు ప్రయత్నమేకాని కార్యమునకు ప్రయత్నము లేదు. అయినను కార్యసిద్ధియైనయెడల అత్యంతహర్షము కలుగును. దీనినిబట్టియే, యిదికూడ ప్రహర్షణాలంకారభేదమే యగుచున్నది.

నిధ్యంజనౌషధీమూలమునకై త్రవ్వువానికి నిధియే లభించెను- ఇది లక్ష్యము. సాధారణముగా నిధులు భూమియందెచ్చట నున్నదియు గుర్తించుటకు కాటుకవేసి చూతురు. ఆ కాటుకను సిద్ధముచేయుటకు ప్రత్యేకమైన ఓషధీమూలము కావలయును. ఈ ఓషధీమూలము ఉపాయము. దీనిని పొందుటకై చేసిన యత్నము త్రవ్వుట. దీనివలన పరమప్రయోజనమైన నిధి లభించినది. నిధికొరకు ప్రయత్నము చేయకయే నిధి లభించినది. ఉపాయసిద్ధికై చేసిన

ప్రయత్నమువలననే ఫలప్రాప్తి యగుట యిచ్చట కలదు. అందువలననే యిది ప్రహర్షణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అభిమతార్థ ముపాయసిద్ధ్యర్థ యత్న
మునను సాక్షాత్కరించినఁ దనరు నదియ;
కోరి నిధ్యంజనౌషధి వేరుద్రవ్వు
నతనిచే నిధి సాధితంబయ్యెననఁగ.

## 68. విషాదనాలఙ్కారః

129. ఇష్యమాణ విరుద్ధార్థ సంప్రాప్తిస్తు విషాదనమ్,
దీప ముద్ద్యోతయద్యావ న్నిర్వాణ స్తావదేవ సః॥

టీక : ఇష్యమాణ=వాంఛింపబడుచున్నదానికి; విరుద్ధ= వ్యతిరిక్తమైన; అర్థ=ఫలముయొక్క; సంప్రాప్తిః + తు=లాభము; విషాదనమ్=విషాదనాలంకారము॥ యావత్=ఎంతలో; దీపమ్= దీపమును; ఉద్ద్యోతయత్= వెలిగించెనో; తావత్ + ఏవ=అంతలోనే; సః=ఆ దీపము; నిర్వాణః= ఆరిపోయెను.

వ్యాఖ్య : అభిలషితార్థమునకై యత్నింపగా విరుద్ధార్థము ప్రాప్తించుట విషాదనము. ఇది లక్షణము. 'విషాదయతీతి విషాదనమ్' విషాదమును కలిగించునది విషాదనము. అభిలషితకార్యమునకై యత్నించునప్పుడు తత్కార్యము సిద్ధింపనియెడల విషాదముకలుచుట సహజము. ఆ ధర్మమునుబట్టియే దీనికి విషాదనాలంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది. ఇది పూర్వము చెప్పకొన్న ప్రహర్షణాలంకారమునకు ప్రతిలోమముగా వ్యవహరించును.

దీపము వెలిగించునంతలోనే యారిపోయెను.- ఇది లక్ష్యము. వస్తుదర్శననిమిత్తమై దీపము వెలుగుట యన్న కార్యమావశ్యకము. అందుకొరకై చమురుపోయుట, వత్తి ముట్టించుట మున్నగునవి చేయవలయును. ఇది దీపము వెలుగుట యన్న కార్యమునకు జరుగు ప్రయత్నములు. వెలుగుటకు విరుద్ధకార్యము ఆరిపోవుట. ఇచ్చట వెలిగించుట అన్న అభిలషిత కార్య ప్రయత్నము సాగుచుండగనే, ఆరిపోవుట యన్న విరుద్ధకార్యము జరుగుచున్నది. కావుననే, ఇది విషాదనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇచ్చట నింకొకవిషయము చెప్పుకొనవలయును. విషమాలంకారము నందలి మూడవభేదమునకును దీనికిని సామ్యము గలదు. విషమమునకు 'ఇష్టార్థమునకు యత్నింపగా అనిష్టార్థము ప్రాప్తించుట' లక్షణము. అనగా, ఇష్టార్థము ప్రాప్తింపకపోవుటయేకాక కీడుకూడ కలుగును. విషాదనమునందు ఇష్టార్థ విరుద్ధార్థలాభమే కాని కీడు జరుగుట యుద్దిష్టము కాదు. దీపము వెలుగుట యుద్దిష్టము; ఆరిపోవుట ప్రసక్తము. అంతేకాని మరొక యనిష్టము కలుగలేదు. కావున, అభిలషితమునకు విరుద్ధమైన ఫలము ప్రాప్తించిన విషాదన మనియు, పైగా అనిష్టముకూడ ప్రాప్తించినయెడల విషమ మనియు నిష్కర్షము.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అభిమతార్థంబునకు విరుద్ధార్థసిద్ధి
యైనను విషాదనం బన నలరుఁ గృతుల;
నెంతవడి దివ్వె వెలిఁగించె నంతలోన
నది నశించె ననంగ లక్ష్యము మహేశ!

## 69. ఉల్లాసాలఙ్కారః (తద్భేదాః)

130. ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌ యది,
అపి మాం పావయేత్సాధ్వీ స్నాత్వే తీచ్ఛతి జాహ్నవీ॥

టీక: ఏకస్య= ఒకనియొక్క; గుణదోషాభ్యామ్= గుణదోషములచేత; అన్యస్య= ఇతరునకు; తౌ=గుణదోషములు; యది (+స్యాతామ్) =కలిగిన యెడల; ఉల్లాసః=ఉల్లాసాలంకారము॥ సాధ్వీ=పతివ్రత; స్నాత్వా=స్నానము చేసి; మామ్+అపి=నన్నుసైతము; పావయేత్+ఇతి= పావనముచేయు నని; జాహ్నవీ=గంగానది; ఇచ్ఛతి=కోరుచున్నది.

వ్యాఖ్య: ఒకనియొక్క గుణదోషములచేత ఇతరునకు గుణదోషములు కలిగినట్లు వర్ణించినయెడల, అది ఉల్లాసాలంకార మగును. ఇది లక్షణము. ఇచ్చట గుణదోషములు అన్నది యథాక్రమమున గ్రాహ్యము కారాదు. ఉదాహరణ సామర్థ్యమువలన ఈ లక్షణమును నాలుగువిధములుగా వింగడింప వచ్చును. 1. ఒకని గుణమువలన మరియొకనికి గుణము కలుగుట. 2. ఒకని

దోషమువలన మరియొకనికి దోషము కలుగుట. 3. ఒకని గుణమువలన మరి యొకనికి దోషము కలుగుట. 4. ఒకని దోషమువలన మరియొకనికి గుణము కలుగుట. ఈ నాలుగింటి నుద్దేశించియే పై శ్లోకమునందు పూర్వార్థము ప్రవ ర్తించినది. అది లక్షణభాగము.

ఉత్తరార్థము మొదటి విభాగమున కుదాహరణము. ఒకని గుణము వలన మరియొకనికి గుణముకలుగుట యిచ్చట నుండును.

పతివ్రత నాయందు స్నానముచేసి నన్ను పావనమొనర్చునని జాహ్నవి యభిలషించుచున్నది- ఇది లక్ష్యము. పతివ్రత స్వతస్సిద్ధముగా పవిత్రురాలు. పవిత్రత తన్నిష్ఠమైన గుణము. ఆ గుణముచేత తనకు పవిత్రత కలుగునని జాహ్నవి యాశించుచున్నది. పతివ్రతయొక్క గుణముచేత జాహ్నవికి గుణము కలుగుట యిక్కడ ఉద్దిష్టము. ఈ లక్షణమునుబట్టి యిది ఉల్లాసమున మొదటి భేదమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ, ఒప్పు నుల్లాస మన్యునం దొక్కని గుణ
దోషములచేత నవి రెండు దొరలెనేని;
నన్ననఘఁ జేయుఁ గాత స్నానంబొనర్చి
సాధ్వి యని యిచ్ఛగించెడు జహ్ను కన్య.

రెండవ భేదము

131. కాఠిన్యం కుచయో స్సృష్టం వాఞ్ఛన్త్యః పాదపద్మయోః,
నిన్దన్తి విశ్వధాతారం త్వద్ధాటీష్వరి యోషితః॥

టీక : త్వత్= నీయొక్క; ధాటీషు = దండయాత్రలయందు; అరియో షితః=శత్రురాజుల భార్యలు; కుచయోః=స్తనములకు; (యత్ +) కాఠిన్యమ్ =ఏ కఠినత్వము; సృష్టమ్= సృజింపబడినదో; (తత్ కాఠిన్యమ్= ఆ కాఠిన్య మును); పాదపద్మయోః=పద్మములవంటి పాదములకు; వాఞ్ఛన్త్యః=వాంఛించు వారై; విశ్వధాతారమ్=విశ్వస్రష్టను; నిన్దన్తి=దూషించుచున్నారు.

వ్యాఖ్య : ఒకనియొక్క దోషమువలన మరియొకనికి దోషము కలు గుట యిచ్చట నుండును. ఇది ఉల్లాసాలంకారమునందలి రెండవ విభాగము నకు లక్షణము.

శత్రుస్త్రీలు కుచములయందున్న కాఠిన్యము పదములందు లేదని బ్రహ్మను నిందించుచున్నారు- ఇది లక్ష్యము. రాజు దండయాత్రలవలన విజితులైన శత్రురాజులు పలాయనము సాగించిరి. వారి స్త్రీలు కోమలులు. పలాయనము దుస్సహ కార్యము. కోమలులైన స్త్రీలకు పాదములుకూడ కోమలములుగా నుండును; స్తనములు కఠినములుగా నుండుట యౌవన లక్షణము. కోమలములైన పాదములవలన పరుగెత్తుట మరింత కష్టమగును. కావున శత్రుస్త్రీలు కుచములయందు వ్యర్థముగా నిలిపిన కాఠిన్యమును పదములయందే నిలిపిన యెడల పరుగెత్తుటలు పనికివచ్చునని భావించి, అట్లు చేయని బ్రహ్మను నిందించుచున్నారు. ప్రకృతసందర్భమునుబట్టి పాదములయందు కాఠిన్యము లేకుండుట దోషము. ఈ దోషనిచ్చుట నుండుటచేతనే విశ్వస్రష్టయగు బ్రహ్మయందు దోషము కలుగుచున్నది; అనగా దోషము పట్టుట జరుగుచున్నది. కావుననే, యిది ఉల్లాసాలంకారమునందలి రెండవ విభాగమునకు లక్ష్యమగుచున్నది. దీని కాంధ్రచంద్రాలోకమునందు సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. నీదు దండయాత్రల శత్రు నృపవనితలు
సృష్టికర్తను మిగుల దూషించుచుండ్రు
కుచయుగంబునందున నెలకొల్పినట్టి
కఠినతను బాదముల కొసంగండటంచు.

**మూడవ భేదము**

132. తదభాగ్యం ధనస్యైవ యన్నాశ్రయతి సజ్జనమ్,
లాభోఽయమేవ భూపాలసేవకానాం నచేద్వధః॥

టీక: సజ్జనమ్=మంచివానిని; న + ఆశ్రయతి=ఆశ్రయింపదు; యత్=అన్నది యేదికలదో; తత్=అది; ధనస్య=ధనముయొక్క; అభాగ్యమ్ + ఏవ=దౌర్భాగ్యమే॥ భూపాలసేవకానామ్=రాజసేవకులకు; వధః=వధ; న + చేత్=కాకుండనున్నచో; అయమ్ + ఏవ=అదియే; లాభః=లాభము.

వ్యాఖ్య: ఇందు పూర్వార్ధము ఉల్లాసమునందలి మూడవ భేదమునకు లక్ష్యము. ఉత్తరార్ధము నాలుగవ భేదమునకు లక్ష్యము. ఒకనియొక్క గుణము వలన మరియొకనికి దోషము కలుగుట మూడవ భేదమునకు లక్షణము. సజ్జ

మని నాశ్రయింపకపోవుట ధనముయొక్క యభాగ్యము- ఇది లక్ష్యము. సజ్జనుడు అనియనుటచేతనే సజ్జనత్వము అన్నగుణము కలదని తెలియుచున్నది. ధనము వారిని జేరకుండుట ధనముయొక్క దోషము. సాధారణముగా ధనము నికృష్టులనే చేరు ననియు సజ్జనులనుచేర దనియు చెప్పుకొందురు. సజ్జనుని సుగుణత్వమువలననే ధనమునకు తదనాశ్రయమన్న దోషము కలుగుచున్నది. కావుననే యిది ఉల్లాసమునందలి తృతీయ భేదమునకు లక్ష్యమగుచున్నది.

ఒకనియొక్క దోషమువలన పరియొకనికి గుణము కలుగుట నాలుగవ భేదమునకు లక్షణము. భూపాలసేవకుల వధ లేకుండెనేని, అదియే లాభము- ఇది లక్ష్యము. రాజులకడ సేవచేయుట ప్రాణాపాయకరము. ఎప్పుడెందులకు రాజుల కాగ్రహము కలుగునో చెప్పుట కష్టము. ఆగ్రహము కలిగెనా మరణదండనము తప్పదు. నిత్య సమీపవర్తులగు సేవకులకీ ప్రమాదము అన్యులకంటె నధికమై యుండును. అట్టియెడల ఆ ప్రమాదము కలుగకుండ బయటపడుట లాభముగానే పరిగణింపవలసి యుండును. రాజసేవ యన్న దోషమువలన వధాభావము అన్నగుణము చెప్పబడుటచేత, ఇది ఉల్లాసమున నాలుగవ భేదమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున దీనిని గ్రహింపవచ్చును.

గీ. సద్గుణంబుల ప్రోవులౌ సజ్జనములఁ
జేరని యభాగ్య మెన్నఁగా సిరిదె సుమ్ము;
చిరము కొలువుచేసిన రాజసేవకులకు
వధము పొందకుండుటయు లాభంబె యౌను.

## 79. అవజ్ఞాలఙ్కారః (తద్భేదాః)

133. తాభ్యాం తౌ యది న స్యాతా మవజ్ఞాలంకృతి ర్మతా,
స్వల్ప మేవాम्బు లభతే ప్రస్థః ప్రాప్యాపి సాగరమ్
మీలన్తి యది పద్మాని కాహాని రమృత ద్యుతేః

టీక ; తాభ్యామ్= గుణదోషములవలన; తౌ= గుణదోషములు; న+స్యాతామ్+యది= కలుగనియెడల; అవజ్ఞాలంకృతిః = అవజ్ఞాలంకారము; మతా=సమ్మతము॥ ప్రస్థః=తూము; సాగరమ్=సముద్రమును; ప్రాప్య+అపి

=పొందినప్పటికి; అమ్బు=జలమును; స్వల్పమ్ + ఏవ=కొంచెముగానే; లభతే = పొందును; పద్మాని=తామరపువ్వులు; యది + మీలన్తి=ముడుచుకొని పోయినయెడల; అమృతద్యుతేః=చంద్రునికి; హానిః + కా=నష్టమేమి.

వ్యాఖ్య : ఒకవస్తువుయొక్క గుణదోషములవలన మరొకవస్తువునకు గుణదోషములు కలుగనియెడల, అది అవజ్ఞాలంకార మగును. ఇది లక్షణము. దీనినిగూడ రెండు విభాగములు చేయవచ్చును. 1. ఒకవస్తువుయొక్క గుణము వలన మరొక వస్తువునకు గుణము రాకుండుట. 2. ఒకవస్తువుయొక్క దోషము వలన మరొక వస్తువునకు దోషము రాకుండుట. అవజ్ఞ యనగా తిరస్కార మని యర్థము. ఇచ్చట స్వగుణదోషములను విడువకుండుటచేత, అన్యగుణ దోషములను తిరస్కరించుట జరుగుచున్నది. ఈ లక్షణమునుబట్టి అవజ్ఞాలంకార మన్న పేరు అన్వర్థమగుచున్నది.

సముద్రమును చేరినప్పటికి తూము స్వల్పజలమునే గ్రహించును-ఇది ప్రథమావజ్ఞకు లక్ష్యము. అపారమైన జలముండుట సముద్రగుణము. అయినను తూము తన పరిమితికి తగినట్లుగానే జలమును గ్రహించును, కాని సముద్రగుణమైన అపారత్వము దీనికిరాదు. ఇట్లు అన్యగుణమును తిరస్కరించుట యన్న ధర్మమిచ్చట కనవచ్చుచున్నది. కావుననే ఒక వస్తువుయొక్క గుణమువలన అన్యవస్తువునకు గుణము రాకుండుట యన్న లక్షణమునుబట్టి యిది యవజ్ఞాలంకారమునందలి మొదటి భేదమునకు లక్ష్య మగుచున్నది.

పద్మములు ముడుచుకొన్నచో చంద్రునికి నష్టమేమి ?- ఇది ద్వితీయావజ్ఞకు లక్ష్యము. రాత్రివేళ పద్మములు ముకుళించుకొనును. అది వాని స్వభావము. సందర్భమునుబట్టి యిది దోషముగా ప్రసక్తము. చంద్రోదయము సర్వలోకమున కాహ్లాదకరమే. అయినను పద్మముల కా యానందము కలుగుట లేదు. ఇందువలన చంద్రునికి దోషము నారోపింపవలసిన యవసరము లేదు. ఇచట పద్మగతమైన దోషము పద్మములందే యున్నదికాని చంద్రునికి సంక్రమించుట లేదు. అనగా చంద్రుడు స్వభావమైన అమృతద్యుతిత్వము విడుచుట లేదు. పద్మగతమైన దోషమును తాను గ్రహించుటలేదు. కావున ఒక వస్తువుయొక్క దోషమువలన అన్యవస్తువునకు దోషము రాకుండుట యన్నది లక్షణము. అన్యదోషమును తిరస్కరించుట యన్న ధర్మమునుబట్టి యిది అవజ్ఞాలంకారమునందలి రెండవ భేదమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. వానిచే నవి రెండుఁ గావేనిఁ గృతుల
నది యవజ్ఞ యనంగఁ బ్రఖ్యాతికెక్కుఁ;
దోయ మల్పముఁ జెందెడిఁ దూము వారి
రాశిఁ జెందియు నన్నట్లు రాజమకుట!
తనయుదయమందు నిద్రించు తామరసము
లట్లయినఁ జంద్రునకు నేమి హాని యభవ!

## 71. అనుజ్ఞాలఙ్కారః

134. దోషస్యాభ్యర్థ నానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్,
విపద స్సన్తు న శ్శశ్వద్యాసు సఙ్కీర్త్యతే హరిః॥

టీక : తత్ర + ఏవ=దోషస్థలమునందే; గుణదర్శనాత్=గుణమును దర్శించుటవలన; దోషస్య=దోషమునకు; అభ్యర్థనా=వేడుకొనుట; అనుజ్ఞా= అనుజ్ఞ యన్న యలంకారము॥ నః=మాకు; యాసు=వేనియందు; హరిః=భగవానుడు; సఙ్కీర్త్యతే=కీర్తింపబడునో; (తాః +) విపదః=ఆ యాపదలు; శశ్వత్=శాశ్వతముగా; సన్తు=కలుగుగాక.

వ్యాఖ్య : దోషమునందు గుణమును దర్శించుటవలన దోషమునే వేడుకొనుట జరిగిన. అది అనుజ్ఞాలంకార మగును. ఇది లక్షణము. అనుజ్ఞ యనగా సమ్మతి యని యర్థము. మేలును కోరుకొనుట, కీడును నిషేధించుట సాధారణముగా లోకమునందు కనిపించు ధర్మము. ఇచ్చట తిరస్కార యోగ్యమైన దోషమునకు సమ్మతి యొసగుట జరుగుచున్నది. ఈ ప్రవృత్తిని బట్టియే దీనికి అనుజ్ఞాలంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది.

హరికీర్తనమునకు యోగ్యములయిన ఆపదలను మాకెల్లప్పుడు ప్రసాదింపుము- ఇది లక్ష్యము. విరక్తుడై, భగవద్భక్తిపరాయణుడైన వాని వాక్యమిది. సాధారణముగా సుఖములు కలిగినపుడు భగవత్స్మరణము కలుగదు; కష్టములు కలిగినపుడు వెంటనే భగవంతుడు జ్ఞప్తికివచ్చును. సంపదలు కలిగినప్పుడు హరిని మరచుట సంభవించునేమో యని భక్తుడు కష్టములనే కోరుకొనుచున్నాడు. వీనివలన హరిని ధ్యానించుచు నుండవచ్చును; అందువలన

సాన్నిహిత్యము ననుభవింపవచ్చును. ఆపదలు దోషమే; అయినను హరికీర్తన మన్న గుణము అచ్చట కలదు. కావున దోషములయిన యాపదలనే వేడు కొనుట జరుగుచున్నది. కావుననే, యిది యనుజ్ఞాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. గుణ మచటఁ జూచి దోషంబు గోరెనేని
నది యనుజ్ఞ యనంగఁ బ్రఖ్యాతికెక్కు;
నాపదలె యుండుఁగాక మా కనయమును వి
పత్తులను శౌరి కీర్తింపఁబడు ననంగ.

## 72. లేశాలఙ్కారః

135. లేశ స్స్యా ద్దోషగుణయో ర్గుణదోషత్వ కల్పనమ్
అఖిలేషు విహఙ్గేషు హన్త స్వచ్ఛన్దచారిషు
శుక ! పఞ్జరబన్ధస్తే మధురాణాం గిరాం ఫలమ్॥

టీక: దోషగుణయోః = దోషగుణములకు; గుణదోషత్వకల్పనమ్ = గుణత్వ దోషత్వములను కల్పించుట; లేశః = లేశాలంకారము; స్యాత్ = అగును॥ శుక = ఓ చిలుకా; స్వచ్ఛన్దచారిషు = స్వేచ్ఛగా సంచరించునటువంటి; అఖిలేషు విహఙ్గేషు = పక్షులన్నింటి యందును; తే = నీకు; పఞ్జరబన్ధః = పంజరమునందు బంధింపబడియుండుట; హన్త = అయ్యో; మధురాణామ్ = తియ్యనైన; గిరామ్ = వాక్కులయొక్క; ఫలమ్ = ఫలము.

వ్యాఖ్య : దోషగుణములకు గుణదోషత్వకల్పనము లేశాలంకారము- ఇది లక్షణము. ఇచ్చట సంఖ్యాక్రమము పాటింపబడినది. దోషమునకు గుణత్వ కల్పనము చేసినను, గుణమునకు దోషత్వకల్పనము చేసినను లేశాలంకార మగుననుట తాత్పర్యము. దోషమే యైనప్పటికి అనుకూలత్వముచేత గుణము గాను, గుణమే యైనప్పటికి ప్రతికూలత్వముచేత దోషముగాను పరిగణింప బడును. అప్పుడుమాత్రమే ప్రకృతలక్షణమున కనుకూలమై, లేశాలంకార ముగా వ్యవహృత మగును.

ఓ చిలుకా ! అన్నిపక్షులును స్వేచ్ఛగా సంచరించుచున్నవి. నీవు

మాత్రమే పంజరమున బంధింపబడితివి. ఇది నీ మధురవాక్కులకు ఫలము- ఇది లక్ష్యము. పక్షులకు మాటలాడుశక్తి లేదు. నిజమున కది దోషము. అయి నప్పటికి నవి స్వేచ్ఛాసంచారము చేయుటకు తద్దోషమే హేతువు. దోషము వలననే వానికనుకూలమైన స్వేచ్ఛలభించుచున్నది; అనగా దోషమే గుణ మైన దన్నమాట! పక్షులలో చిలుకకు మాటలాడుశక్తి కలదు. ఇది నిజము నకు గుణమే. కాని, దీని మధురవాక్కులయందలి ప్రీతిచేత, దీనిని బంధించి యుంచుట జరుగుచున్నది. గుణమువలననే దానికి ప్రతికూలమైన పంజరబం ధనము కలుగుచున్నది. అనగా, గుణమే దోషమైన దన్నమాట! ఇట్లు దోష గుణములకు గుణదోషత్వకల్పనముచేతనే, యిది లేశాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఇంకొకవిషయము నిక్కడ చెప్పుకొనవచ్చును. 'చిలుకా' యన్న సం బోధనము చిలుకనుగూర్చి కాక, మధురవాక్యరచనాచణుడైన కవినిగూర్చి ప్రవర్తించె ననుకొందము. ఒకడు విద్య నభ్యసించి, కవియై రాజసభయందే నిల్చిపోయెను. తన బంధువులనుగూడ చూచుటకు తనకు వీలుకాకుండ నుం డెను. అట్టియెడల, ఆకవి తన్ను తాను సంబోధించుకొనుచు పైవాక్యము లను కొనవచ్చును. తన తోడివారు తమయిష్టమున కనుకూలముగా మెలగుచుం డిరి; వారికి రాజసభానిర్బంధము లేదు; వారికి రాజసభాప్రవేశయోగ్యతయే లేదు. యోగ్యత లేకపోవుట దోషమే. కాని స్వేచ్ఛయన్న యనుకూలఫలము వలనగుణమే యగుచున్నది. తన కర్హతయున్నది. అది గుణమే. అయినప్పటి కిని నిర్బంధము కలిగినది. అందుచేత దోషమే యగుచున్నది. ఈ సందర్భము నందుగూడ దోషగుణములకు గుణదోషత్వ ప్రకల్పనమే జరుగుచున్నది. కావున లేశాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇక్కడనే యింకొక్కసంగతి చెప్పుకొనుట సంగతముగా నుండును. కవి పక్షమున నర్థము చెప్పినప్పుడు చిలుకపక్షము అప్రకృతమగును. ప్రకృత మును చెప్పవలసియుండగా దానిని చెప్పక, అది స్ఫురించునట్లుగా అప్రకృత మును చెప్పినయెడల అప్రస్తుతాలంకార మగును. ఈ లక్షణమునుబట్టి ప్రస్తుత లక్ష్యము అప్రస్తుతాలంకారమునకుసైతము లక్ష్యము కాగలదు.

ఆంధ్రచంద్రాలోకము

క. సముచితవృత్తిని దోషగు
ణములకు గుణదోషకల్పనము గల్గినఁ గా
వ్యములన్ లేశాలంకా
రమనం బ్రఖ్యాతికెక్కు రాజవతంసా!

గీ. వలసినట్టులు దిరుగు నఖిల విహంగ
రాజియందున రాజకీరంబ! నీకుఁ
గటకటా! పంజరంబునఁ గట్టువడుట
యనుపమములైన మధురవాక్యముల ఫలము.

విమర్శ : కందపద్యమునందు లేశాలంకార లక్షణము నిరూపితమైనది. తరువాతి గీతమునందు లక్ష్యము ప్రదర్శింపబడినది.

## 73. ముద్రాలఙ్కారః

136. సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః
నితమ్బగుర్వీ తరుణీ దృగ్యుగ్మ విపులా చ సా॥

టీక : ప్రకృతార్థపరైః= ప్రస్తుతమైనయర్థమును ప్రతిపాదించు; పదైః= పదములచేత; సూచ్య + అర్థసూచనమ్= సూచింపదగిన యప్రస్తుతమైన యర్థమును సూచించుట; ముద్రా=ముద్రాలంకారము॥ సా=ఆమె; నితమ్బగుర్వీ= శ్రోణీభారము గలది; తరుణీ=యౌవనవతి; దృక్ + యుగ్మ + విపులా + చ= నేత్రయుగ్మముయొక్క విపులత్వము గలది.

వ్యాఖ్య : ప్రస్తుతమైన యర్థమును ప్రతిపాదించు పదములచేత సూచింపదగిన యప్రస్తుతార్థము సూచితమైనయెడల, అది ముద్రాలంకారమగును. ప్రస్తుతమునం దప్రస్తుతమును ముద్రించుటనుబట్టి ముద్రాలంకారమన్న పేరు అన్వర్థమగుచున్నది. ఇచ్చట సూచ్యార్థసూచనము శబ్దాశ్రయమై యుండును.

ఆమె తరుణి నితంబగుర్వి దృగ్యుగ్మవిపుల- ఇది లక్ష్యము. ఇచ్చట స్త్రీ వర్ణనము ప్రకృతవిషయము. పైమాటలు తదనుకూలముగా నుపయుక్తము

లైనవి. చివరనున్న 'దృగ్యుగ్మవిపుల' అన్న సమాసమునందలి 'యుగ్మవిపుల' అన్న భాగము సూచ్యార్థ సూచనము చేయుచున్నది. అష్టాక్షరప్రమాణముగల అనుష్టుప్ఛందమునందు పుట్టిన వృత్తములలో యుగ్మవిపుల యొకటి. పై శ్లోకము ఈ వృత్తములో వ్రాయబడినది. అది యప్రస్తుతమే. అయినను దానిని సూచించుటకై యీ పదము ప్రవర్తించుచున్నది. ఇట్లు ప్రస్తుతార్థమునందు అప్రస్తుతార్థము ముద్రితమగుటచేత, ఇది ముద్రాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. ప్రణుతికెక్కును బ్రకృతార్థ పరపదాళి
చేత సూచ్యార్థ్య సరణి సూచించిరేని
గృతుల ముద్ర; నితంబగుర్వి యగు తరుణి
యతివిలోచన విపులయు నన్నయట్లు.

విమర్శ : ఈ పద్యమునందు ముద్రాలంకారము లేదు. మూలమునందలి శ్లోకమునకు యథాతథానువాదము మాత్రమే కలదు. అచ్చట శ్లోకము యుగ్మవిపుల యగుటచేత, అచ్చట నది సముచితమై యున్నది. తెలుగునందు తేటగీతి పద్యము వాడబడినది. దీనిని సూచించుపదము పద్యమునందు నిలుపబడలేదు. కావున, దీనికి సవరణ మవసరము. తేటగీతి పద్యము వ్రాయునప్పుడు 'తేటగీతి' యన్న పదమును నిలుపవలయును. దానివలన సూచ్యార్థసూచనము గును. ప్రకృతార్థమునుగూడ ప్రతిపాదించుట యవసరము. ఈ క్రింది పద్యము గ్రహింపవచ్చును.

గీ. పరగుఁ బ్రకృతార్థ పరమైన పదచయంబు
చేత సూచ్యార్థసూచనచేయు ముద్ర;
మేటి శిలలైనఁ గరఁగించు తేటగీతి
భక్తమానస సరసున బయలు వడదె!

## 74. రత్నావళ్యలఙ్కారః

137. క్రమికా ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః,
చతురాస్యః పతిర్లక్ష్మ్యా స్సర్వజ్ఞ స్త్వం మహీపతే॥

టీక : క్రమికా + అప్రకృతార్థానామ్=క్రమబద్ధములయిన అప్రకృతార్థముల యొక్క; న్యాసమ్=నివేశనమును; రత్నావళిమ్=రత్నావళియన్న యలంకార మని; (విబుధాః=పండితులు); విదుః=గ్రహింతురు॥ మహీపతే=ఓ రాజా; త్వయ్=నీవు; చతురాస్యః=బ్రహ్మవు, నిపుణమైన ముఖముగలవాడవు (మాటల యందు నేర్పరి యనిభావము); లక్ష్మ్యాః పతిః=లక్ష్మీపతియైన విష్ణువవు, ఐశ్వర్య వంతుడవు; సర్వజ్ఞః=ఈశ్వరుడవు, సర్వము నెరిగినవాడవు.

వ్యాఖ్య : క్రమబద్ధములయిన అప్రకృతార్థముల నివేశనము రత్నావళి యగును. ఇది లక్షణము. ప్రసిద్ధములయిన అప్రకృతములను. ప్రసిద్ధమైన క్రమములో ప్రకృతమున కనుకూలముగా వర్ణించినయెడల రత్నావళ్యలంకారమేర్పడునని భావము. బంగారు నగయందు రత్నముల నొకక్రమము ననుసరించి పొదుగుటచేత 'రత్నావళి' యన్న యాభరణ మేర్పడును. బంగారము సకృతార్థము; రత్నములు అపకృతార్థములు. ప్రకృతార్థమునందు అప్రకృతార్థములను క్రమపద్ధతిలో ననురించుట యిచ్చటను గలదు. తత్సాదృశ్యము చేతనే యీ యలంకారమునకు 'రత్నావళి' యన్నపేరు అన్వర్థమగుచున్నది.

ఓ రాజా ! నీవు చతురాస్యుడవు, లక్ష్మీపతివి, సర్వజ్ఞుడవు– ఇది లక్ష్యము. ఇచ్చట రాజు ప్రకృతము. రాజునకు చతురాస్య లక్ష్మీపతి సర్వజ్ఞులతో అభేదము సాధింపబడుచున్నది. ఇందువలన రూపక మిచ్చట గలదు. అభేదము శ్లేషమువలననే సిద్ధించుచుండుటచేత, ఇది శ్లిష్టరూపక మగును. 'ఓ రాజా ! నీవు చతురాస్యుడవు" అని యన్నంతమాత్రముచేతనే శ్లిష్టరూపక మగును. చతురాస్యపదమునకు బ్రహ్మ యని, వాఙ్నైపుణ్యము గలవాడని రెండర్థములు. ఇట్లే లక్ష్మీపతిపదమునకు విష్ణువని, ఐశ్వర్యవంతుడని– సర్వజ్ఞ పదమునకు శివుడని, సర్వవేత్తయని రెండేసి యర్థములు గలవు. రెండవయర్థమే రాజున కన్వయించును. అయినను శ్లేష సామర్థ్యముచేత మొదటియర్థము కూడ రాజుతో ననువృత్తిని పొందుచున్నది. కావుననే శ్లిష్టరూపకము అన్న నిర్ణయము సరిపడుచున్నది.

ఇంక ప్రకృతవిషయము అప్రకృతములయిన చతురాస్యలక్ష్మీపతి సర్వజ్ఞపదములు క్రమికమై ప్రకృతముతో నన్వయించుట యిచ్చట నున్నది. త్రిమూర్తులను పేర్కొనునపుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లని పేర్కొందుము. ఇదియే ప్రసిద్ధక్రమము. ప్రకృతమైన రాజుతో అన్వయించినట్లుగా అప్రకృ

తములను ప్రసిద్ధక్రమములో అమరించుటచేత ఇది రత్నావళ్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. కృతి రత్నావళిదనరుఁ బ్ర
కృతార్థ సంచయము వరుసఁ గీలుకొలిపినన్
జతురాననుండు లక్ష్మీ
పతి సర్వజ్ఞుండు నీవ పార్థివ ! యనఁగన్.

విమర్శ: ఇందు ప్రకృతార్థసంచయమును వరుసఁ గీలుకొలిపిన రత్నావళి యగునని యున్నది. మన మింతకుముందు చూచిన విభాగమునుబట్టి అప్రకృతార్థక్రమికయే యుద్దిష్టముగా గ్రహింపవలసి యుండును. మూలమున 'క్రమికా ప్రకృతార్థానామ్' అని యుండగా కొందరు వ్యాఖ్యాతలు 'క్రమికానాం ప్రకృతార్థానామ్' అని విభాగము చేసిరి. సూరకవికూడ వారి మార్గమునే యనుసరించెను. ఉదాహరణ సామర్థ్యమునుబట్టి 'క్రమికానాం, అప్రకృతార్థానామ్' అన్న విభాగమే సరియైనదని యనిపించును. 'నీవు చతురాస్యుండవు, లక్ష్మీపతివి, సర్వజ్ఞుడవు' అని యన్నప్పుడు ప్రకృతము "నీవు' మాత్రమే. చతురాస్యాదులు అప్రకృతములు. అప్పుడుకూడ బ్రహ్మాద్యర్థములు చెప్పినప్పుడు మాత్రమే నియతమైన క్రమము కనుపట్టును. వాఙ్నైపుణ్యము గలవాడు మొదలయిన విధమైన యర్థములకు నియతక్రమము లేదు కదా! లక్ష్యమునందు అప్రకృతార్థక్రమికాన్యాసమే యున్నది. అదియే అపేక్షితము. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వరుస నప్రకృతార్థముల్ వర్ణితంబు
లయ్యెనేని రత్నావళియై రహించు;
నీవె చతురాస్యుఁడవు నీవె శ్రీవిభుఁడవు
నీవె సర్వజ్ఞుఁడవు నృపాలావతంస !

## 75. తద్గుణాలఙ్కారః

138. తద్గుణ స్స్వగుణ త్యాగా దన్యదీయ గుణగ్రహః,
పద్మరాగాయతే నాసామౌక్తికం తే ఽధరత్విషా॥

టీక : స్వగుణ త్యాగాత్ = స్వీయగుణమును విడిచిపెట్టుటవలన; అన్య దీయ గుణగ్రహః= పరకీయగుణమును గ్రహించుట; తద్గుణః= తద్గుణాలంకారము॥ తే= నీయొక్క; నాసామౌక్తికమ్= ముక్కునకున్న ముత్తెము; అధర త్విషా=అధరకాంతిచేత; పద్మరాగాయతే=పద్మరాగమువలె నగుచున్నది.

వ్యాఖ్య : స్వీయగుణమును విడిచిపెట్టి అన్యగుణమును స్వీకరించుట వర్ణితమైన తద్గుణాలంకార మగును. ఇది లక్షణము. 'తద్గుణము' అని యనగా అన్యముయొక్క గుణమును గలది యనియే యర్థము. కావున, తద్గుణాలంకార మన్నపేరు దీనికి అన్వర్థ మగుచున్నది.

నీ ముక్కున కున్న ముత్తెము అధరకాంతిచేత పద్మరాగమువలె నగుచున్నది- ఇది లక్ష్యము. ముత్తెము తెల్లగా నుండును; అధరకాంతి యెఱ్ఱగా నుండును. ఈ యెఱ్ఱదనమువలన ముత్తెము పద్మరాగమువలె నగుచున్నది. అనగా ఎఱ్ఱబడుచున్నదని తాత్పర్యము. ముత్తెము తనగుణమగు తెల్లదనమును విడిచి, అధరముయొక్క ఎఱ్ఱదనమును స్వీకరించుట యిచ్చట కలదు. కావుననే, యిది తద్గుణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. స్వగుణ త్యాగంబున న
న్యగుణావాప్తి యగునేని నది తద్గుణమౌ;
దొగకంటి నత్తు ముత్తెము
పగడమువలెఁ దోఁచె నధర భాభాసితమై.

## 76. పూర్వరూపాలఙ్కారః (తద్భేదః)

139. పునస్స్వగుణ సంప్రాప్తిః పూర్వరూప ముదాహృతమ్,
హార కణ్ఠాంశులిప్తోఽపి శేష స్త్వద్యశసా సితః॥

టీక : పునః=మరల; స్వగుణసంప్రాప్తిః=స్వీయగుణలాభము; పూర్వరూపమ్= పూర్వరూపాలంకారముగా; (సూరిభిః= పండితులచేత); ఉదాహృతమ్=ఉదాహరింపబడినది॥ శేషః=ఆదిశేషుడు; హరకణ్ఠాంశు + లిప్తః + అపి =ఈశ్వరుని కంఠమునందలి శోభలచేత పూత నొందినప్పటికి; త్వత్ + యశసా=నీయొక్క కీర్తిచేత; సితః=తెల్లనై యుండెను.

వ్యాఖ్య : స్వీయగుణమును విడిచియు, మరల గ్రహించినయెడల, అది పూర్వరూపాలంకార మగును. పూర్వరూపమును గ్రహించుట యాశ్రయముగా ప్రవర్తించుటచేత. దీనికి పూర్వరూపాలంకార మన్న పేరు అన్వర్థముగా నున్నది.

శేషుడు హరకంఠ కాంతిలిప్తుడైనను నీ కీర్తిచేత తెల్లనయ్యెను- ఇది లక్ష్యము. ఒకరాజును ప్రశంసించుచు పలికిన వాక్యమిది. శివుడు నీలగ్రీవుడు; నల్లనికంఠము కలవాడు. శేషుడు తెల్లనివాడు. శివుని కంఠమునందలి నల్లదనముచేత తెల్లనిశేషుడు నల్లబడినాడు. ఇంతవరకుమాత్రమే యైన యెడల, ఇది తద్గుణాలంకారమే యగును. కీర్తి తెల్లగా నుండునని కవి సంప్రదాయము. రాజుయొక్క కీర్తి సర్వవ్యాపకము. అందువలన శేషుని స్పృశించి, క్రొత్తగావచ్చిన నల్లదనమును పోగొట్టి, పూర్వవర్ణమైన తెలుపునే వెలయించెను. ఇట్లు పూర్వవర్ణము కలిగినట్లు వర్ణించుటనుబట్టియే, యిది పూర్వరూపాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇదియొక భేదము.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరారుఁ బూర్వరూపము
పునరాత్మగుణాప్తిమైనఁ; బురహర కంఠాం
శునిలిప్తుఁ డయ్యు నీయశ
మున శుభ్ర శరీరుఁ డయ్యె భుజగేంద్రుఁ డనన్.

రెండవ భేదము

140. పూర్వావస్థానువృత్తిశ్చ వికృతేసతి వస్తుని,
దీపే నిర్వాపితేఽప్యాసీ త్కాఞ్చీ రత్నై ర్మహాన్మహః॥

టీక ; వస్తుని=వస్తువు; వికృతేసతి=మార్పు పొందగా; పూర్వావస్థా + అనువృత్తి + చ= పూర్వమున్న స్థితినే అనుసరించుటయు; (పూర్వరూపాలంకారః=పూర్వరూపాలంకారము)॥ దీపే= దీపము; నిర్వాపితే + అపి= ఆర్పబడినప్పటికిని; కాఞ్చీరత్నైః=మొలనూలునకున్న రత్నములచేత; మహత్ + మహః=గొప్పకాంతి; ఆసీత్=కలిగెను.

వ్యాఖ్య : వస్తువు వికృతిని పొందినప్పుడుకూడ పూర్వస్థితియే అనుసృతమైనట్లు వర్ణింపబడినచో, అది పూర్వరూపాలంకారమునందలి రెండవ భేద

మగును. ఇది లక్షణము. మొదటి భేదమునందు 'నడుమ స్వగుణహాని కలుగుట' యున్నది. రెండవ భేదమునందు హేతువు మారుచుగాని స్థితి మారదు. పూర్వస్థితియే తత్స్థితికి కారణమైన వస్తువు మారినప్పటికిని, తాను మారకుండ అనుసృతమగును. పూర్వరూప మనుసృత మగుటయే యాశ్రయమగుటను బట్టి, దీనికి పూర్వరూపాలంకార మన్నపేరు తగియున్నది.

దీపము నార్పివేసినను మొలనూలి రత్నములవలన గొప్పకాంతి యమరెను- ఇది లక్ష్యము. ఇదియొక శృంగార సన్నివేశము. ముగ్ధయగు నాయిక సిగ్గుచేత దీపము నార్పివేసెను. అందువలన చీకటి యలముకొనును నని యామె భావము. కాని యామె ధరించిన మొలనూలు నందలి రత్నముల కాంతుల వలన వెలుగులే యలముకొనుట తటస్థించెను. మొదటనున్న వెలుగులకు దీపము కారణము; తరువాతనున్న వెలుగులకు కాంచీరత్నములు కారణము. కారణములు మారినప్పటికిని వెలుగునందు మార్పు రాలేదు. పూర్వరూపమే అనుసృత మయ్యెను. కావుననే, యిది పూర్వరూపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. వస్తువు వికృతి నొందఁ బూర్వపుటవస్థ
యనుసృతం బయ్యెనని తెల్ప నదియె యౌను,
దీప మార్పివేసినఁగూడఁ దేజరిల్లెఁ
దన్వి కాంచికాదామ రత్నముల కాంతి.

## 77. అతద్గుణాలఙ్కారః

**141.** సఙ్గతాన్యగుణానఙ్గీకార మాహు రతద్గుణమ్,
చిరం రాగిణి మచ్చిత్తే నిహితాపి న రజ్యసి॥

టీక: సంగత=కూడియున్న; అన్యగుణ= అన్యపదార్థముయొక్క గుణమును; అనఙ్గీకారమ్=అంగీకరింపకుండుటను; అతద్గుణమ్= అతద్గుణాలంకారమని; ఆహుః= పిలుతురు॥ చిరమ్ = చాలకాలము; రాగిణీ = రాగమయమైన; మత్ + చిత్తే = నామనస్సునందు; నిహితా + అపి = ఉన్నదానవైనప్పటికిని; న + రజ్యసి= రాగమును పొందవు.

వ్యాఖ్య: సంగతమైన అన్యపదార్థముయొక్క గుణమును గ్రహింప కుండుట వర్ణితమైన, అది అతద్గుణాలంకార మగును. అతద్గుణము అన్న శబ్ద మునకు 'దానియొక్క గుణము లేనిది' అన్నది యౌగికార్థము. కావున, దీనికి అతద్గుణ మన్న పేరు అన్వర్థమగుచున్నది. ఇది తద్గుణమునకు సరిగా విరుద్ధ మగు నలంకారము.

నీవు రాగమయమైన నామనస్సున చాలకాలము నుండియు రాగము నొందలేదు- ఇది లక్ష్యము. పరాఙ్ముఖియైన నాయిక నుద్దేశించి నాయకుడు వచించిన వాక్యమిది. 'నేను నిన్ను ప్రేమించుచుంటిని. నీవు నన్ను ప్రేమింప కుంటివేమి?' అన్నది తాత్పర్యము. కాని యీమాటను చెప్పుటలో ఒకరీతి యవలంబింపబడినది. 'రాగమయమైన నామనస్సున నీవుంటివి; తత్సంసర్గము వలన నీవును రాగమయివి కావలసినది. కాలేదు' అని యనుట జరిగినది. హృదయమందలి రాగము హృదయములోనే యున్న ప్రేయసికి అంటుకుం డుట చెప్పబడినది. కావుననే, యిది యతద్గుణాలంకారమునకు లక్ష్య మగు చున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. జానొందు సంగతాను గు
ణానంగీకృతి యతద్గుణాలంకృతి నాఁ;
జాన! చిరరాగయుతయును
మానసహితవు నయియుండి మనసీవు గదే!

విమర్శ: పైపద్యమున లక్ష్యము సక్రమముగా లేదు. మొత్తము మీద తాత్పర్యార్థము మాత్రమే యున్నది. కాని యలంకారమున కావశ్యక మైనరీతి యదృశ్యమైనది. మూలవిధేయముగా నుండుటకై యీక్రింది పద్య మును గ్రహింపవచ్చును.

గీ. సంగతపదార్థధర్మంబు సమ్మతంబు
కానియెడ నతద్గుణమనాఁ గాంతినింపు;
రాగయుతమైన నా యంతరమునఁ జాల
కాల ముండియు సుంత రాగమ్ము గొనవు.

## 78. అనుగుణాలఙ్కారః

**142.** ప్రాక్సిద్ధ గుణోత్కర్షోఽనుగుణః పరసన్నిధేః,
నీలోత్పలాని దధతే కటాక్షై రతినీలతామ్॥

టీక : పరసన్నిధేః=అన్యవస్తువుయొక్క సన్నిధానమువలన; ప్రాక్ + సిద్ధ=పూర్వమే సిద్ధించిన; గుణ + ఉత్కర్షః=స్వగుణముయొక్క యాధిక్యము. అనుగుణః= అనుగుణాలంకారము॥ కటాక్షైః = వాలుచూపులచేత; నీలోత్పలాని= నల్లగలువలు; అతినీలతామ్=మిక్కిలినల్లదనమును; దధతే= ధరించుచున్నవి.

వ్యాఖ్య : పూర్వసిద్ధమైన స్వగుణమునకు అన్యవస్తు సన్నిధానమువలన ఉత్కర్షము గలిగినట్లు వర్ణించినచో, అది అనుగుణాలంకార మగును. ఇది లక్షణము. పూర్వసిద్ధమైన స్వగుణమునకు అనుగుణమైన అన్యపదార్థ గుణము కలియుటచేత ఉత్కర్షము కలుగును. అనుగుణత్వమువలన నతిశయము కలుగుచుండుట యిచ్చటి విషయము. కావుననే, అనుగుణాలంకార మన్న పేరు దీనికి అన్వర్థమగుచున్నది.

వాలుచూపులచేత నల్లగలువలు మరింత నల్లదనమును దాల్చుచున్నవి- ఇది లక్ష్యము. స్త్రీలచూపులు నల్లగానుండును. నల్లగలువలు నల్లగానుండును. స్త్రీలు కర్ణావతంసములుగా నల్లగలువలను ధరించినప్పు డవి కన్నులకు సన్నిహితములై యుండును. నల్లనికన్నులకు సన్నిహితములై యుండుటచేత నల్లగలువలు నల్లదనమున కుత్కర్షకలుగును. ఇట్లు అనుగుణమైన అన్యపదార్థ గుణముచేత స్వీయగుణమున కుత్కర్ష వర్ణిత మగుటచేత, ఇది అనుగుణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అనుగుణం బగుఁ బూర్వసిద్ధాత్మగుణము
అన్యసన్నిధివలనఁ బెంపందెనేని;
నల్లతొవలు కటాక్షేక్షణములచేత
నధికనీలిమఁ దాల్చెడు నన్నయట్లు.

## 79. మీలితాలఙ్కారః

143. మీలితం యది సాదృశ్యా ద్భేద ఏవ న దృశ్యతే,
రసో నాలక్షి లాక్షాయా శ్చరణే సహజారుణే॥

టీక ; సాదృశ్యాత్=సదృశత్వమువలన; భేదః + ఏవ= భేదమే; యది + న + దృశ్యతే= కనిపింపకున్నయెడల; మీలితమ్ = మీలితాలంకారము॥ సహజ + అరుణే = స్వతస్సిద్ధముగనే యెఱ్ఱనైదైన; చరణే = పాదమునందు; లాక్షాయాః + రసః=లత్తుకపూత; న + అలక్షి=కనిపింపలేదు.

వ్యాఖ్య : సాదృశ్యమువలన భేదమే కనిపింపకున్నయెడల, అది మీలితాలంకార మగును. ఇది లక్షణము. వస్తువులు భిన్నములు; అయినను సదృశములగుటవలన భిన్నత్వము కానరాదు. సదృశత్వ సామర్థ్యమువలన భేధకలక్షణము మీలితమై పోవునన్నమాట. మీలిత మగుట యనగా కప్పు వడుట యని యర్థము; ఇచ్చట భేదకలక్షణము కప్పువడుట జరుగుచున్నది. కావుననే మీలితాలంకార మన్నపేరు దీనికి సార్థకమగుచున్నది.

సహజారుణములైన చరణములందు లాక్షారసము కనిపింపకున్నది- ఇది లక్ష్యము. చరణముల గుణము అరుణత్వము. లాక్షారసగుణము కూడ అరుణత్వమే. కావున గుణములకున్న సాదృశ్యమువలన ఒకదానినుండి యొకటి వేరుచేయుట వీలుకాదు. సహజమైన యరుణత్వ మేదో, లాక్షారసము వలన వచ్చిన యరుణత్వ మేదో తెలియుటలేదు. ఒకదానివలన నొకటి కప్పు వడిపోవుట జరిగినది. కావుననే, యిది మీలితాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. మీలితం బగు భేద మేమియును సమత
వలనఁ గానఁగఁ బడ దేని; వామనయన !
కానఁబడ దించు కేని లాక్షారసంబు
సహజశోణమ్ములైన నీ చరణములను.

## 80. సామాన్యాలఙ్కారః

144. సామాన్యం యది సాదృశ్యా ద్విశేషో నోపలక్ష్యతే,
పద్మాకరం ప్రవిష్టానాం ముఖం నాలక్షి సుభ్రువామ్॥

టీక : సాదృశ్యాత్=సాదృశ్యమువలన; విశేషః= విశేషము; యది+న+ఉపలక్ష్యతే=కనుపట్టనియెడల; సామాన్యమ్= సామాన్యాలంకారము॥ పద్మాకరమ్=పద్మముల కాకరమైన సరస్సును; ప్రవిష్టానామ్= ప్రవేశించిన; సుభ్రువామ్=యువతులయొక్క; ముఖమ్=ముఖము; న+అలక్షి=కనిపించుట లేదు.

వ్యాఖ్య : సాదృశ్యమువలన విశేషము కనుపట్టనియెడల, అది సామాన్యాలంకార మగును. ఇది లక్షణము. విశేష మనగా భేదకధర్మ మనియే యర్థము. సదృశత్వమువలన భిన్నము లయిన వస్తువులనడుమ భేదము కానరాకున్నయెడల, ఇది యగును. "సమానయోర్భావః సామాన్య" మ్మన్న వ్యుత్పత్తినిబట్టి సమానత్వము ప్రాతిపదికగా ప్రస్తుతాలంకారము 'సామాన్యము" అన్న పేరును సార్థకము చేసికొనుచున్నది.

ఇక్కడనే యింకొక విషయమును చెప్పుకొనవలయును. వెనుక చెప్పికొన్న మీలితమునకును, దీనికిని సామ్యము చాల కలదు. కావున భేదమును జాగరూకతతో గమనించుట యవసరము. మీలితమునందు వస్తువులు భిన్నములైనను, గుణములు సమానముగానే యుండును. గుణసామ్యమువలననే భేదము కానరాకపోవుట యచ్చట కలుగుచున్నది. సామాన్యాలంకారమునందు వస్తువులును భిన్నములే, గుణములును భిన్నములే. కాని గుణములకున్న సదృశత్వమునుబట్టి వస్తువుల విశేషము గుర్తింపరాకుండుట యిచ్చట జరుగుచున్నది. మీలితమున ద్విత్వప్రతీతి యుండదు. సామాన్యమున ద్విత్వప్రతీతి యుండును.

పద్మముల కాకరమైన కొలనిలో దిగిన యువతుల ముఖములు కనిపించుటలేదు- ఇది లక్ష్యము. కొలనిలో పద్మము లున్నవి. ముఖములు పద్మసదృశములు. యువతులు కొలనిలో కంఠదఘ్నముగా దిగినప్పుడు ముఖములు మాత్రము నీటిపై నున్నవి. పద్మ సాదృశ్యమువలన పద్మము లేవో ముఖము లేవో తెలియకుండ నున్నవి. సాదృశ్యమువలన సమానత్వము తెలుపబడుచున్నది. కావుననే, యిది సామాన్యాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అలరు సామాన్య మన విశేషము సదృశత
కలుగఁ జూపట్టదేని నస్తోకవ్యములను;

దమ్మికొలఁకుల దాఁకొన్న తలిరుఁబోండ్ల
యాననము గుర్తుపట్టరా దనినకరణి.

విమర్శ: 'సాదృశ్యాత్' అన్నపంచమి యిచ్చట నిర్ధారణార్థకముగా అనూదితమైనది. ఇట్లుకాక హేత్వర్థకముగానే యనువదించుట సమంజసముగానుండును. ఈ విషయము పై వ్యాఖ్యనుబట్టి గ్రహింపవచ్చును. కావున, 'సదృశతకంటె' ననుటకు బదులుగా 'సదృశతవలన' నని సవరించుట సముచితముగా నుండును. లక్ష్యమునందు 'దాఁకొన్న' యనుట బాగుగా లేదు. దాగుకొనినయెడల ముఖము కనిపింపనే కనిపింపదు; గుర్తుపట్టుట యను ప్రశ్నకే తావులేదు. కావున, దానికి బదులుగా 'దిగినట్టి' అని వాడుట యుక్తముగా నుండును. అప్పుడు లక్షణ లక్ష్యములు చక్కగా సరిపోవును.

81. ఉన్మీలితాలఙ్కారః 82. విశేషకాలఙ్కారః

145. భేద వైశేష్యయోః స్ఫూర్తా వున్మీలిత విశేషకౌ,
హిమాద్రిం త్వద్యశోమగ్నం సురాః శైత్యేన జానతే,
లక్షితాన్యుదితే చన్ద్రే పద్మాని చ ముఖాని చ॥

టీక: భేద వైశేష్యయోః= భిన్నత్వ విశిష్టత్వములకు; స్ఫూర్తౌ (సతి)= ప్రకాశితము లగుచుండగా; ఉన్మీలిత విశేషకౌ= ఉన్మీలిత విశేషకము లన్న యలంకారములు॥ త్వత్ + యశః + మగ్నమ్= నీయొక్క కీర్తియందు మునిగి యున్న; హిమాద్రిమ్=హిమాచలమును; సురాః=దేవతలు; శైత్యేన=చల్లదనము చేత; జానతే=తెలిసికొనుచున్నారు॥ చన్ద్రే= చంద్రుడు; ఉదితే (సతి) =ఉదయింపగా; పద్మాని + చ=పద్మములును; ముఖాని + చ = ముఖములును; లక్షితాని=గుర్తింపబడినవి.

వ్యాఖ్య: భిన్నత్వ విశిష్టత్వములు వెల్లడియైనయెడల ఉన్మీలిత విశేషకాలంకారము లగును. ఇందు రెండలంకారములకు లక్షణ మొక్కటిగా చెప్పబడినది. దానిని వేరుగా వేరుగా ఇట్లు చెప్పుకొనవలయును. భిన్నత్వము స్ఫురించిన యెడల, అది ఉన్మీలితాలంకార మగును. విశిష్టత్వము స్ఫురించిన యెడల, అది విశేషకాలంకార మగును. ఇంతకుముందు చెప్పుకొన్న మీలితాలంకారమునకు విరుద్ధమైనది యీ ఉన్మీలితాలంకారము. సామాన్యాలంకా

రమునకు విరుద్ధమైనది యీ విశేషకాలంకారము, కావున వాని లక్షణముల ననుసరించి వీని లక్షణములను మరికొంచెము వివరముగా చెప్పుకొనవచ్చును.

సాదృశ్యమువలన రెండు భిన్న వస్తువులకు భేదము గోచరము కాక పోగా, తద్భేద ప్రతిపాదకము స్ఫురించినయెడల, అది ఉన్మీలితాలంకార మగునన్నది నిష్కృష్టార్థము. ఉన్మీలితము అనియనగా 'తెరవబడినది' యని యర్థము. కప్పవడియున్న భేదము తెరవబడుటయే యిచ్చట జరుగుచున్నది. కావున దీనికి ఉన్మీలిత మన్న పేరు సార్థకముగా నున్నది.

నీకీర్తియందు మునిగిన హిమాచలమును శీతలత్వముచేత దేవతలు గ్రహించుచున్నారు- ఇది లక్ష్యము. ఇది రాజప్రశంసాత్మకముగా ప్రవర్తించిన వాక్యము. కీర్తి తెల్లగానుండు నన్నది కవి సమయము. కీర్తి వ్యాపించుట వలన సర్వ పర్వతములును తెల్లబడినవి. హిమాద్రి సహజముగానే తెల్లగా నుండును. కీర్తియొక్క తెల్లదనమువలన, ఇతర పర్వతములకు తెల్లదనము ప్రాప్తించినది. కీర్తివలన లభించిన తెల్లదనమునకును, సహజమైన తెల్లదనమునకును సమత్వము గలదు. అందువలన హిమాలయమును గుర్తించుట కష్టమైనది. కీర్తికి శీతలత్వము లేదు; హిమాలయమునకు శీతలత్వము గలదు. ఇది భేదకగుణము. ఈ గుణమునుబట్టి దేవతలు హిమాలయమును గుర్తింతురని చెప్పుటచేత, ఇది ఉన్మీలితాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. భేద విస్ఫురణంబుఁ గల్పించుచుండఁ
దనరుఁ గృతులందు నున్మీలితం బనంగ;
నీ యశోలగ్నమైన దానిని హిమాద్రి
నమరు లెఱిఁగెద రివముచే ననువిధమున.

సాదృశ్యమువలన రెండు భిన్నవస్తువులలోని విశేషము గోచరము కాక పోగా, తద్వైశిష్ట్యప్రతిపాదకము స్ఫురించినయెడల, అది విశేషకాలంకార మగునన్నది నిష్కృష్టార్థము. విశేషకము అనియనగా విశేషమును గలది యని యర్థము. రెండు భిన్నవస్తువులను సాదృశ్యమువలన సమానములుగా నెంచుచుండగా విశేషము గోచరించుట యిచ్చట జరుగుచున్నది. ఆవిశేషము

వలననే ఒకదానికంటె మరొకటి విశిష్టమని గుర్తించుటకు వీలగుచున్నది. కావున, దీనికి విశేషక మన్న పేరు సార్థకమగుచున్నది.

చంద్రు డుదయించగా పద్మములును ముఖములును గుర్తింపబడినవి- ఇది లక్ష్యము. పద్మములును ముఖములును భిన్నవస్తువులే. కాని సదృశత్వమువలన వానివాని వైశిష్ట్యమును గుర్తించుట వీలుకాక, సమానములని తలచుట జరిగినది. చంద్రోదయముచేత పద్మములు సంకోచము నొందును: ముఖములు యథాపూర్వముగా నుండును. ఈ విశిష్టధర్మమునుబట్టి బద్మము లేవియో ముఖము లేవియో గుర్తించుట జరుగును. విశిష్టధర్మ స్ఫురణమును బట్టియే, ఇది విశేషకాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఇచ్చట నింకొకవిషయమును గుర్తించుకొనుట మంచిది. పూర్వము విశేషాలంకార మొకటి చూచితిమి. అది యాధారాధేయభావము నాశ్రయించి ప్రవర్తించును. కావున నామసాదృశ్యముతప్ప, దానికిని దీనికి నెంతమాత్రమును సంబంధము లేదు.

ఆంధ్రచంద్రాలోకము

క. అలరు విశేషక మనియెడు
నలంక్రియ విశేషభావ మలరుచు నుండన్;
నెల వొడమఁ దెలియఁ బడియెడు
జలజంబులు నెమ్మొగములు జనుల కనుక్రియన్.

## 83. ఉత్తరాలఙ్కారః

గూఢోత్తరమ్ :

146. కిఞ్చి దాకూత మహితం స్యా ద్గూఢోత్తర ముత్తరమ్,
యత్రాసౌ వేతసః పాన్థ తత్రేయం సుతరా సరిత్॥

టీక ; కిఞ్చిత్ = ఒకానొక; అకూత మహితమ్ = అశయసంపన్నమైన; ఉత్తరమ్ = సమాధానము; గూఢోత్తరమ్ = గూఢోత్తరాలంకారము; స్యాత్ = అగును॥ పాన్థ = ఓ ప్రయాణీకుడా; యత్ర = ఎక్కడ; అసౌ = అకనిపించుచున్న; వేతసః = ప్రబ్బపొద: (వర్తతే = ఉన్నదో); తత్ర = అక్కడ; ఇయమ్ = ఈ; సరిత్ = ప్రవాహము; సుతరా = సులభముగా దాటదగినది.

వ్యాఖ్య : ఉత్తరాలంకారము రెండు భేదములను కలిగియుండును. అందు మొదటిది గూఢోత్తరము; రెండవది చిత్రోత్తరము. అన్నింటియందు నుత్తరమే ప్రాతిపదిక యగుటచేత ఉత్తరాలంకార మన్న పేరు చెల్లుచున్నది. మొదట గూఢోత్తర మిచ్చట నిరూపిత మగుచున్నది.

ఒకానొక యాశయముతో కూడియున్న సమాధానము వర్ణితమైన యెడల, అది గూఢోత్తరాలంకార మగును. ఇది లక్షణము. ఒక రొక ప్రశ్న మడుగగా, దానికి మరొకరు బదలు పల్కుదురు. ఆ పల్కినప్పుడు ప్రశ్న మునకు సమాధానమును చెప్పుచున్నట్లు తమ యభిప్రాయమును గూఢముగా వెల్లడించుట జరుగును. అభిప్రాయగర్భితమైన యుత్తర మిచ్చట నుండుటను బట్టి, దీనికి గూఢోత్తర మన్నపేరు అన్వర్థమగుచున్నది.

ఆ ప్రబ్బపొదగలచోట ఈ నదిని సులభముగా దాటవచ్చును- ఇది లక్ష్యము. ఎవరో పాంథుడు 'ఈ నదిని సులభముగా దాటుట కెక్కడ వీల గును ?' అని ప్రశ్నించెను. దానికి సమాధానముగా ఒక యువతి పై వాక్య మును పలికెను. ఇది సాభిప్రాయ సమాధానము "ఆ" యని నిర్దేశించుటచేత ఎక్కువదూరమునందు లేదన్నభావము వ్యక్తమగును. 'ప్రబ్బపొద' యని యనుటలో ఏకాంతమునకు యోగ్యమైన స్థల మన్న సంకేతము కలదు. సరిత్, సుతరా- అన్నవి స్త్రీలింగ శబ్దములు. వీనివలన, స్త్రీయైన తానుకూడ "సుతరా'' అన్న భావమును వ్యక్తముచేయుట జరుగును. మొత్తముమీద, పాంథునియందు మనసుపడిన యువతి ఆతని ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నట్లుగా తమ సమావేశమున కనుకూలమైన స్థలమును గూఢముగా చెప్పుచున్నది. గూఢమైన యాశయముతోడి సమాధానమునుబట్టియే, యిది గూఢోత్తరాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. కావున, ఈ క్రిందిపద్యమును గ్రహింపవచ్చును.

గీ. కించిదాకూత మహితమై కెరలునేని
నుత్తరంబది యౌను గూఢోత్తరంబు;
పాంథ ! ఎదుట నల్లదిగో ! ప్రబ్బపొద యున్న
చోట నీనది సులువుగా దాటవచ్చు.

చిత్రోత్తరమ్ :

147. ప్రశ్నోత్తరాన్తరాభిన్న ముత్తరం చిత్రముత్తరమ్
కేదార పోషణరతాః కేఖేటాః కిం చలం వయః.

టీక : ప్రశ్న=ప్రశ్నకు; అభిన్నమ్=భిన్నముకానటువంటి; ఉత్తరమ్=సమాధానము; చిత్రమ్+ఉత్తరమ్=చిత్రోత్తరమన్న యలంకారము॥ ఉత్తరాన్తర = మరొక సమాధానముతో; అభిన్నమ్ = భిన్నము కానటువంటి; ఉత్తరమ్=సమాధానము; చిత్రమ్+ఉత్తరమ్+చిత్రోత్తరమన్న యలంకారము॥ కే=ఎవరు; దార + పోషణ + తాః=భార్యలను పోషించుటయందాసక్తిగలవారు; కేదార+పోషణ+రతాః=పొలములను పోషించుటయందాసక్తిగలవారు॥ కే=ఏవి; ఖేటాః=ఆకాశమున సంచరించునవి; కిం=ఏది; చలమ్=కదలిపోవును; వయః=పక్షులు, వయస్సు.

వ్యాఖ్య : చిత్రోత్తరాలంకారము మరల రెండువిధములుగా విభాగము నొందును. మొదటిది ప్రశ్నాభిన్నోత్తరము; రెండవది ఉత్తరాంతరాభిన్నోత్తరము. 'చిత్ర' శబ్దమునకు చిత్తమును రంజింపజేయునదని వ్యుత్పత్త్యర్థము. ఈ రెండువిధములయిన విభాగములందును హృదయరంజనము కలుగును. కావున చిత్రమన్నది యీ ఉత్తరాలంకారమునకు విశేషణముగా పూర్వమందు చేరుచున్నది.

ఇందు మొదటిభేదమైన ప్రశ్నాభిన్నోత్తరమును చూతము. ప్రశ్నకు అభిన్నమైన యుత్తరము కలది ప్రశ్నాభిన్నోత్తరము. ఇది లక్షణము. ఇచ్చట ప్రశ్నయే ఉత్తరముకూడ నైయుండును. అనగా ప్రశ్నమునందే ఉత్తరము నిక్షిప్తమైయుండును. ప్రశ్నము సహజముగా ఉత్తరసాకాంక్షమై యుండును. అట్లుకాక ప్రశ్నము నుత్తరము రెండు నొక్కటియే యగుట చిత్తరంజకమగును. కావుననే, దీనికి చిత్రోత్తరాలంకార మనుపేరు చెల్లుచున్నది.

'కేదారపోషణరతాః ?' అన్నది ప్రశ్నము. దారపోషణరతాః=భార్యలను పోషించుటయందాసక్తిగలవారు; కే=ఎవరు–ఇది ప్రశ్నమైనపుడు విభాగము. ఇదియే సమాధానముకూడ. కేదార=పొలములను; పోషణరతాః=పోషించుటయందాసక్తిగలవారు. 'కే' అన్నది వేరుగా ప్రశ్నవాచకమగుచున్నది. సమాధానమందు 'కేదార' అని తరువాతనున్న దారశబ్దముతో

కలిసి క్రొత్తశబ్దము నేర్పచుచున్నది. ఇచ్చట ప్రశ్నకు వాడిన వాక్యమునే సమాధానమునకు వాడుట జరుగుచున్నది. ప్రశ్నకు అభిన్నమైన ఉత్తర మిచ్చుట నుండుటచే ప్రశ్నాభిన్నోత్తరము అన్న చిత్రోత్తరప్రథమభేదమునకు ఇది లక్ష్యమగుచున్నది.

'కేదార' శబ్దమును ఒకే శబ్దముగా నొకమారును, విడదీసి రెండు పదములుగా నొకమారును గ్రహించుట జరుగుచున్నది. విరుచుటలోని భేదము వలన, భిన్నార్థములు వచ్చినయెడల సభంగశ్లేషమని యందురు. సభంగ శ్లేషము నాశ్రయించుకొనియే ప్రకృతము చెప్పుకొనుచున్న చిత్రోత్తరము ప్రవర్తించుచున్నది.

ఇప్పుడింక రెండవభేదమైన ఉత్తరాంతరాభిన్నోత్తరమును చూతము. ఉత్తరాంతరమునకు అభిన్నమైన యుత్తరము కలది ఉత్తరాంతరాభిన్నోత్తరము. ఇది లక్షణము. ఒక ప్రశ్నకు ఒక సమాధాన ముండుట సహజము. ప్రశ్నము భిన్నమైనపుడు సమాధానము భిన్నముగా నుండుటయు సహజమే. కాని వేర్వేరు ప్రశ్నముల కొక్కటియే సమాధాన మిచ్చుట నుండును. కావుననే, యిది చిత్తరంజకమై చిత్రోత్తరాలంకారమున ద్వితీయభేదముగా చెల్లుచున్నది.

'కే ఖేటాః?' అన్నది ఒకప్రశ్న. దీనికి "ఆకాశమున సంచరించున వేవి?" యన్నది యర్థము, 'కిం చలమ్?' అన్నది రెండవప్రశ్న. దీనికి 'చలనగుణము కలదేది?' అన్నది యర్థము. రెండింటికిని సమాధానముగా "వయః" అన్నది యొక్కటే ప్రవర్తించినది. 'విః' అని యనగా పక్షి యని యర్థము. దానికి బహువచనరూపము 'వయః' కావున మొదటిప్రశ్నమునకు 'పక్షులు' అన్న యర్థమున "వయః' అన్నపదము సమాధానమగుచున్నది. 'వయస్' అన్న సకారాంతశబ్దముకూడ నొకటికలదు. ఇది "వయః" అని రేఫక వచనమునందే యుండును. దీనికి 'వయస్సు' అని యర్థము. ఇది రెండవ ప్రశ్నమునకు సమాధానమగుచున్నది. ఇట్లు, ఉత్తరము ఉత్తరాంతరము- రెండు నభిన్నములగుటచేత ఉత్తరాంతరాభిన్నోత్తరము అన్న చిత్రోత్తర ద్వితీయభేదమున కిది లక్ష్యమగుచున్నది.

"వయః" అన్న ఒకేపదము భిన్నార్థముల నొసంగుటచేత, అభంగశ్లేష మన్నది యలంకారమగును. ఇచ్చట అభంగశ్లేషము నాశ్రయించుకొనియే ప్రకృతము చెప్పుకొనుచున్న చిత్రోత్తరాలంకారము ప్రవర్తించుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. పరఁగుఁ గృతులందుఁ బ్రశ్నో
త్తరమనఁగ నలంక్రియావతంసము ప్రశ్నో
త్తరము లొకటయిన; నెద్దీ
శ్వర వాహనమనఁగ సరస సమ్మత మగుచున్.

విమర్శ: ఇందు చిత్రోత్తరమందలి మొదటిభాగమయిన ప్రశ్నాభిన్నో త్తరము మాత్రమే ప్రసక్తమైనది, చిత్రోత్తరమన్న పేరు స్పృశింపబడవేదు. ఈ భేదమునకు ప్రశ్నోత్తర మన్నది సంజ్ఞగా సూరకవి గ్రహించినట్లు కాన వచ్చును. సంస్కృతమునందలి లక్ష్యము తెలుగులోని కనువాదితము కాదు. అందువలన సూరకవి సొంతముగా లక్ష్యమును కల్పించెను. 'ఎద్దీశ్వరవాహ నము' అన్నది ప్రశ్నయైనప్పుడు 'ఎద్ది యీశ్వరవాహనము ?' అని విభాగము నొందును. ఇచ్చట 'ఎద్ది' యన్నది ప్రశ్నవాచకము. దీనికి సమాధానము 'ఎద్దు ఈశ్వరవాహనము' అన్నది. సంధివశమున రెండు భిన్నపదము లొకే పదముగా భాసించి భిన్నార్థముల నొసగుచున్నవి. కావుననే, ప్రశ్నోత్తరము లొక్కటియే యగుటకు వీలయినది.

ఉత్తరాంతరాభిన్నోత్తరమును సూరకవి స్పృశింపలేదు. సంస్కృతము నందలి లక్ష్యము తెలుగులోనికి రాదు. కావున, నిచ్చట వేఱుగా కల్పించు కొనుటయే మార్గము. లక్షణలక్ష్యముల కీక్రిందిపద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఉత్తరాంతరాభిన్నమా నుత్తరమగు
నొక బదులె భిన్నప్రశ్నల కొప్పునేని;
నిలువ నీటికిఁ బేరేమి ? చెలువ చేతి
కెక్కి రాణించు భూషణం బేమి ? మురుగు.

## 84. సూక్ష్మాలఙ్కారః

148. సూక్ష్మం పరాశయాభిజ్ఞేతరసాకూతచేష్టితమ్ ॥
మయి పశ్యతి సా కేశైః సీమన్తమణి మావృణోత్ ॥

టీక: పరాశయ + అభిజ్ఞ=ఇతరునియొక్క యభిప్రాయమును గ్రహించినట్టి; ఇతర=తదన్యునియొక్క; సాకూతచేష్టితమ్=అభిప్రాయగర్భితమైన

చేష్టః సూక్ష్మమ్=సూక్ష్మాలంకారము॥ మయి + పశ్యతి=నేను చూచుచుండగా; సా=ఆమె; కేశైః=శిరోజములచేత; సీమన్తమణిమ్ = శిరోభూషణము నందలి మణిని; అవృణోత్=కప్పివేసెను.

వ్యాఖ్య: పరాభిప్రాయమును గ్రహించిన తదన్యునియొక్క యభిప్రాయ గర్భితమైన చేష్ట సూక్ష్మాలంకారము. ఇది లక్షణము. అభిప్రాయగర్భితమైన వాక్యమైనపుడు గూఢోత్తరాలంకార మగునని చెప్పుకొంటిమి. అభిప్రాయ గర్భితమైన చేష్టితమైనపుడు సూక్ష్మాలంకార మగును. ఇచ్చట ఎదుటివారి హృదయమునందుసైతము తత్సంబంధమైన యభిప్రాయముండును. దానిని గుర్తించియే, తదనుకూలముగా ప్రకృతచేష్టితము ప్రవర్తించును. గూఢోత్తరమునందు వక్తకు మాత్రమే యీ యభిప్రాయ ముండును. ఎదుటివ్యక్తికి యభిప్రాయ ముండవలసిన యవసరను లేదు. ఇంతకును సూక్ష్మగ్రాహిత్వము కారణముగానే, తదనుకూల చేష్టితము చేయుట జరుగును. కావున సూక్ష్మాలంకారము సార్థకమై తన యాంతరికధర్మమును వ్యక్తముచేయు చున్నది.

నేను చూచుచుండగా, ఆమె తన సీమంతమణిని కేశములతో కప్పివేసెను. ఇది లక్ష్యము. నాయకుడు నాయికాచేష్టితమును వర్ణించుచు, తన యిష్టసఖునితో వచించిన వాక్యమిది. నాయిక బహుజనమధ్యమున నుండగా నాయకు డామెను సమీపించెను. అతని యభిప్రాయము నామె గ్రహించెను. అత డామెతో ఏకాంతము నపేక్షించుచున్నాడు. కాని, ఆవిషయమును మాటలలో చెప్పలేదు. అయినప్పటికి నామె గ్రహింపగలిగెను. అతనికి సమాధానము చెప్పుట యవసరము. అక్కడనున్న యితరు లెరుగకుండునట్లు గూఢముగా చెప్పవలయును. ఎట్లు చెప్పినను వాక్కులవలన వ్యక్తమైనచో నితరులు గ్రహింపవచ్చును. కావున, ఆమె తన పాపటనున్న మణిని తన శిరోజములతో కప్పెను. ఇది యితరులకు సందేహమును కలిగింపదు. ఉద్దిష్ట వ్యక్తి మాత్రమే అవగతము చేసికొనగలుగును. అత డేకాంతమునకు సమయము నపేక్షించెను. ఆమె మణిని శిరోజములతో మూసెను. మణి కాంతులతో ప్రకాశించును. సూర్యుడు వెలుగులతో ప్రకాశించును. కావున మణి సూర్యునకు సంకేతము. శిరోజములు నల్లగా నుండును. అవి చీకటులకు సంకేతము. 'సూర్యుని చీకటులు కప్పివేసినపిమ్మట' నన్నది. తచ్చేష్టితము

నందలి భావము. చీకటి పడినపిమ్మట ఏకాంతము లభింపగలదని తాత్ప ర్యము. ఎదుటివ్యక్తి యభిప్రాయమును గ్రహించి, ఎదుటి వ్యక్తికిమాత్రమే గ్రాహ్యమగునట్లు చేష్టారూపమున సమాధానము తెల్పుట యిచ్చట నున్నది. కావుననే, యిది సూక్ష్మాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్ర చంద్రాలోకమున దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. సూక్ష్మ మైయొప్పుఁ బరభావ సూక్ష్మమెఱిఁగి
చేయు నితరుల సాకూతచేష్టితంబు;
నన్నుఁ గనుఁగొని యంతట సన్నుతాంగి
మాటు పఱిచెఁ గైశ్యమున సీమంతమణిని.

## 85. పిహితాలఙ్కారః

149. పిహితం పరవృత్తాన్త జ్ఞాతు స్సాకూతచేష్టితమ్ ।
ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్ప మకల్పయత్ ॥

టీక ; పరవృత్తాన్త జ్ఞాతుః=ఇతరులయొక్క వృత్తాంతమును గ్రహించినవారియొక్క; సాకూతచేష్టితమ్=సాభిప్రాయమైన చేష్ట; పిహితమ్= పిహితాలంకారము॥ ప్రాతః=ఉదయమున; ప్రియే=ప్రియుడు; గృహాగతే= ఇంటికిరాగా; కాన్తా=భార్య; తల్పమ్=శయ్యను; అకల్పయత్=ఏర్పాటు చేసెను.

వ్యాఖ్య : ఇతరుల గూఢప్రవర్తనము నెరిగినవారు చేయు అభిప్రాయ గర్భితమైన చేష్ట వర్ణితమైనయెడల, అది పిహితాలంకార మగును. ఇది లక్ష ణము. పిహితమని యనగా 'మూయబడినది' అని యర్థము. గ్రహించినవిష యమును గ్రహించినట్లు వాగ్ద్వారమున చెప్పకుండుటయే యిచ్చట మూయ బడుట. చేష్టారూపమున నిది వ్యక్తము చేయబడును.

సూక్ష్మాలంకారమునందును సాకూతచేష్టితమే ప్రధానాంశము. అయి నప్పటికి నచ్చటి చేష్టితము భావ్యర్థబోధకము. పిహితాలంకారమునందలి చేష్టితము భూతార్థబోధకము.

ఉదయముననే ప్రియు డింటికి రాగా భార్య శయ్యను సిద్ధముచేసెను.

ఇది లక్ష్యము ప్రియుడు. రాత్రియంతయు నింటికి రాలేదు. తెల్లవారిన పిమ్మట వచ్చెను. అతని కన్నులలోని ఎఱుపు, శరీరమునగల భోగచిహ్నములు మున్నగువానినిబట్టి యత డన్యాంగనాసక్తుడై ప్రవర్తించెనని యతని భార్య గ్రహించెను. అయినను నోటితో నేమియు ననక శయ్యను సిద్ధము చేసెను. రాత్రి నిద్రలేదనియు, అప్పుడింక నిద్రావశ్యకము గలదనియు చేష్టారూపమున సూచించుటయే యిచ్చటి విషయము. వాగ్రూపమున వెల్లడింపకుండుటయే యిచ్చట జరుగుచున్నది. కావుననే యిది, పిహితాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. పిహిత మగు నన్యకృత గూఢవృత్తి నెఱిఁగి
చేయు నితరుల సాకూతచేష్టితంబు;
తెల్లవాఱిన పిమ్మట నిల్లు సేరఁ
బతికి తల్పంబు నాయత్తపఱిచె భార్య.

## 86. వ్యాజోక్త్యలఙ్కారః

150. వ్యాజోక్తి రన్య హేతూక్త్యా యదాకారస్య గోపనమ్ ।
సఖి ! పశ్య గృహారామ పరాగై రస్మి ధూసరా ॥

టీక ; అన్య హేతు + ఉక్త్యా=కారణాంతరమును చెప్పుటచేత: ఆకారస్య=విలక్షణమగు రూపమునకు; గోపనమ్=దాపరికము; యత్=ఏదియో; (సా=అది); వ్యాజోక్తిః=వ్యాజోక్తియన్న యలంకారము॥ సఖి=ఓచెలీ; పశ్య=చూడు; గృహ + ఆరామ + పరాగైః=ఇంటి తోటయందలి పుష్పాదుల చేత; ధూసరా=ధూసరితను; అస్మి=అయితిని.

వ్యాఖ్య : కారణాంతరమును చెప్పుటచేత ఆకారగోపనము చేయుట వర్ణితమైనయెడల, నది వ్యాజోక్తి యన్న యలంకారమగును. ఇది లక్షణము. నిజమైన కారణమును దాచిపెట్టి కారణాంతరమునుచెప్పి మోసపుచ్చుటయే యిక్కడ జరుగును. వ్యాజ మనగా మోసమని యర్థము. మోసముతో కూడియున్న వచనము ప్రవృత్త మగుటయే యిచ్చట ప్రధానాంశము, కావున, వ్యాజోక్తి యన్న పేరు దీనికి సార్థకముగా నున్నది,

ఓ సఖీ! గృహారామమునందలి పుష్పాదులచేత ధూసరితనైతిని- ఇది లక్ష్యము. ఒక నాయిక యొడలంతయు మట్టికొట్టుకొని యున్నది. చెలికత్తె యామెను సందేహదృష్టితో చూచునేమో యని తలచి తాను విహారమునకై గృహారామములోని కేగెననియు, అప్పుడు గాలి కెగిరిపడిన పుష్పరజము వలన తన శరీరము ధూసరిత మయ్యెననియు వివరించెను. ఇది నిజమైన కారణము కాదు. ఆ నాయిక పుష్పోద్యానములో జారునితో భోగించుటచేత భూపరాగము శరీరమున కంటినది. కాని, ఆయథార్థకారణమును కప్పిపుచ్చి చెలికత్తెను వంచించుటకై కారణాంతరమును వచించుటచేత, ఇది వ్యాజోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఆత్మకృతగోపనమునకై యన్యహేతు
వుగ్గడించుటచేత వ్యాజోక్తి యాను;
ఏమె! సఖి! చూడు! మందిరారామపుష్ప
ధూళి మేనఁ గ్రమ్మెటఁ జేసి ధూసరితను.

## 87. గూఢోక్త్యలఙ్కారః

151. గూఢోక్తి రన్యోద్దేశ్యా గీర్యదన్యం ప్రతి కథ్యతే।
వృషాపేహి పరక్షేత్రా దాయాతి క్షేత్రపాలకః॥

టీక: అన్య+ఉద్దేశ్యా=అన్యునికై యుద్దేశింపబడిన; గీః=వచనము; అన్యం+ప్రతి=ఇతరునికొరకు; యత్+కథ్యతే=ఏది చెప్పబడునో; (సా=అది); గూఢోక్తిః=గూఢోక్తియన్న యలంకారము॥ వృష=ఓ వృషభమా; పరక్షేత్రాత్=పరక్షేత్రమునుండి; అపేహి=తొలగిపొమ్ము; క్షేత్రపాలకః=క్షేత్రపాలకుడు; ఆయాతి=వచ్చుచున్నాడు.

వ్యాఖ్య: ఒకరి కుద్దేశించిన వచనమును మరొకరిని సంబోధించి తెల్పినయెడల. అది గూఢోక్త్యలంకారమగును. ఇది లక్షణము. సంబోధింపబడిన వ్యక్తి అప్రకృతము. ప్రకృతవ్యక్తికి చెప్పవలచిన విషయమును అప్రకృతవ్యక్తిని సంబోధించి చెప్పుట జరుగును. ఉద్దిష్టవ్యక్తిని గూఢముగా

నుంచుటయే యిచ్చట ముఖ్యాంశము. ఇట్లు గూఢత నాశ్రయించిన ఉక్తి యగుటచేతనే దీనికి గూఢోక్తి యన్న పేరు అన్వర్థమగుచున్నది.

ఓ వృషభమా ! పరక్షేత్రమునుండి తొలగిపొమ్ము; క్షేత్రపాలకుడు వచ్చుచున్నాడు- ఇది లక్ష్యము. ఇచ్చట సంబోధింపబడినది వృషభము. నిజమున కుద్దేశింపబడినవాడు పరదారాసక్తుడగు నొక పురుషుడు. క్షేత్రమని యనగా "సస్యభూమి" యనియు 'భార్య' యనియు నర్థములు కలవు. అట్లే క్షేత్రపాలకుడు అనియనగా "పొలముకాపు" అని యనియు 'భర్త' యనియు నర్థములు గలవు. కావున, పైవాక్యమునకు 'ఓయీ, పరభార్యను విడిచిపెట్టి పొమ్ము; ఆమె భర్త వచ్చుచున్నాడు' అన్నదే యుద్దిష్టమైన యర్థము. సన్నివేశమునుబట్టియే దాని యర్థమును గ్రహింపవలయును. అది యెరుగని వారి కా యర్థము స్ఫురింపదు ప్రకృతవ్యక్తిని వెల్లడింపకుండుటకై గూఢత నాశ్రయించి చెప్పుట జరిగినది. కావుననే యిది గూఢోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈక్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఒకని కుద్దిష్టమైన దన్యునకుఁ దెలుప
నొప్పిదంబొచు నద్ది గూఢోక్తి యౌను;
వృషభమా ! పరక్షేత్రంబు విడిచి పొమ్ము
వచ్చుచున్నాఁడు తత్ క్షేత్ర వల్లభుండు.

## 88. వివృతోక్త్యలఙ్కారః

152. వివృతోక్తి శ్శ్లిష్టగుప్తం కవినావిష్కృతం యది ।
వృషాపేహి పరక్షేత్రాదితి వక్తి ససూచనమ్ ॥

టీక : శ్లిష్టగుప్తమ్=శ్లేషచేత గూఢముగా నుంచబడినది; కవినా=కవి చేత; యది+అవిష్కృతమ్=ఆవిష్కరింపబడినయెడల; వివృతోక్తిః=వివృతోక్తి యన్న యలంకారము॥ వృష=ఓ వృషభమా; పరక్షేత్రాత్=పరక్షేత్రమునుండి; అపేహి+ఇతి=తొలగిపొమ్మని; ససూచనమ్=సూచన సహితముగా; వక్తి=వచించును.

వ్యాఖ్య : శ్లేషచేత గూఢముగా నుంచబడినది కవిచేత నావిష్కృత మైనయెడల, అది వివృతోక్తి యగును. ఇది లక్షణము. గూఢోక్తి యందలి గూఢతను సూచనమూలమున నిర్దేశించుటయే యిందు జరుగును. వివృతము అని యనగా 'వివరింపబడినది' యని యర్థము. నిజమున కిందు వివరణము కాక గూఢత యున్నదని సూచించుటమాత్రమే జరుగును. ఆ సూచనవలననే గూఢతనే ఛేదించుటకు వీలు కలుగును. కావుననే దీనిని వివృతోక్తి యనుట యన్వర్థమగుచున్నది.

ఓ వృషభమా! పరక్షేత్రమునుండి తొలగిపొమ్మని ససూచనముగా వచించెను. ఇది లక్షణము. "ఓ వృషభమా! పరక్షేత్రమునుండి తొలగి పొమ్ము" అని యన్నంతవరకు గూఢోక్తియే. 'ససూచనముగా వచించెను' అని యనుటచేత పైవాక్యము వృషభము నుద్దేశించి పలికినది కాదన్న విష యము వివరింపబడినట్లే యగుచున్నది. ఈ సూచనమువలన, ఉద్దిష్టవిషయ మును స్పష్టముగా నూహింపనగును. కావుననే దీనిని వివృతోక్తియని యను టకు వీలు కలుగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. శ్లిష్టగుప్తమును గవి స్పష్టీకరించి
నట్లయిన నది వివృతోక్తియై యెసంగు;
వృషభమా! పరక్షేత్రంబు విడిచి పొమ్మ
టంచు వచియించె సంసూచనాత్మకముగ.

## 89. యుక్త్యలఙ్కారః

153. యుక్తిః పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే
త్వా మాలిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరేఽలిఖత్ ॥

టీక ; మర్మగుప్తయే=రహస్యగోపనమునకై; క్రియయా = చేష్టచేత; పర + అతిసంధానమ్=ఇతరులను వంచించుట; యుక్తిః=యుక్తియన్న యలం కారము॥ త్వామ్=నిన్ను; ఆలిఖన్తీ = చిత్రించుచు; అన్యామ్ = ఇతరస్త్రీని; దృష్ట్వా=చూచి; కరే=చేతియందు; పౌష్పంధనుః=పుష్పధనువును; అలిఖత్= చిత్రించెను.

వ్యాఖ్య : రహస్యగోపనమునకై క్రియాద్వారమున నితరులను వంచించుట వర్ణితమైనయెడల, అది యుక్త్యలంకార మగును. ఇది లక్షణము. యుక్తి అని యనగా ఉపాయమని యర్థము. ఉపాయము సాధనముగా నితరులను వంచించుట యిచ్చట జరుగుచున్నది. కావుననే యుక్తియన్నపేరు దీనికి అన్వర్థమగుచున్నది.

ఛేకాపహ్నుతికిని, యుక్తికిని కొంత సాదృశ్యము గలదు. ఛేకాపహ్నుతియందు తథ్యనిహ్నవము జరుగును. ఇచ్చటకూడ తథ్యనిహ్నవమే జరుగుచున్నది. ఛేకాపహ్నుతియందు వాక్కు నాశ్రయించుకొని నిహ్నవము జరుగుచుండగా, యుక్తియందు క్రియ నాశ్రయించుకొని జరుగుచున్నది. ఛేకులు అని యనగా ప్రగల్భులని యర్థము; అనగా ఉపాయశాలులనియే భావము. కాబట్టి ఉపాయశాలిత్వముకూడ రెండింటియందును సమానముగానే యుండును. ఇంక, ఆ యుపాయశాలిత్వము వాగ్రూపమున వ్యక్తమైనప్పుడు ఛేకాపహ్నుతి యనియు, క్రియారూపమున వ్యక్తమైనప్పుడు యుక్తి యనియు నిష్కర్షము.

నిన్ను చిత్రించుచుండగా, నడుమ నెవ్వతెయో రాగా, చేతియందు పూవింటిని రచించెను– ఇది లక్ష్యము. దూతిక నాయికాచేష్టితమును నాయకునకు చెప్పుచున్న సందర్భములోనిది. నాయకునియందు బద్ధమనస్కయైన నాయిక యాతని చిత్రమును లిఖించుటకు మొదలుపెట్టెను. చిత్రము చాలవరకు పూర్తి యయ్యెను. ఇంతలో ఎవ్వతెయో యచ్చటికి వచ్చెను. ఆమెకు తన రహస్యము తెలియకుండనుండుటకై, వెంటనే నాయకునిచేతియందు పుష్పధనువును చిత్రించెను. దీనివలన, తాను నాయకుని చిత్రమునుగాక పుష్పధన్వియగు మన్మథునిచిత్రమునే చిత్రించుచున్నట్టు లామెను వంచించుటయే పరమార్థము. ఇట్లు ఉపాయము నాశ్రయించి క్రియచేత నితరులను వంచించుటనుబట్టి యిది యుక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకమునందు దీనికి సూరకవి యనువాదము కానరాదు. ఈ క్రింది పద్యమును గ్రహింపవచ్చును.

గీ. ఆత్మకృతరహస్యమును గోప్యముగ నిలుప
నొరుల వంచించు చెయిదంబు యుక్తియగును;

నిన్నుఁ జిత్రించుచుండి యింతి యట కొకతె
రాఁగఁ బూవిల్లు వ్రాసెఁ గరమ్మునందు.

## 90. లోకోక్త్యలఙ్కారః

154. లోకప్రవాదానుకృతి ర్లోకోక్తి రితి కథ్యతే।
సహస్వ కతిచిన్మాసా న్మీలయిత్వా విలోచనే॥

టీక : లోకప్రవాదా + అనుకృతిః=లోకమునందలి వాడుక ననుసరించుట; లోకోక్తి + ఇతి = లోకోక్తియన్న యలంకారమని; కథ్యతే = చెప్పబడును; కతిచిత్=కొన్ని; మాసాన్=నెలలను; విలోచనే=రెండుకన్నులను; మీలయిత్వా=మూసికొని; సహస్వ=ఓర్చుకొనుము.

వ్యాఖ్య : లోకప్రవాదము ననుకరించి చెప్పుట లోకోక్త్యలంకారము. ఇది లక్షణము. సామెతలు, నానుడులు అన్న పేర ప్రతిభాషయందును సాంప్రదాయికముగా కొన్ని పలుకుబళ్లుండును. వాని భావము ప్రతిపదార్థమువలన సిద్ధించెడిదానికంటె భిన్నముగా నుండును. అట్లు లోకవ్యవహారమున జిగిదేరి, రూఢిని సంపాదించుకొన్న పలుకుబడి ననుసరించుట జరిగినయెడల, అది లోకోక్తి యగును.

కొన్ని నెలలపాటు కనులుమూసికొని యోర్చికొనుము- ఇది లక్ష్యము. ప్రోషితభర్తృకయైన నాయికను చెలికత్తె యూరడించుచు పలికిన వాక్యమిది. 'కనులు మూసికొని యోర్చికొనుము' అన్నది నానుడి. కన్నులు మూసికొనుట యిచ్చట అపేక్షితముకాదు. ఏదో యొకవిధముగా ఓర్చుకొనుటయే యుద్దిష్టము, అయినను 'కనులు మూసుకొని యోర్చుకొనుము' అని కాని 'కనులు మూసికొనుము' అనికాని యనుట 'కష్టమును సహింపుము' అని యనుటకు బదులుగా సానుభూతిపూర్వకముగా పలుకు సాంప్రదాయిక వచనము. ఇట్లు లోకరూఢి నొందిన వచనము ననుకరించుటచేతనే, యిది లోకోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

క. తనరును లోకోక్తి యనన్
జనులాడెడు నుడువులట్ల సత్కృతులను జె

ప్పిన యేనియుఁ గొన్నినెల
ల్లనుఁగవ మూసికొనియుండు కలికి ! యనంగన్.

### 91. ఛేకోక్త్యలఙ్కారః

**155.** ఛేకోక్తి ర్యత్ర లోకోక్తి స్స్యా దర్థాన్తర గర్భితా ।
భుజఙ్గ ఏవ జానీతే భుజఙ్గ చరణం సఖే ॥

టీక : లోకోక్తిః=లోకోక్తి; యత్ర = ఎచ్చట; అర్థాన్తరగర్భితా = మఱొక యర్థమును గలిగినది; స్యాత్=అగునో; (తత్ర=అచ్చట); ఛేకోక్తిః= ఛేకోక్తియన్న యలంకారము॥ సఖే=ఓమిత్రమా; భుజఙ్గచరణమ్=సర్పపాదమును; భుజఙ్గః + ఏవ=సర్పమే; జానీతే=ఎఱుగును.

వ్యాఖ్య : అర్థాంతరగర్భితమైన లోకోక్తి యున్నయెడల, అది ఛేకోక్తియన్న యలంకారమగును. ఇది లక్షణము. పూర్వము చెప్పుకొన్న లోకోక్తి లక్షణ మిచ్చట నన్వయించును. లోకోక్తివలన అర్థాంతరముకూడ వ్యంజితమగుట యిచ్చట అదనముగా జరుగును. ఛేకులనగా ప్రగల్భులని చెప్పికొంటిమి. లోకరూఢి ననుసరించినప్పటికి నర్థాంతరస్ఫూర్తి కలుగునట్లుగా మాటలాడుట ప్రగల్భుల వాక్పాటవమునకు నిదర్శనము. ఛేకులచేత ప్రయోగింపబడెడి ఉక్తి యగుటచేత, దీనికి ఛేకోక్తి యన్నపేరు సార్థకమగుచున్నది.

సర్పపాదములు సర్పమే యెఱుగును– ఇది లక్ష్యము. ఒకవ్యక్తి మఱొక వ్యక్తిని అన్యవ్యక్తివిషయమై ప్రశ్నింపగా, అతడు అక్కడనేయున్న మూడవ వ్యక్తిని చూపి పై వాక్యమును పలికెను. రెండవవాడు మొదటివాడడిగిన విషయము తనకు తెలియదనియు, మూడవవానికి తెలియుననియు చెప్పుటయే యిచ్చటి విషయము. ఈ విషయమును చెప్పుటకు పై లోకోక్తిని వాడుట జరిగినది. ఇది లోకోక్తి యగుటయేకాక, అర్థాంతరమునుగూడ స్ఫురింపజేయుచున్నది. 'సర్పపాదములు సర్పమే యెఱుగును' అని యనుటచేత సర్ప విషయము సర్పమునకు మాత్రమే తెలియునుగాని, యితరులకు తెలియదన్న భావము వ్యక్తమగును. దీనినిబట్టి యీ మూడవవ్యక్తి 'సర్పసదృశుడు' అన్న అర్థాంతరస్ఫూర్తి కలుగుచున్నది. అన్యవ్యక్తికిని, ఈ మూడవవ్యక్తికిని సహభావము కలదనియు, ఒకరు చేసినది మఱొకరికి తప్పక తెలియుననియు

వెల్లడించుటకూడ జరుగుచున్నది. మూలమునందలి భుజంగశబ్దముచేత విట త్వాది విషయములుకూడ సూచితము లగును.

ఇంతకును, పైది సంస్కృతలోకోక్తి కనువాదము. తెలుగున దానికి సమానముగా 'దొంగను దొంగయే పట్టవలయును' అని యుపయోగించుట పరిపాటి. దొంగను పట్టుకొనవలయునన్న ఇంకొక దొంగకే సాధ్యమగును. దొంగయొక్క నడవడి, దొంగయొక్క యానుపానులు గ్రహించుట మఱియొక దొంగమాత్రమే చేయగలడు. ఇరువురకు నున్న సహచరత్వమువలననే యది సాధ్యమగును. దొంగను పట్టుట తదితరుల కసాధ్యము. పై విషయమును చెప్పుటతోపాటు, దొంగను పట్టువాడుకూడ దొంగయేయని వెల్లడించుట యర్థాంతరస్ఫూర్తి. ఇట్లు లోకోక్తితోపాటుగా, అర్థాంతరస్ఫురణముకూడ నుండుటచేతనే, ఇది ఛేకోక్తి యగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కథిత లోకోక్తి యన్యార్థగర్భితము
కృతుల ఛేకోక్తి యనఁగ సమ్మతికి నెక్కుఁ;
బన్నగము పాదములజాడఁ బన్నగంబ
యెఱిఁగెడి ననంగ లక్ష్య మహీనభూష !

## 92. వక్రోక్త్యలఙ్కారః

156\. వక్రోక్తిః శ్లేష కాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్ ।
ముఞ్చ మానం దినం ప్రాప్తం నేహ నన్దీ హరాన్తికే ॥

టీక ; శ్లేషకాకుభ్యామ్=శ్లేషకాకువులవలన; అపరార్థప్రకల్పనమ్= అన్యార్థమును కల్పించుట; వక్రోక్తిః=వక్రోక్త్యలంకారము॥ మానమ్=ప్రణయ కోపమును; ముఞ్చ=విడిచిపెట్టుము; దినమ్=పగలు; ప్రాప్తమ్=సమీపించి నది॥ ప్రాప్తమ్=దొరికినటువంటి; నందినమ్=నందిని; మా ముఞ్చ=విడువవద్దు॥ నన్దీ=నంది; న + ఇహ=ఇచ్చటలేదు; హర + అన్తికే=శివుని సమీపమున; (అస్తి=కలదు).

వ్యాఖ్య : శ్లేషవలనగాని, కాకువువలనగాని అన్యార్థకల్పనము జరిగిన యెడల, అది వక్రోక్త్యలంకార మగును. ఇది లక్షణము. "నానార్థసంశ్రయః

శ్లేషః' అనేకార్థములు నాశ్రయించుకొని యుండునది శ్లేషము. పదముల కున్న భిన్నార్థములవలన నేర్పడునది అభంగశ్లేషము. వాక్యమునందలి పదములను భిన్నవిధముగా విభాగించుటవలన నేర్పడునది సభంగశ్లేషము. ఈ రెండింటిలో దేనినైన నాశ్రయించుకొని వక్రోక్తి ప్రవర్తింపవచ్చును. 'ప్లుతోచ్చారాది శ్శబ్దవికారః కాకుః' ప్లుతోచ్చారణము మొదలయిన శబ్దవికారము కాకువు. సాభిప్రాయముగా ఒక యక్షరము నొత్తి పల్కుటగాని, తేల్చి పల్కుటగాని, హ్రస్వీకరించుటగాని, దీర్ఘీకరించుటగాని జరుగును. ఇట్లు సాభిప్రాయముగా సాగించిన శబ్దవికారమును 'కాకువు' అని యందురు. ఇట్లు కాకువు నాశ్రయించుకొని అర్థాంతరమును కల్పించుట జరుగవచ్చును. అప్పుడును వక్రోక్త్యలంకారమే యగును. వక్రమైన ఉక్తి వక్రోక్తి యన్నది వ్యుత్పత్తి.

ముఞ్చ మానం దినం ప్రాప్తం నేహ నన్దీ హరాన్తికే- ఇది లక్ష్యము. ఇది నాయికా నాయకుల నర్మప్రసంగమునందలిది. నాయిక ప్రణయకోపమును దాల్చియున్నది. నాయకుడు 'తెల్లవారిపోవుచున్నది. కోపమును విడిచిపెట్టుము' అన్న భావముతో 'ముఞ్చ మానం దినం ప్రాప్తమ్' అని యనెను. నాయిక యింకను మానమును విడువలేదు. అందువలన, ఆ మాటలనే విడదీసి వేరువిధముగా కలిపి భిన్నార్థమును కల్పించి, దానికి సమాధానమును చెప్పెను. ఆమె 'ముఞ్చమా నన్దినం ప్రాపమ్' అని విరిచి 'దొరకిన నందిని విడువవద్దు' అన్న అర్థాంతరమును సాధించి, దానికి సమాధానముగా 'నంది యిక్కడకాదు, శివుని సన్నిధిలో నున్నది' అని చెప్పెను. ఇచ్చట నాయకుని వాక్యమునకు నాయిక సభంగశ్లేషము నాశ్రయించుకొని అర్థాంతరమును కల్పించుట జరిగినది. కావుననే, ఇది శ్లేషాశ్రితమైన వక్రోక్తికి లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అవును వక్రోక్తి శ్లేషకాకువులచేత
నమర నపరార్థకల్పనం బయ్యెనేని;
సూరకవి వేలు పెవ్వఁడు ? సోముఁ డుత్ప
లా ప్తుఁడా ? కాఁడు గౌరీసహాయుఁ డనఁగ.

విమర్శ : సంస్కృతమునందలి లక్ష్యమును తెలుగులోని కనువదించుటకు వీలుకాదు. అందువలన సూరకవి సొంతముగా లక్ష్యమును కల్పించెను. 'సోముడు' అను మాటకు 'చంద్రుడు' అని యర్థము. 'ఉమయా సహితః సోమః' అన్న వ్యుత్పత్తినిబట్టి 'ఈశ్వరుడు' అని యర్థము. మొదటి ప్రశ్నకు సమాధానముగా 'ఈశ్వరుడు' అన్న యర్థమున 'సోముడు' అని చెప్పుట జరిగెను. పృచ్ఛకుడు 'చంద్రుడు' అన్న అర్థాంతరమును గ్రహించి 'ఉత్పలాక్షుడా ?' అని ప్రశ్నించెను. సందేహనివృత్తికొరకై 'గౌరీసహాయుడు' అని చెప్పుట జరిగినది. శ్లేష నాశ్రయించి వక్రతను సాధించుట యిచ్చట జరిగినది కావుననే, యిది శ్లేషాశ్రితమైన వక్రోక్తికి లక్ష్యమగుచున్నది.

కాకువు నాశ్రయించిన వక్రోక్తి కుదాహరణము మూలమునందు లేదు అనువాదమునందుగూడ కానరాదు. కువలయానందమునందున్న లక్ష్యమును గ్రహింతము.

157. అసమాలోచ్య కోపస్తే నోచితోఽయమితీరితా ।
నైవోచితోఽయమితి తం తాడయామాస మాలయా ॥

టీక : అసమాలోచ్య = బాగుగా ఆలోచింపక; అయం కోపః = ఈ కోపము (వహించుట): న + ఉచితః + ఇతి = ఉచితము కాదని; ఈరితా = ప్రార్థింపబడిన నాయిక; అయం = ఇది; న + ఏవ + ఉచితః = ఉచితము కానే కాదు; ఇతి = అని: తమ్ = నాయకుని; మాలయా = పుష్పహారముతో; తాడయామాస = కొట్టెను.

వ్యాఖ్య : 'బాగుగా ఆలోచింపక ఈ కోపమునొందుట బాగుగాలేదు' అని ప్రియుడనగా 'నిజమే. బాగుగాలేదు' అని పూలమాలతో ప్రేయసి యతనిని కొట్టెను-ఇది లక్ష్యము. 'బాగుగాలేదు' అన్న మాటకు 'ఉచితముకాదు' అన్నది యర్థము. 'కొట్టుట' యన్నది కోపకృత్యము. 'బాగుగాలేదు' అన్న మాటకు ప్రకృత సన్నివేశమున 'అనుచితము' అనియే యర్థమైనయెడల తాడనక్రియకు అవకాశమేలేదు. కావున, సందర్భమునుబట్టి 'బాగుగాలేదు' అన్నమాటకు 'అత్యంతోచితము' అన్న యర్థాంతరమును గ్రహింపవలసియుండును. 'నైవోచితః' అని పలుకునప్పుడు మొదటి రెండు వర్ణములపైని ఊనిక యెక్కువగా నుండును. తెలుగునందలి 'నిజమే' అన్నదికూడ స్లు ణా

తముగా నుచ్చరింపబడును. అప్పుడు మాత్రమే అర్థాంతరసిద్ధికి అవకాశ ముండును.

ఇంతకును శ్లేషాశ్రితమైన వక్రోక్తి శాస్త్రసిద్ధము. కాక్వాశ్రితమైన వక్రోక్తి ఐచ్ఛికము. సన్నివేశమునుబట్టి, ఆంగికవిన్యాసమునుబట్టి, తత్కాల క్రియా సాహచర్యమునుబట్టి కాకు వక్రోక్తిని గ్రహింపవలసి యుండును.

## 93. స్వభావోక్త్యలఙ్కారః

158. స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్ ।
కురఙ్గై రుత్తరఙ్గాక్షైః స్తబ్ధకర్ణై రుదీక్షితమ్ ॥

టీక ; జాత్యాదిస్థస్య=జాతి మున్నగువానియందున్న; స్వభావస్య= స్వభావముయొక్క; వర్ణనమ్=వర్ణనము; స్వభావోక్తిః = స్వభావోక్తియన్న యలంకారము॥ ఉత్తరఙ్గాక్షైః=అతిచంచలములగు కన్నులుగల; స్తబ్ధకర్ణైః= నిశ్చలమైన చెవులుగల: కురఙ్గైః=లేళ్ళచేత; ఉదీక్షితమ్=చూడబడెను.

వ్యాఖ్య : జాత్యాదిస్థమైన స్వభావమును వర్ణించినయెడల, అది స్వభావోక్తి యగును. ఇది లక్షణము. జాత్యాదులని యనగా జాతి గుణ క్రియాదులని భావము. స్వభావవర్ణనమని యనగా యాథాతథ్యవర్ణనమని భావము. స్వభావమును వర్ణించెడి ఉక్తి యగుటచేత స్వభావోక్త్యలంకార మన్నపేరు దీనికి అన్వర్థమగుచున్నది.

జాత్యాది వర్ణనమే ప్రధానాంశము కాబట్టి కొందరు దీనిని 'జాతి' యనుపేర వ్యవహరించుటయు గోచరించును.

అతి చంచలములగు కన్నులు కలిగి, నిశ్చలములగు చెవులు కలిగి కురంగములు చూచెను-ఇది లక్ష్యము. ఇందు యాథాతథ్యవర్ణనము మాత్రమే యున్నది. ఇది కురంగవర్ణనము. ఇచ్చట కురంగజాతియొక్క స్వభావము సహజసుందరముగా వర్ణితమైనది. అట్లే కురంగములు చూచునప్పటిస్థితి; అనగా క్రియాస్వభావముకూడ సహజసుందరముగా వర్ణితమైనది. కావుననే, ఇది స్వభావోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అగు స్వభావోక్తి జాత్యాదులందుఁ గల స్వ
భావ మెంతేని వర్ణింపఁబడియెనేని,
హరిణములు చూచె నుత్తరంగాక్షములును
స్తబ్ధకర్ణము లగుచు నస్పందమునను.

## 94. భావికాలఙ్కారః

159. భావికం భూతభావ్యర్థసాక్షాత్కారస్య వర్ణనమ్
అహం విలోకయేఽద్యాపి యుధ్యన్తేఽత్ర సురాసురాః.

టీక : భూతభావి + అర్థ=జరిగిపోయిన కార్యముయొక్క జరుగనున్న కార్యముయొక్క; సాక్షాత్కారస్య=సాక్షాత్కారముయొక్క; వర్ణనమ్=వర్ణనము; భావికమ్=భావికాలంకారము॥ అద్య + అపి=నేడుకూడ; అత్ర=ఇక్కడ; సురాసురాః=దేవదానవులు; యుధ్యన్తే=యుద్ధము చేయుచున్నారు; అహమ్=నేను; విలోకయే=చూచుచున్నాను.

వ్యాఖ్య : జరిగిపోయిన కార్యముయొక్క జరుగనున్న కార్యముయొక్క సాక్షాత్కారవర్ణనము భావికాలంకారము. ఇది లక్షణము. ఎప్పుడో జరిగిపోయిన కార్యమునుగాని, ఇకముందెప్పుడో జరుగనున్న కార్యమునుగాని యిప్పుడు ప్రత్యక్షముగా జరుగుచున్నట్లు వర్ణించుట యిచ్చటి విషయము. 'భావాయ సాక్షాత్కారాయ ప్రభవతీతి భావికమ్'. భావ మనగా సాక్షాత్కారమని యిచ్చటి యర్థము. దానికి సమర్థమైనది కావున దీనికి భావికము అన్న పేరు సార్థకమగుచున్నది.

దేవదానవులు నేడుకూడ యుద్ధము చేయుచున్నారు; నేను చూచుచున్నాను-ఇది లక్ష్యము. దేవ దానవ సంగ్రామము ఎప్పుడో జరిగిపోయిన విషయము. కాని దానిని వర్తమాన క్రియా సాహాయ్యమున వర్ణించుట యిచ్చట జరుగుచున్నది. భూతకాలిక విషయమును, వర్తమానకాలవిషయముగా వర్ణించుటచేతనే, యిది భావికాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇట్లే భవిష్యత్కాలికవిషయముగూడ వర్తమానకాలమున సాక్షాత్కరించినట్లు వర్ణించినయెడల, అదికూడ భావికాలంకారమే యగును,

ఆంధ్రచంద్రాలోకము

గీ. అలరు భావికమనఁగ గతాగతార్థ
ములు పదంపడి ప్రత్యక్షముగ వచింప;
నిప్పటికి నేను జూచెద నిచట దితిజ
దనుజు లనియొనరించెద రనినమాడ్కి.

## 95. ఉదాత్తాలఙ్కారః

160. ఉదాత్తమృద్ధిశ్చరితం శ్లాఘ్యం వాన్యోపలక్షణమ్
సానౌ యత్రాభవద్యుద్ధం తద్ధూర్జటి కిరీటినోః.

టీక: ఋద్ధిః (+వా)=సమృద్ధినిగాని; అన్య+ఉపలక్షణమ్ = ఇతర మునకంగమైన; శ్లాఘ్యమ్=ప్రశంసనీయమైన; చరితమ్+వా=ప్రవర్తనము గాని; (వర్ణితమ్+చేత్=వర్ణితమైనయెడల); ఉదాత్తమ్=ఉదాత్తాలంకారము; (స్యాత్=అగును)॥ యత్ర=ఎచ్చట; తత్=ప్రసిద్ధులయిన; ధూర్జటికిరీటినోః= ఈశ్వరునకు అర్జునునకు; యుద్ధమ్ = సంగ్రామము; అభవత్ = జరిగెనో; (తస్మిన్+) సానౌ=ఆ పర్వతశిఖరమునందు. (వాక్యము సమాప్తము కాలేదు).

వ్యాఖ్య: సమృద్ధినిగాని, అన్యోపలక్షణమైన శ్లాఘ్యచరితమునుగాని వర్ణించినయెడల, అది ఉదాత్తాలంకార మగును. అన్యోపలక్షణమని యనగా వర్ణ్యమున కంగభూతమైనదని తాత్పర్యము వర్ణ్యముయొక్క విశిష్టతనుగాక, వర్ణ్యాంగముయొక్క శ్లాఘ్యచరితమును వర్ణించుటచేత సైతము వర్ణ్యమున కుత్కర్షము కలుగును. 'ఉత్కర్షేణాధీయతే గృహ్యతే స్మేత్యుదాత్తమ్'. ఉత్కర్షముచేత గ్రహింపబడినది యుదాత్తము. ఇది వ్యుత్పత్తి. సమృద్ధియనుటచేత సంపదాదులయొక్క యుత్కర్షమును గ్రహించుట జరుగును; అంగముయొక్క శ్లాఘ్యచరితవర్ణనముచేత వర్ణ్యముయొక్క యుత్కర్షమును గ్రహించుట జరుగును. ఈ రెండుచోట్ల నున్నది (ఉత్+ఆత్తము) ఉత్కర్షముచేత గ్రహించుటయే. కావుననే దీనికి ఉదాత్తమన్న పేరు సార్థకమగుచున్నది.

ఆ ధూర్జటి కిరీటులు యుద్ధముచేసిన పర్వతశిఖర మిది. ఇది లక్ష్యము. ధూర్జటి కిరీటులు ప్రసిద్ధులు. పాశుపతాస్త్ర సంపాదన సందర్భమున అర్జునున కును కిరాతకవేషముననున్న ధూర్జటికిని జరిగిన యుద్ధము పురాణప్రసిద్ధము.

అది హిమాలయపర్వతప్రదేశమున జరిగినది.. ప్రకృతవర్ణ్యము హిమాలయము. హిమాలయముయొక్క యుత్కర్షమును చెప్పుటకై ధూర్జటి కిరీటుల సంగ్రామ విషయము ప్రసక్తమైనది. ఇది వర్ణ్యమున కంగముగా నుపకరించునదేకాని ప్రధానవిషయము కాదు. అయినను దీనిని వర్ణించుటచేతనే హిమాలయమున కుత్కర్షము చేకూరుచున్నది. ఇది పైని చెప్పికొన్నవానిలో రెండవదైన వర్ణ్యోపలక్షణశ్లాఘ్యచరిత వర్ణనరూపమైన యుదాత్తాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. శ్లాఘనీయంబు నన్యోపలక్షణంబు
నైన చరితం బుదాత్తమై యతిశయిల్లు;
నా హర కిరీటులకు యుద్ధమయ్యె నెచట
నదియ యిది యనుచందాన నహివిభూష !

విమర్శ: మూలమునందలి "ఋద్ధిః" అను పదము విడువబడినది. అనగా సంపదాది సమృద్ధిని వర్ణించినయెడల, అది ఉదాత్తమగునన్న భాగ మును స్పృశించుట జరుగలేదు. రెండవయంశము మాత్రమే గ్రహింపబడి లక్షణమునందు నిరూపితమైనది. తదనుసారముగానే లక్ష్యము ప్రదర్శింప బడినది. లక్ష్యమునుబట్టి లక్షణ మిట్లే యుండుట సమంజస మనిపించును. మూలగ్రంథమునందు సైతము సమృద్ధివర్ణనరూపమైన యుదాత్తమునకు లక్ష్యము చూపబడలేదు. దాని ననుసరించి ఆంధ్రచంద్రాలోకముకూడ ఒక్క లక్ష్యమునే చూపుట జరిగినది: తదనుసారముగా లక్షణమును సవరించుట జరిగినది. నిజమునకు సమృద్ధివర్ణనముకూడ ఉదాత్తమే యగును. కావున దానినిగూడ గ్రహించుటయే యుచితము. కువలయానందమునందలి లక్ష్య మును గ్రహింతము.

161. రత్నస్తంభేషు సంక్రాన్తైః ప్రతిబింబశతైర్వృతః
జ్ఞాతో లఙ్కేశ్వరః కృచ్ఛ్రాదాఞ్జనేయేన తత్త్వతః.

టీక: రత్నస్తంభేషు = రత్నములు పొదిగిన స్తంభములయందు; సంక్రాన్తైః=సంక్రమించినటువంటి; ప్రతిబింబశతైః=అనేక ప్రతిబింబములచేత; వృతః=ఆవరింపబడిన; లఙ్కేశ్వరః=లంకాధిపతియైన రావణుడు; తత్త్వతః=

వాస్తవముగా; ఆఞ్జనేయేన=హనుమంతునిచేత; కృచ్ఛ్రాత్=కష్టముమీద; జ్ఞాతః=తెలిసికొనబడెను.

వ్యాఖ్య : రత్నస్తంభములయందలి పండలకొలది ప్రతిబింబములచేత నావరింపబడిన రావణుని నతికష్టముమీద నాంజనేయుడు తెలిసికొనెను–ఇది లక్ష్యము. రావణుని కొలువుకూటమునందు అత్యధికసంఖ్యాకములైన రత్నమయస్తంభములు గలవు. రావణుడు తన సింహాసనమునందు కూర్చుండి యుండగా, అతని ప్రతిబింబము లన్నిస్తంభములందును ప్రతిఫలించును. అందువలన ప్రతిబింబరూపమైన రావణు డెవరో, వాస్తవరూపమైన రావణు డెవరో గుర్తించుట వీలుకాదు. అయినను హనుమంతుడు మతిమంతుడు గావున నతికష్టముమీద గుర్తింపగలిగెను. ఈ వర్ణనమువలన రావణుని సంపద వెల్లడియగుచున్నది. కావుననే యిది సమృద్ధివర్ణనరూపమైన యుదాత్తాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

## 96. అత్యుక్త్యలఙ్కారః

**162.** అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాది వర్ణనమ్
త్వయి దాతరి రాజేన్ద్ర ! యాచకాః కల్పశాఖినః.

టీక ; అద్భుత=ఆశ్చర్యకరమైన; అతథ్య=అవాస్తవమైన; శౌర్య + ఔదార్యాదివర్ణనమ్=పరాక్రమము ఔదార్యము మున్నగువానియొక్క వర్ణనము; అత్యుక్తిః=అత్యుక్తియన్న యలంకారము. రాజేన్ద్ర=ఓమహారాజా; త్వయి=నీవు; దాతరి=దాతవైయుండగా; యాచకాః=యాచకులు; కల్పశాఖినః=కల్పవృక్షములు.

వ్యాఖ్య : అద్భుతము నతథ్యమునైన శౌర్యౌదార్యాది వర్ణనము అత్యుక్తి యగును. ఇది లక్షణము. అతిశయపూర్వకమైన ఉక్తి యన్న వ్యుత్పత్తినిబట్టియే అత్యుక్తి అన్వర్థమగుచున్నది. పేరునుబట్టి యైనచో అతిశయోక్తికిని అత్యుక్తికిని సంబంధమున్నట్లు తోచును. రెండింటియందును అతిశయముగా చెప్పుట యున్నమాట వాస్తవమే. అతిశయోక్తియందలి ఏడు భేదములలోను మిథ్యాత్వప్రసక్తిలేదు. మిథ్యాత్వప్రసక్తిచేతనే అత్యుక్తి వేరుగా పరిగణింపబడవలసి యున్నది. మిథ్యారూపమైన శౌర్యాదిగుణములను అతిశయముగా ఆశ్చర్యము కలుగునట్లుగా వర్ణించుట యిచ్చట జరుగును.

ఓ మహారాజా! నీవు దాతవై యుండగా యాచకులు కల్పవృక్షములు-ఇది లక్ష్యము. ఇది మహారాజుయొక్క దాతృత్వము నతిశయముగా వర్ణించుచు, ఒక చాటుకారుడు పలికిన వాక్యము. యాచకులు కల్పవృక్షము లగుట మిథ్యాకల్పనము. కల్పవృక్షములు సర్వఫలసంధాయకములు. యాచకులు కల్పవృక్షసదృశములగుట ఏమాత్రమును జరుగదు. అయినను, ప్రకృత మిథ్యాకల్పనమువలన రాజుయొక్క దాతృత్వమున కతిశయమునుగూర్చుట జరుగుచున్నది. కావుననే, యిది అత్యుక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

కొందరు యాచకులు కల్పవృక్షములగుట కాక, కల్పవృక్షములు యాచకులని యన్వయించుటయు కలదు. ఇతరుల కోరికలను తీర్చు కల్పవృక్షములే కోరికలతో నిన్నాశ్రయించుచున్నవన్నది తాత్పర్యము. అప్పుడుకూడ మిథ్యా కల్పనమే జరుగుచున్నది. అద్భుతముకూడ అగుచున్నది. దీనివలన రాజు యొక్క దాతృత్వమునకు అతిశయమును గూర్చుటయే జరుగుచున్నది. అప్పుడును అత్యుక్తికి లక్ష్యము గుట కభ్యంతరములేదు.

ఆంధ్రచంద్రాలోకము

గీ. తనరు నత్యుక్తి యద్భుతాతథ్య శౌర్య
వితరణాదిక వర్ణనాస్థితి నగుచు;
దాత నీవగుచుండఁగ ధరణినాథ!
యాచకులు కల్పశాఖు లన్నట్లు కృతుల.

## 97. నిరుక్త్యలఙ్కారః

163. నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్
ఈదృశై శ్చరితై ర్జానే సత్యం దోషాకరో భవాన్.

టీక: యోగతః=శబ్దములయొక్క యోగమునుబట్టి; నామ్నామ్=నామధేయములకు; అన్యార్థత్వప్రకల్పనమ్ = అర్థాంతరమును గల్పించుట; నిరుక్తిః=నిరుక్తియన్న యలంకారము॥ ఈదృశైః=ఈవిధమైన; చరిత్రైః=ప్రవర్తనమువలన; జానే=తెలిసికొందును; సత్యమ్=నిజముగా; భవాన్=నీవు; దోషాకరః=దోషాకరుడవు.

వ్యాఖ్య ; శబ్దయోగమునుబట్టి నామధేయములకు అర్థాంతరకల్పనము చేసినయెడల, అది నిరుక్త్యలంకార మగును. ఇది లక్షణము. శబ్దయోగము అని యనగా వ్యుత్పత్తి యనియే భావము. ఒక నామధేయమునకు రూఢినిబట్టి యొక యర్థము కలుగవలసి యుండగా, యోగమునుబట్టి అన్యార్థమును కల్పించుట యిచ్చట జరుగును. 'నిశ్చిత్యోక్తి న్నిరుక్తిః' అన్నది వ్యుత్పత్తి నిశ్చయించి పలుకుట నిరుక్తి యని భావము. ఒక నామధేయమునందలి యంగములను వేర్వేరుగా నిర్ణయించి, వానియొక్క సంయోగమువలన నొక యర్థమును కల్పించుట యిచ్చట నుండును. కావున దీనికి నిరుక్తి యన్నపేరు సార్థకమగుచున్నది.

ఓ చంద్రా ! ఈ విధమైన పనులచేతనే నీవు దోషాకరుడవని తెలిసికొందును-ఇది లక్ష్యము. విరహిణి చంద్రోపాలంభనము జేయుచు పలికిన వాక్యమిది. 'చంద్రుడు' అన్న యర్థమున 'దోషాకరుడు' అన్న పదము కలదు. ఈ రెండును పర్యాయపదములు. విరహిణులకు వెచ్చని వెన్నెల కాయుట మొదలగు దోషములను చంద్రుడు చేయుచుండునట ! అందువలననే విరహమగ్నయగు నాయిక 'దోషాకరుడు' అని యుపయోగించుచున్నది. ఆమె మనోభావమునుబట్టి దోషములకు ఆకరమైనవాడు కాబట్టి చంద్రుడు దోషాకరుడగుచున్నాడు. ఇది అర్థాంతరకల్పనమే. నిజమైన అర్థ మిదికాదు. 'దోషా' అని యనగా 'రాత్రి' యని యర్థము. ఇది యవ్యయము. "దోషా కరోతీతి దోషాకరః" అన్నది వ్యుత్పత్తి. రాత్రిని కలిగించువాడు అన్న వ్యుత్పత్తినిబట్టి చంద్రునకు దోషాకరుడు అన్న నామధేయము కలిగినది. దీనికి దోషములతో ఏమాత్రమును సంబంధములేదు. అయినను శబ్దయోగమునుబట్టియే అన్యార్థకల్పనముచేయుట జరుగుచున్నది కాబట్టి యీ వాక్యము నిరుక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. అధికయోగమువలన నన్యార్థఘటన
నామముల కైనను నిరుక్తి నా నెసంగు;
నీదృశచరిత్రములచేత నే నెఱిఁగెద
నీవు దోషాకరుండవు నిజ మనంగ.

## 98. ప్రతిషేధాలఙ్కారః

164. ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధస్యాను వర్ణనమ్
న ద్యూత మేతత్కితవ ! క్రీడనం నిశితై శ్శరైః.

టీక : ప్రసిద్ధస్య=ప్రసిద్ధమైన; నిషేధస్య=నిషేధముయొక్క: అనువర్ణనమ్=పునర్వర్ణనము; ప్రతిషేధః=ప్రతిషేధమన్న యలంకారము॥ కితవ= ఓ జూదరీ; ఏతత్=ఇది; ద్యూతమ్+న=ద్యూతముకాదు; నిశితైః+శరైః= వాడియైన బాణములతో: క్రీడనమ్=ఆటుట॥

వ్యాఖ్య : ప్రసిద్ధమైయున్న నిషేధమును మరల చెప్పుట ప్రతిషేధము. ఇది లక్షణము. ఒక విషయమును తదన్యముకంటె భిన్నమని చెప్పవలసిన యవసరములేదు. ఒకజాతి తక్కిన జాతులకంటె భిన్నము. ఒకవ్యక్తి తక్కిన వ్యక్తులకంటె భిన్నము. ఒక విషయము తక్కిన విషయములకంటె భిన్నము. సామూహికముగా నొక సాదృశ్య మున్నను వ్యక్తినిష్ఠమైన ధర్మముచేత భిన్నత్వమును ప్రదర్శించును. కావున ఒక వస్తువు మరొక వస్తువు కాదన్న నిషేధము సుప్రసిద్ధమే. దానిని పేర్కొని వర్ణింపవలసిన యవసరములేదు. అట్లు పేర్కొనుటచేత చమత్కారము కలుగుట యిచ్చట కలదు. ప్రతిషేధ మనగా నిషేధమనియే యర్థము. నిషేధము నాధారముగా చేసికొని ప్రవర్తించుటచేతనే దీనికి ప్రతిషేధాలంకార మన్నపేరు సార్థకమగుచున్నది.

ఓయీ! జూదరీ! ఇది జూదముకాదు: వాడిబాణములతోడి క్రీడ- ఇది లక్ష్యము. ఇది శకునితో శత్రువీరుడు యుద్ధరంగమున నుపాలంభన పూర్వకముగా పలికినమాట. యుద్ధము జూదము కాదనుట ప్రసిద్ధమే. యుద్ధము యుద్ధమేకాని మరేమియుకాదు. అట్టియెడల జూదమును మాత్రమే యెత్తిచూపి నిషేధించుటలో ఒక విశేషమున్నది. శకుని ద్యూతమునందు చాతుర్యముగలవాడు. 'నీ చాతుర్యము చూపుట కిది ద్యూతముకాదు; ఇది యుద్ధము. ఇచ్చట నీ చాతుర్యము చెల్లదు.' అని పరిహసించుటవలన చమత్కారము కలుగుచున్నది. 'జూదరీ' అన్న సంబోధనమువలన వక్తృభావము మరింత స్పష్టతను సాధించుకొనుచున్నది. మొత్తముమీద ప్రసిద్ధమైన నిషేధమును మరల వర్ణనము చేయుటచేత, ఇది ప్రతిషేధాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కృతిఁ బ్రసిద్ధ నిషేధానుకీర్తనంబు
పనుపడినయేని బ్రతిషేధమనఁగఁ బరఁగు;
గితవ ! యతిశితసాయక క్రీడనంబు
గాని కాదిది జూద మన్కారణి శర్వ !

## 99. విధ్యలఙ్కారః

165. సిద్ధస్యైవ విధానం యత్తామాహు ర్విధ్యలఙ్కృతిమ్ ।
పఞ్చమోదఞ్చనే కాలే కోకిలః కోకిలో భవేత్ ॥

సిద్ధస్య + ఏవ=సిద్ధమైనదానికే; విధానమ్ = విధించుట; యత్=ఏది యో; తామ్=దానిని; విధి + అలఙ్కృతిమ్=విధియన్న యలంకారముగా; ఆహుః = పిలుతురు॥ పఞ్చమ + ఉదఞ్చనే=పంచమస్వరము నుచ్చరింపజేయు; కాలే=కాలమున; కోకిలః=కోకిలము; కోకిలః= నిజమైన కోకిలము; భవేత్= అగును.

వ్యాఖ్య: సిద్ధమైనదానికే విధించుట విధ్యలంకారము. ఇది లక్షణము. ఇది వెనుకటి ప్రతిషేధమునకు సరిగా ప్రతిలోమముగా వ్యవహరించును. సిద్ధముకానిదానిని సిద్ధముచేయుట సాధారణము. దాని కోసము ఆవశ్యకమైన విధానము జరుగును. ఇచ్చట సిద్ధమైన దానినే సిద్ధమని విధించుట జరుగు చున్నది. దీనివలన అర్థాంతరస్ఫూర్తి కలిగి చమత్కారమును కలిగించును. విధించుటయే విధి. విధించుట యాధారముగా ప్రవర్తించుటచేత, దీనికి విధ్య లంకార మన్నపేరు అన్వర్థమగుచున్నది,

పంచమస్వరోత్పాదనకాలమున కోకిలము కోకిలమగును-ఇది లక్ష్యము. కోకిలమునకు స్వతస్సిద్ధముగనే కోకిలత్వమున్నది; దానికి తిరిగి కోకిలత్వ మును విధింపవలసిన యావశ్యకము లేదు. కాని, యిచ్చట వసంతకాలమున మాత్రమే కోకిలత్వమును విధించుట జరుగుచున్నది. ఇది విశేషార్థసంపాదన మునకు సహకరించుచున్నది. కోకిల విశిష్టత్వము పంచమస్వరశాలిత్వమునం దున్నది. ఇతరకాలములందు లేని పంచమస్వరశాలిత్వము కోకిలమునకు వసంతకాలముననే సంక్రమించును. అందువలననే అది నిజమైన కోకిల

మగును. అనగా మనోహరస్వరము గలిగి సర్వజన హృదయాహ్లాదకము కా గలిగినది వసంతకాలమునందుమాత్రమే యన్నది విశిష్టార్థము. ఈ విశిష్టార్థ మును స్ఫురింపచేయుటకే సిద్ధమైనదానికే విధించుట యిచ్చట జరిగినది. కావుననే యిది విధ్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. సిద్ధమగు నర్థమును వెండిఁ జెప్పిరేని
విధ్యలంకృతి యనఁగను వినుతిఁ గాంచుఁ;
బంచమం బెత్తుగడ చేయఁబడియెనేనిఁ
గోకిలం బప్పుడవుఁగదా కోకిలంబు!

## 100. హేత్వలఙ్కారః

166. హేతో ర్హేతుమతా సార్థం వర్ణనం హేతు రుచ్యతే ॥
అసావుదేతి శీతాంశు ర్మానభేదాయ సుభ్రువామ్ ॥

టీక : హేతుమతా + సార్థమ్=కార్యముతో పాటుగా; హేతోః=కార ణముయొక్క; వర్ణనమ్=వర్ణనము; హేతుః=హేత్వలంకారముగా; ఉచ్యతే= చెప్పబడును॥ అసౌ + శీతాంశుః=ఈ చంద్రుడు; సుభ్రువామ్=యువతుల యొక్క; మానభేదాయ=మానచ్ఛేదముకొరకై; ఉదేతి=ఉదయించుచున్నాడు.

వ్యాఖ్య : హేతుమంతముతో పాటుగా హేతువును వర్ణించినయెడల అది హేత్వలంకార మగును. ఇది లక్షణము. హేతుమంతము అని యనగా కారణసాధ్యమైన కార్యమని తాత్పర్యము. కారణమును, దానివలన సాధింప బడు కార్యము నొకే వాక్యమునందు కలిపి చెప్పుట యిచ్చట జరుగును. హేతువును ముఖ్యముగా చేసికొని ప్రవర్తించున దగుటచే దీనికి హేత్వలం కారమన్న పేరు సార్థకమై చెల్లుచున్నది.

అదిగో! యువతుల మానభేదమునకై శీతాంశు డుదయించుచున్నాడు- ఇది లక్ష్యము. శీతాంశు డుదయించుటకు యువతుల మానభేదమునకు హేతు హేతుమత్సంబంధము కలదు. శీతాంశు డుదయించుట కారణము. అంత వరకు మానము వహించిన మానవతుల బిగువు సడలును. కోపోపశమనము కలుగును. నాయకులకు ప్రసన్నలగుదురు. ఈ కార్యమున కంతటికిని శీతాం

శూదయమే కారణము. ఈ రెండింటి నొకే వాక్యమునందు కలిపి చెప్పుట చేతనే, ఇది హేత్వలంకారమునకు లక్ష్యమగుచున్నది.

చంద్రోదయమువలన నితరుల కితరఫలములు కలుగవచ్చును. కాని వక్త తత్ఫలమును నియతము చేయుటచేత సన్నివేశచారుత్వము సమధిక ముగా ఆవిష్కృతమగును. ఇతర ఫలములను వారించుటచేత ఏ కనిష్ఠమైన సౌందర్యము సహృదయ హృదయరంజకమగును.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కార్యకారణములు రెండు గలియఁబలికె
నేని యది హేత్వలంకృతి నా నెసంగు;
నుదయమందెడు నీ శశి మదవతీక
దంబ మానము ల్విచ్చు చెయ్దంబుకొఱకు.

రెండవభేదము

167. హేతు హేతుమతో రైక్యం హేతుం కేచిత్ప్రచక్షతే ।
లక్ష్మీవిలాసా విదుషాం కటాక్షా వేఙ్కటప్రభోః ॥

టీక : హేతు హేతుమతోః=హేతువు యొక్కయు హేతుమంతము యొక్కయు; ఐక్యమ్=ఏకత్వమును; కేచిత్=కొందరు; హేతుమ్=హేత్వలం కారమని; ప్రచక్షతే = చెప్పుదురు॥ వేఙ్కటప్రభోః = శ్రీ వేంకటేశ్వరుని యొక్క; కటాక్షాః=కటాక్షములు; విదుషామ్=పండితులకు; లక్ష్మీవిలాసాః= సంపద్విలాసములు.

వ్యాఖ్య: హేతు హేతుమంతముల కేకత్వమును వర్ణించిన హేత్వలం కారమగును. ఇది హేత్వలంకారమునందలి రెండవభేదమునకు లక్షణము. మొదటి భేదమునందు కారణకార్యములు రెండును స్పష్టముగా భిన్నముగా నున్నవి. వాని నొకచోట చేర్చి చెప్పుట మాత్రమే యచ్చట జరిగినది. ఈ రెండవ భేదమునందు కారణకార్యములకు రెండింటికి అభేదమును చెప్పుట జరుగును. అందువలన కారణకార్యము లొక్కటిగానే వ్యవహరించును. ఇచ్చటకూడ హేతువు నాశ్రయించియే యలంకారము ప్రవర్తించుచున్నది. కావుననే దీనికిని హేత్వలంకారమన్న పేరు చెల్లుచున్నది.

వేంకటప్రభుని కటాక్షములు విద్వాంసులకు లక్ష్మీవిలాసములు-ఇది లక్ష్యము. కటాక్షములు కారణము; అందువలన లభించునవి లక్ష్మీవిలాసములు. కావున లక్ష్మీవిలాసములు కార్యము. నిజమున కీరెండును భిన్నములే. కాని 'కటాక్షములే లక్ష్మీవిలాసములు' అని యనుటచేత అభేదము సాధింపబడుచున్నది. కావున హేతు హేతుమంతములకు సాధింపబడిన ఏకత్వమునుబట్టి, ఇది హేత్వలంకారమునకు లక్ష్యమగుచున్నది.

తొలుత కారణముండి, తరువాత కార్యముండును. రెండింటికిని నడుమ సాధారణముగా కొంత యెడముండును. వేంకటేశ్వరుని కటాక్షప్రసారము జరిగినవెంటనే, అవ్యవహితముగానే, పండితులకు లక్ష్మీవిలాసము లభించునన్నది తాత్పర్యము. శీఘ్రతానుస్ఫూర్తికై హేతు హేతుమంతముల నైక్యము తోడ్పడుచున్నది.

ఆంధ్రచంద్రాలోకము

గీ. కార్యకారణములకు నైక్యమగునేనిఁ
గృతులఁ గొందఱు హేత్వలంకృతియ యంద్రు;
సత్కవులకున్ రమావిలాసములు వేంక
టేశ్వర కటాక్షము లనంగ నిందుమౌళి!







శ్రీపతిప్రెస్, కాకినాడ — 1973.

# స్ఫూర్తిశ్రీ గ్రంథావళి

**కవిజనాశ్రయము**

వేములవాడ భీమకవి రచన. సంగ్రహటీకతో, చక్కని యుదాహరణములతో ముచ్చటయిన మూడవ ముద్రణ.

రు. 2_50

**లక్షణపూర్ణిమ**

వ్యాకరణ చ్ఛందోలంకార విశిష్టము. బి. ఏ. స్పెషలు తెలుగు విద్యార్థులకు పాఠ్యగ్రంథము.

సాదా ప్రతి రు. 8-00 మేలు ప్రతి రు. 12_00

**తెలుగుభాషాచరిత్ర**

తెలుగుభాష ఆదికాలము నుండి ఆధునికకాలమువరకు పొందిన పరిణామము; ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణము. మూడవ ముద్రణ.

సాదా ప్రతి రు. 10_00 మేలు ప్రతి రు 15_00

**బాలప్రౌఢ వ్యాకరణసర్వస్వము**

బాలవ్యాకరణమునకు, ప్రౌఢవ్యాకరణమునకు ప్రతి సూత్ర తులనాత్మక వ్యాఖ్యానము. రెండు సంపుటములు. ఒక్కొక్క సంపుటము_

సాదా ప్రతి రు. 10_00 మేలు ప్రతి రు. 15_00

**స్ఫూర్తిశ్రీ వ్యాసావళి**

సాహిత్యవ్యాసములు. రెండు భాగములు.

ఒక్కొక్క భాగము రు. 2_00

**మాటలతో మంతనాలు**

భాషాశాస్త్రీయ వ్యాసములు. సులభశైలిలో విలువైన విషయములు రు. 2_50

**మాటలంటే మాటలా !**

భాషాశాస్త్రీయవ్యాసములు. వినోదవిజ్ఞానాత్మకములు.

రు. 2_50

---

CHANDRALOKA SAMUNMESHAMU

**Price** **Rupees Six**